# దీనజనబాంధవుడు
## శ్రీ వేముల కూర్మయ్య





డా॥ జి.వి. పూర్ణచంద్

# దీనజనబాంధవుడు

## శ్రీ వేముల కూర్మయ్య

రచన

డా|| జి.వి. పూర్ణచంద్

☎ 434320 PP
436936 Res

శ్రీమధులత పబ్లికేషన్స్

28-3-49, సంజీవయ్య కాలనీ, అరండల్‌పేట, విజయవాడ - 520 002.

**Deenajana Bandhavudu**
**Sree Vemula Kurmaiah**

By
**Dr. G.V. Purnachand**
Susruta Nursing Home
Cherukupallivari Street,
Governorpet, Vijayawada -2.
Ph: 433542 (O) 411171 (R)



First Adition : 23-1-2000

Price : 40/-



*Title Designed by:*
**P. SAMBI REDDY**

*Tipe Setting .*
**PRINT PLAZA**
D.No. 27-19-13
Sri Rupa Complex, Durgaiah Street,
Governorpet, Vijayawada - 520 002

*Printing :*
**VAASU OFFSET,**
Arundelpet, VJA-2 Ph: 438324

*Publisher :*
**SREE MADHULATHA PUBLICATIONS**
Arundelpet, VIJAYAWADA - 2
Ph: (R) 436936 (S) 434320 p.p.

# సమర్పణ

గాంధీ, అంబేద్కర్, కూర్మయ్యగార్ల
మార్గంలో
దీనజన సముద్ధరణ కోసం
సేవాబద్ధులైన
పురోగాములకు

వినమ్రతతో
డా॥జి.వి.

# శ్రేయః శుభాకాంక్షలు

పద్మశ్రీ కళాప్రపూర్ణ డా॥ బోయిభీమన్న

..జాతి హితమూ, ప్రజాశ్రేయస్సూ లక్ష్యంగా సాగే ఏ ఉద్యమానికైనా సర్వ జనామోదం లభిస్తుంది. ఉత్సాహవంతులైన స్త్రీ పురుషులందరూ కూడా అలాంటి ఉద్యమం పట్ల సుముఖత జూపుతారు. చాలామంది ఉద్యమంలో చేరుతారు. ధైర్యసాహసాలు గలవాళ్ళు ముందుకు వచ్చి తామే ఉద్యమాన్ని నడిపిస్తారుకూడా.

10వ శతాబ్దంలో ప్రారంభమయి, 20వ శతాబ్దంలో ఉధృతమై, లక్ష్యాన్ని సాధించిన ఉద్యమం భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలనే లక్ష్యంతోనే విదేశీ ప్రభుత్వంపై పోరాటం జరిపిన ఉద్యమం జాతీయోద్యమం. అదే కాంగ్రెస్ ఉద్యమం. కుల,మత, వర్గ భేదాలు లేకుండా ఆ ఉద్యమాన్ని విజయపథంలో నడిపించినవాడు గాంధీజీ. ఆయన ఏకైక నాయకుడు.

ఏ ఉద్యమానికైనా ప్రథమశ్రేణి నాయకుడు ఒక్కడే వుంటాడు. నాయకుడు ఒక్కడైతేనే ఉద్యమం ముందుకు సాగుతుంది. ద్వితీయ శ్రేణిలో నాయకులు ఇద్దరు వుంటారు. ఈ జంటనాయకత్వం ఏ రంగంలో అయినా వుంటుంది. రాజకీయ రంగంలో, ఆంధ్రదేశంలో ఆకాలంలో జాతీయోద్యమాన్ని నడిపించిన జంటనాయకులలో పట్టాభి ఒకరు, ప్రకాశం ఒకరు.

ఈ దేశంలో సమాజ వ్యవస్థ మూడు భాగాలుగా వుంది. సవర్ణులు, అవర్ణులు. మైనారిటీలు. మొత్తం దేశాన్నీ, జాతినీ నడిపించే నాయకులు సవర్ణులే అయి వుంటారు. అవర్ణులనుంచి ప్రత్యేకంగా ఉద్యమంలో పాల్గొన్న అగ్రగాములు యిద్దరు. వేముల కూర్మయ్య. బి.యస్.మూర్తి. (బయ్యా సూర్యానారాయణమూర్తి). కూర్మయ్యగారు పట్టాభివర్గానికీ. మూర్తిగారు ప్రకాశం వర్గానికీ చేరివుండే వారు. అవర్ణులంటే అస్పృశ్యులుగా చూడబడే కులాలవాళ్ళు. అందులో ప్రధానకులాలు మాల. మాదిగ. రెల్లి ఆనాటికి యీ అవర్ణకులాలను పంచములు అంటున్నారు. తరువాత ఆదిఆంధ్ర. ఆదిహిందూపేర్లతో పిలవబడ్డారు. తరువాత హరిజనులయ్యారు. ప్రభుత్వం లెక్కల్లో డిప్రెస్డ్ క్లాసులు, నిమ్నజాతులు అనబడిన వాళ్ళు వీళ్ళే. వీరు ఏ పేరుతో పిలవబడ్డా, వీళ్ళనుంచి జాతీయోద్యమంలో చాలా చురుగ్గా పాల్గొన్న చాలమంది అగ్రగాములలో సర్వజనీన నాయకత్వంలోకి వెళ్ళిన వాళ్ళు మాత్రం కూర్మయ్య. మూర్తి. ఈఇద్దరూ నాకు సన్నిహితులే. నేను విద్యార్థిదశ నుంచీ కాంగ్రెసులో వుంటూ. నా కులం నాయకులైన యీ ఇద్దరి వెంటా తిరిగినవాణ్ణే.

మొత్తం ప్రజలందరకూ. అన్ని కులాలవారికీ కూడా సన్నిహితులై వాళ్ళ సమస్యల్నీ దేశ సమస్యల్నీ కూడా పరిష్కరించగల అగ్రశ్రేణికి ఎదిగిన వాళ్ళు యీ యిద్దరూ. ముఖ్యంగా పంచములకు వీళ్ళిద్దరే నాయకులు. ఈ యిద్దరిలో కూర్మయ్యగారు

పెద్దవాడు కనుక ఎక్కువమంది జనం ఆయన వెనక వుండేవాళ్ళు. సమస్యల పరిష్కారంలో కూడా ఆయన పద్ధతులు సామరస్యపూర్వకంగా వుండేవి.

1936లో ఎన్నికలు జరిగి, కాంగ్రెస్ఒక రాజకీయ పార్టీగా ఆ ఎన్నికలలో పాల్గొని విజయం సాధించేవరకూ ఊహామాత్రంగా వున్న స్వరాజ్యం, అప్పుడు కనుచూపుమేరలో స్పష్టంగా కనిపించింది. న్యాయంగా ప్రకాశం గారికి రావలసిన ముఖ్యమంత్రి పదవి రాజగోపాలాచారి పరం కావడంతో అంతవరకూ కలిసి ఉద్యమం నడిపించిన నాయకులలో వైయక్తిక పదవీ చింతన ప్రారంభమైంది. స్వరాజ్య ప్రాప్తి ముహూర్తం దగ్గర పడే కొలదీ, సముద్రం చేరువలోకి వచ్చిన అఖండ గోదావరివలె నాయకత్వంలో చీలికలు ఏర్పడ్డాయి. గౌతమీ వశిష్టలవలె మూర్తీ కూర్మయ్యలు తమ తమ వ్యక్తిత్వాలను వెదుక్కోసాగారు. రాజగోపాలాచారి మంత్రివర్గంలో కూర్మయ్యగారి నిజాయితీ మనస్తత్వాన్ని తమకనుకూలంగా ఉపయోగించుకుని మూర్తిగారు పార్లమెంటరీ సెక్రటరీ కాగలిగారు.. రాజకీయాలంటే ఏమిటో పూర్తిగా గ్రహించిన కూర్మయ్యగారు 1946 ఎన్నికల తరువాత ఏర్పడ్డ ప్రకాశం గారి మంత్రి వర్గంలో మంత్రి కాగలిగారు.

అప్పటి వరకూ రాజకీయమా, సాహిత్యమా అనే ప్రశ్నకు జవాబు చెప్పుకోలేని నేను ఇటు రాజకీయనాయకుల దగ్గర కవిగా, అటుకవుల దగ్గర రాజకీయనాయకుడిగా రెండు రాజమార్గాల మొగలో నిలబడి చుక్కలు లెక్కపెడుతున్నాను. జనవాణి, జయభేరి, నవజీవన ప్రజామిత్ర పత్రికల మీదుగా ఆంధ్రప్రభలో చేరి జర్నలిస్టుగా ఎదుగుతున్న నేను ఆ కాలంలోనే ఒక నిర్ణయానికి రాగలిగాను. ఆ నిర్ణయం ఏమిటంటే - సాహిత్యమే సత్యం, రాజకీయం మిధ్య అన్నది. రాజకీయాలు మతాబాలు. అవి ఎంత గొప్పగా వెలిగినా ఆరిపోకతప్పదు. మిగిలేది చీకటే. సాహిత్యం శాశ్వతమైన తారా పథం. నా స్వభావం కూడా అదే కనుక నా మనోరథం ఆ నిర్ణయానికి చేర్చింది. నా రాజకీయాలు ప్రజా సంబంధమైనట్టివి. నా సాహిత్య సృష్టి ప్రజలమధ్య, ప్రజల చుట్టూ తిరుగుతుంది కాబట్టి, రాజకీయమంటే ప్రజలే కాబట్టి రాజకీయాలను నేను వదలి పెట్టలేదు. నా సాహిత్య చిత్ర శిల్పానికి రాజకీయాలు ప్రధానమైన రంగులు.

అటువంటినేను మూర్తిగారికి నవజీవస పత్రికను నెలకొల్పిపెట్టాను. కూర్మయ్య గారికి వ్యవసాయకూలీ పత్రికను నిర్మించి పెట్టాను.

1946 ఎన్నికలలో, రాష్ట్ర కాంగ్రెస్ హరిజన శాఖ ఆర్గనైజరుగా నేను కృష్ణాజిల్లాలోని కూర్మయ్యగారి నియోజక వర్గంలోనే ఎక్కువగా పనిచేసాను. అప్పటి ఆ జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు దుక్కిపాటి నాగేశ్వరరావుగారు ఒక ప్రత్యేకమైన కారులో నన్నూ చెరుకువాడ నరసింహం పంతులుగారినీ ఎక్కించుకొని స్వయంగా నియోజకవర్గం అంతా తిప్పారు. ఆరోజుల్లో బెజవాడలో కూర్మయ్యగారి ఇంటిలోనే వుండేవాణ్ణి నేను. కూర్మయ్యగారు తన స్వవిషయాలనూ, రాజకీయ పథకాలనూ, భవిష్యత్ కార్యక్రమాలను నాతో చర్చిస్తూ వుండేవారు. చాలా తీక్షణంగా, క్షుణ్ణంగా ప్రతివిషయాన్నీ పరిశీలించేవాళ్ళం. అప్పటి

సంఘటనలు చిన్నచిన్న కథలుగా వ్రాయాలనిపించేదినాకు. వ్రాస్తూ వుండేవాడిని కూడా

మాయీ ఆత్మీయత, సాన్నిహిత్యం ఆయన మంత్రి అయిన తరువాత బాగా బలిపడింది. ఆంధ్రప్రభ ఎడిటరు నార్లవారునన్ను గురించి అందరి దగ్గర "భీమన్న నా తమ్ముడు" అని చెప్పుతూవుండేవారు. అదే వాత్సల్యముతో చూస్తూ వుండేవారు. సిబ్బందిలో ఎవరికీ లేని స్వేచ్ఛను నాకు యిస్తూ వుండేవారు. నేను బయట రాజకీయాల్లోకి పోతూ, తిరిగి ఆంధ్రప్రభలోకే వస్తూ వుండేవాడిని. మంత్రి కూర్మయ్యగారు నార్ల వారికి ఫోనుచేసి, నన్ను రప్పించుకొని తమ అధీనములోని ప్రచార పౌరసంబంధాల శాఖలో అసిస్టెంటు పబ్లిసిటీ ఆఫీసరుగా నియమించారు. అక్కడ నాపని సమాచార పత్రికను నడపటం, పర్యటనలలో ఆయనకూడా తిరగటం. ఆయన మంత్రిగా వున్నంతకాలమూ అదే కార్యక్రమం కొనసాగింది. రాష్ట్రమంతా (ఉమ్మడి మద్రాసురాష్ట్రం) పర్యటించాము. మంత్రిగా ఆయన ఎక్కడకు వెళ్ళినా మాలమాదిగ పేటలలోనే మకాము చేసేవారు. స్థానిక సమస్యల్ని అర్థంచేసుకుని పరిష్కార పథకాలు రూపొందించేవారు. స్వరాజ్యంలో సవర్ణ కులాధిపత్యంగల ఏ ప్రభుత్వమూ గతంలో చేసిన ఏ వాగ్దానాన్ని నెరవేర్చ జాలదనిన్నీ నిమ్న కులాల నుంచి వచ్చిన మంత్రులెవరూ సరి అయిన అభివృద్ధిని సాధించలేరనీ ఆయన తరచూ విషాదంలో మునుగుతూ వుండేవారు. విషణ్ణ చిత్తుడగుతూ వుండేవారు. అటువంటి క్షణాలలోనే ఒకసారి నాతో యిలా అన్నారు. "మంత్రిగా నేను చేసేది ఏమీ కనిపించడంలేదు. విప్లవకరమైన మార్పులు లేకుండా అభ్యుదయం సాధ్యంకాదు." అని.

"మనవాళ్ళను బాగు చెయ్యాలంటే భూములివ్వాలి. యివ్వలేం. గుడిశెల స్థానంలో పక్కాయిళ్ళు కట్టాలి. కట్టలేం. ఉద్యోగాలివ్వాలి. ఇవ్వలేం" ఆలోచనను అక్కడ ఆపి "ఎక్కువ మందిని విద్యావంతులిని చేద్దాం. ఉన్నత విద్యాభ్యాసానికి గల ఆటంకాలను తొలగిద్దాం. అందుకు తగిన చర్యలను ప్రారంభిద్దాం". అనే నిర్ణయానికి రావటం జరిగింది. వెంటనే జిల్లాలలో నాయకులుగా వుంటున్న హరిజనులందరికీ ఉత్తరాలు రాసారాయన. ఎక్కువమంది హరిజన విద్యార్థులు చదువుకుంటున్న ప్రతిస్కూలుకూ బాలబాలికలకూ ప్రత్యేకంగా హాస్టళ్ళుపెట్టమన్నారు. గ్రాంటులూ, స్కాలర్‌షిప్పులూ ఉదారంగా మంజూరు చేసారు. అప్పటివరకూ నిమ్నజాతులకు బి.ఏ దాటిన తరువాత ప్రభుత్వ సహాయ సహకారాలు వుండేవి కావు. బి.ఏ తరువాత ఆపై నుండే తరగతులన్నిటికీ బి.యల్.యం.ఏ. పి. హెచ్‌డి. మొదలైన వాటన్నిటికీ కూడా స్కాలర్‌షిప్పులూ, ఉచిత విద్య యివ్వాలనే జీ.వోలు తెప్పించారు. ఆవిధంగా లబ్ధిపొందిన మొదటి విద్యార్థి దామోదరం సంజీవయ్య. ఆయన అప్పుడు మదరాసు లా కాలేజీలో చదువుతూ వుండేవారు. ఆయనతో నా పరిచయం కూర్మయ్యగారి దగ్గరే. అదే సమయంలో శ్రీకాకుళంలో అంటరానితనానికి వ్యతిరేకంగా ఒక కుర్రవాడు సత్యాగ్రహం ప్రారంభించగా కలగచేసుకోవలసిందిగా

మంత్రిగారికి టెలిగ్రాములు వచ్చాయి. "ఏం చేద్దాం" అన్నారు మంత్రిగారు. "వెంటనే అక్కడకు టూర్ వేసుకోండి" అన్నాను. తీరా కూర్మయ్యగారు అక్కడకు వెళ్ళేటప్పటికి, అక్కడి అందరూ మంత్రిగారికి తెలిసిన వాళ్ళు క్లాస్ మేట్లేనట. సత్యాగ్రహం చేసి హడావిడి చేసిన ఆ కుర్రవాడే ఆ తరువాత శాసన సభ్యుడు, హైకోర్టు జడ్జి అయిన కొత్తపల్లి పున్నయ్యగారు.

హరిజనుల కోరికలు చిన్నవి. సమస్యలు కొద్దిపాటివి. స్థానిక సవర్ణులు తలుచుకుంటే సులభంగా పరిష్కారం కాగలిగినట్టివే. పేదరికం, అవిద్య మురికి పేటలు, గుడిశెలు, అంటరానితనం, నిరుద్యోగం యివే వాళ్ళ సమస్యలు. చాలా ప్రాథమిక సమస్యలు.

వీటిలో ప్రధాన సమస్య అంటరానితనం. అంటరానితనం పోతే మిగతా సమస్యలు వాటంతటఅవేపోతాయి. మా కొద్దీ తెల్లదొరతనం అని ప్రచారం చేసిన జాతీయోద్యమం దృష్టిలో, పూనా ఒడంబడికకు ఒప్పుకున్న అంబేద్కరు దృష్టిలో కూడా నల్లదొరతనం ఏర్పడగానే మొదటి చర్యగా అంటరానితనం నిర్మూలించబడాలి. అది జరగలేదు. తెల్లదొరలకాలంలోనే తొలగని అంటరానితనం నల్లదొరల పాలనలో యింకా వెర్రితలలు వేస్తుందనేది మా కొద్దీ నల్లదొరతనం అనేదే యీ ఉద్యమంలోని అంతర్యం. చివరకు యిదే నిజమయింది. అంటరానితనం, అంతకు ముందు అంతగా కనిపించని కులభేదాలు స్వరాజ్యం వచ్చాక పెచ్చు పెరిగాయి, వెర్రి తలలు వేశాయి. స్వాతంత్ర్యపు పూర్వపు సవర్ణ నాయకుల వాగ్దానాలు, అవర్ణదీనుల ఆశీలువట్టి భ్రాంతులే అయినాయి.

ఇలాంటి దుస్థితి నడుమ కూర్మయ్యగారు మంత్రి అయ్యారు. తానొక్కడూ ఏంచెయ్యగలడు? ఏం చెయ్యాలో ఆలోచించడానికీ, కొన్ని విధానాలు రూపొందించ డానికీ నన్ను వెంటతీసుకుపోతూ వుండేవారు. నేను ఉద్యోగపరంగానూ స్నేహపరంగాను ఆయనకు అందుబాటులో వుండేవాడిని. హరిజనాభ్యుదయం కోసం యీనాటికీ కొనసాగుతున్న పథకాలన్నీ కూడా, కార్యక్రమాలన్నీకూడా ఆనాడు కూర్మయ్యగారు రూపొందించినవే!

ప్రభుత్వంలో హరిజన సంక్షేమశాఖ కూర్మయ్యగారు ఏర్పరిచినట్టిదే. ఆ తరువాత ఆశాఖకు మంత్రి అయిన గౌతులచ్చన్నగారు. దానిని సాంఘిక సంక్షేమశాఖగా మార్చారు. ప్రతినెలా ముప్పైఆరవతేదీని కాబోలు హరిజనోద్ధరణ దినం జరిపేవాళ్ళు. గ్రామస్థాయివరకూ కూడా ఆ కార్యక్రమాలు జరపబడేవి. అవి యీనాటి వరకూ కొనసాగివుంటే షెడ్యూల్డు కులాల పరిస్థితిలో ఎంతోమార్పువచ్చి వుండేది. చదువుకోసం హాస్టళ్ళు, స్కాలర్‌షిప్పులూ, ఉద్యోగ నియామకాలాలో రొటేషన్ పద్ధతివంటివన్నీ కూడా కూర్మయ్యగారి మంత్రిత్వంలో ప్రారంభమయినట్టివే. ఇళ్ళ స్థలాలూ, గృహనిర్మాణాలూ కూడా ఆయనకాలంనాటివే. నిజానికి మాల మాదిగ పేటల్లో కొందరయినా నాయకులున్నారంటే, కొంతవరకైనా ఆర్థిక స్థోమతకలిగిందంటే అవర్ణ యువకులు

సవర్ణులతో సమానంగా తలలెత్తి మాట్లాడగలుగుతున్నారంటే దానికంతటికీ మూలం మంత్రిగా కూర్మయ్యగారు చేసిన కృషే. నేను మద్రాసులో ఒంటరిగా వుంటూ మంత్రిగారితో పాటేఉంటూ తిరుగుతూ ఆయన ఆలోచనలకు వాస్తవ రూపం కలగటానికి తోడ్పడుతూ వున్న కాలంలోనే కూర్మయ్యగారు మాలమాదిగ ప్రజానీకానికి ఏకైక నాయకుడిగా ఎదిగే కార్యక్రమాలు నిర్వహించాలని అనుకున్నారు. దాని ఫలితమే 'వ్యవసాయకూలీ' పత్రిక.

అంతకు ముందే ఒక వ్యవసాయ కూలీ సంఘం వుండేది. అది కమ్యూనిష్టుల చేతుల్లోవుండేది. అందులో వ్యవసాయం వుంది. కూలీలు లేరు. ధనికులూ, భూస్వాములూ అయిన సవర్ణ యువకులు నాయకత్వాన్ని తమ చేతుల్లో వుంచుకొని మాల మాదిగల్ని అనుచరులుగా కూలిచ్చి కొనుక్కుంటేవుండేవారు. మాలమాదిగ పేటల్ని లేబరు పేటలు అనేవాళ్ళు. కమ్యూనిష్టుల పద్ధతిచాలా అభివృద్ధి నిరోధకంగా కనిపించటంవల్ల, వ్యవసాయకూలీలకు సత్వరాభివృద్ధిని సాధించిపెట్టే వేరే ఒక సంఘాన్ని ఏర్పాటు చెయ్యాలన్ని నిర్ణయానికి వచ్చి 'వ్యవసాయ కూలీకాంగ్రెసును' ఆర్గనైజు చేసాం. వ్యవసాయకూలీ కాంగ్రెసుకు కూర్మయ్యగారు నాయకుడు, అధ్యక్షుడు. అప్పట్లో ఆయనతో వుండే కమతం షణ్ముఖం, వుట్ల సుబ్బయ్యవంటి యం.యల్.ఏలంతా కార్యవర్గం. ఆ సంస్థ తరపున ఒక పత్రిక - అదివ్యవసాయ కూలీ పత్రిక, కమతం షణ్ముఖంగారు ఎడిటరుగా ఆ పత్రికను నెలకొల్పి నేనే నడిపించాను. కూర్మయ్యగారితో చర్చించి, విధానాలు నిర్ణయించి, వాటి కనుగుణంగా వ్యాసాలు రాయించే వాళ్ళం. అప్పటికి నిరుద్యోగిగా తిరుగుతున్న ఒక హరిజన విద్యావంతుణ్ణి పట్టుకొని సబ్ ఎడిటర్‌గా నియమించాం. ఆయన మంచి తెలివైనవాడు భాషాసాహిత్యాలు తెలిసినవాడు. అందరం ఆయనను శాస్త్రీ అనేవాళ్ళం. హరిజనశాస్త్రి. ఆ తరువాత ఆయనే న్యాయశాస్త్రం చదివి పేరు మార్చుకుని లాయరుగా ప్రసిద్ధుడైనాడు వడ్డి వెంకట శివరావు "తగవులువస్తే తదుపరి చూద్దాం, బుర్రమీద కర్రేసి కొట్టరా" అనే విప్లవగేయాన్ని ఆరోజుల్లో వ్రాసినవాడు ఆ హరిజన శాస్త్రి. 'వ్యవసాయకూలీ' పత్రిక వ్యవసాయ కూలీ కాంగ్రెస్ సంస్థకు ఒక బలమైన ఆయుధంగా నడిచింది. వ్యవసాయ కూలీలను జాతీయ కాంగ్రెస్ పరిధిలోకి తేవడానికి తోడ్పడింది. జిల్లాసంస్థలు, నాయకులు, ఉపనాయకులు ఏర్పడ్డారు. ఆ సమయంలోనే 'కష్టజీవి' పేరుతో నేనెప్పుడో రాసి ప్రదర్శించిన నాటకంలో "సమ్మె" అనే మాటకు బదులు సత్యాగ్రహం అనే మాటను చేర్చి, పేరును "కూలిరాజు" గా మార్చి కూర్మయ్యగారికి అంకితంగా ప్రకటించాను. వ్యవసాయకూలీ ప్రచురణలలో అది ఒకటైంది. మంత్రిగారి వద్ద అధికారకార్యదర్శిగా వున్న జనార్ధనరావు నాయుడుగారు నా నాటకం చదివి. ఎగిరి గంతేసి, తమ సెక్రటేరియట్ ఉద్యోగుల సంఘ (ఆంధ్రవిభాగం) ఆధ్వర్యంలో ప్రదర్శింపచేసాడు. ఎగ్మూర్‌లోని మ్యూజియం థియేటర్‌లో అప్పటి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి P.V. రాజమన్నారుగారి అధ్యక్షతన ఆనాటకం ప్రదర్శింపబడ్డది. ఆరోజున అధ్యక్ష స్థానంనుంచి రాజమన్నారుగారు పలికిన పలుకులు యివి "ఈ కూలిరాజు

నాటకాన్ని అంకితం తీసుకుని, యింత ఆనందంగా ప్రదర్శింపచేసిన మంత్రి కూర్మయ్యగారిని ఎంతో అభినందిస్తున్నాను. నేనొక మాట చెప్పదలిచాను. ఈనాటకం యీనాడు ప్రభుత్వాన్ని నడిపిస్తున్న కాంగ్రెసు భూస్వాములకు ఎంతవరకు నచ్చుతుందో తెలియదు. కొంత ఔదార్యాన్నీ, సహనాన్నీ ముందు చూపునీ ప్రదర్శించి దీని ప్రతులను విస్తారంగా ప్రజల కందించి ఊరూరా ప్రదర్శనలు యివ్వగలిగితే యీదేశం నుంచి కమ్యూనిజం చెప్పకుండా పారిపోగలదు. ఈ పని ప్రభుత్వానికి కష్టమైందేమీ కాదు. అయితే చెయ్యడానికి దమ్ములుండాలి."

ఎంత గొప్ప అభిప్రాయప్రకటన. రాజమన్నారు C.R. రెడ్డివంటి మేధావులే దేశ శ్రేయోభిలాషులు సత్యాలను యింత నిర్భయంగా చెప్పగలుగుతారు.

కూర్మయ్యగారి ముఖచిత్రాన్ని పెద్ద సైజులో వేలకొలదీ ప్రతులు తీసి పత్రికలో పెట్టి పంపించేవాళ్ళం. ఫ్రేములు కట్టిన ఆ ఫొటోలు వేలకొలదీ వ్యవసాయకూలీల, వాళ్ళ నాయకుల ఇండ్లలో వ్రేలాడుతూ వుండటం నేను చూసాను.

మాలమాదిగలే కాక, వాళ్ళ కంటే ఎక్కువ సంఖ్యలో కూడా, సవర్ణ కులాలనాయకులూ కాంగ్రెస్ కార్యకర్తలూ తమతమ సమస్యలతో కూర్మయ్యగారిని చుట్టుముట్టేవారు. మంత్రిగారి అధికారభవనం నిండా, చుట్టూ ప్రజలే ప్రజలు. అదొక తీర్థంలా వుండేది. సవర్ణ కులాల నాయకులు ఎక్కువగా కార్లలోనూ, టాక్సీలలోనూ వచ్చేవాళ్ళు. మంత్రిగారు ఒక్కరినీ కాదనేవారు కాదు. అందరి సమస్యలనూ సిన్సియర్‌గానే విని పరిష్కారానికి పూనుకొనేవారు. కార్లు తెచ్చినవాళ్ళతోపాటు ఆయా ఆఫీసులలో పనులున్న పేద హరిజనుల్ని కూడా ఎక్కించుకునేవారు. వాళ్ళ పనులతో పాటు వీళ్ళ పనులను కూడా చేసిపెట్టే వారు. ఖర్చు అగ్రకులాల ధనికులది. అదీ కూర్మయ్యగారు పనిచేసే విధానం. ఆవిధంగా సమగ్ర శక్తి వంతుడైన ప్రజానాయకుడుగా ఎదిగిపోతున్న కూర్మయ్యగారు భూస్వాములైన కాంగ్రెస్ అధికార నాయకుల అసూయలకు గురి అయినారు.

రాజకీయపదవులు స్థిరంగాదు. చెప్పీ, చెప్పకుండానూ అవి పోతూ వుంటాయి. స్థిరంగా వుండకలిగింది ప్రజల హృదయాలలోనే! అట్టి నాయకుడికి తమదైన ఒక కార్యస్థానంవుండాలి. అందుకు అగ్ర గణ్యమైన స్థానం పత్రికాకార్యాలయం. యీ వాస్తవాలను గుర్తించిన వెంటనే కూర్మయ్యగారు వ్యవసాయకూలీ పత్రికకు ఒక స్వంత బిల్డింగును నిర్మించాలనీ. స్వంత ప్రెస్సును ఏర్పాటు చెయ్యాలనీ నాయకుడిగా తనకు ఒక స్థిరమైన కార్యాలయాన్ని స్థాపించుకోవాలని నిర్ణయించి కార్యాచరణకు పూనుకున్నారు. యీ పనులన్నీ చేసే బాధ్యతను నాకు అప్పగించారు. నేను వెంటనే ఒక ప్రముఖుడైన జర్నలిస్టు సూర్యభగవానుడు అనే మిత్రుడితో కలిసి మద్రాసులో పదిహేను వేలకు ఒక పూర్తి ప్రెస్సుని బేరమాడి కూర్మయ్యగారి గదికి వచ్చాను. ఆయన నా చేతికి డబ్బు యిస్తూ వుండగా అప్పటికే అక్కడ కూర్చున్న ఒక పెద్దమనిషి విషయం తెలుసుకుని "ఇదంతా ఎందుకు కూర్మయ్య బెజవాడలో మనప్రెస్సు వుందిగదా దాన్ని తీసేసుకో" అన్నాడు. "మంచిదే" అని అనుకున్నాం. కొద్దిరోజుల తరువాత బెజవాడ వెళ్ళిచూస్తే అక్కడ ఏముంది? ఒక ఇనుపచక్రం నాలుగయిదు కమ్ములు వున్నాయి.

ఇలాటి సంఘటనలు ఎన్నోవున్నాయి, కూర్మయ్యగారి జీవితంలో నాకు తెలిసినట్టివి.

కూర్మయ్యగారితో నా సాన్నిహిత్యం ఆత్మీయత 1936లో ప్రారంభమయి కొనసాగింది. అది ఆత్మీయతగా మారి, ఆయనకు గల రాజకీయాధికారాన్నీ ప్రజానాయకత్వాన్నీ పురస్కరించుకొని నా భావాలెన్నిటికో వాస్తవ రూపం లభించింది. ఇద్దరమూ కలసి ఆలోచించేవాళ్ళం. ఆయన క్రియావాది. ఆచరణదక్షుడు. ఒట్టి మాటలు కట్టిపెట్టి గట్టి పనులకు వాస్తవ రూపాలు కల్పించిన ప్రజ్ఞావంతుడు, ప్రతిభావంతుడు. ఒక నలభైయేళ్ళపాటు ఆలోచనా పరంగా మేము కలిసి పనిచేసేమనే చెప్పవచ్చు. మాలమాదిగలకు మొత్తం భారతజాతికీ శ్రేయోదాయకమైన పనులు చిరస్థాయిగా నిలిచిపోయిన పనులు ఎన్నిటికో మేము పునాదులు వేశాం. అవన్నీ ఆసక్తికరమైన సంఘటనలు, స్మృతులు యిప్పటి భాషలో ఎపిసోడ్‌లు. కేవలం పీఠికా ప్రాయమై [illegible] రిచయంలో అవన్నీ యిమడవు. ఆయనతో స్నేహం, ఆయన నా [illegible]ఎన వాత్సల్యం. ఆత్మీయతా, నా అనుభవాలను పెంచింది. నా ఊహలకు స్థిరత్వం చేకూర్చింది. అందుకు నేను ఆయనపట్ల నిత్య కృతజ్ఞుడిగా వుంటూవున్నాను.

మేము ఒకే కుటుంబానికి చెందిన వాళ్ళుగా మెలిగేవాళ్ళం. కుటుంబ కష్టసుఖాలలో భాగం పంచుకునేవాళ్ళం. నన్ను తన బిడ్డలలో ఒకడిగానే ఆ దంపతులు భావించేవాళ్ళు. నా పట్ల అంత చనువుగానూ ప్రవర్తించేవాళ్ళు. నేను రిటైరయి ఇరామ్ మంజిల్ కాలనీలో వుంటున్న కాలంలో ఒకరోజున కూర్మయ్యగారు ఇద్దరు ముగ్గురు అనుచరులతో నా క్వార్టరుకు వచ్చారు. ఆయన ఎప్పుడు ఎందుకు బయలుదేరినా "రాజు వెడలె రవి తేజములోడను" అన్నట్లే వుండేది. ఎప్పుడూ ఒక అరడజనుమంది అయినా కూడా వుండేవాళ్ళు. ఆ రోజున మధ్యాహ్నం ఎండలో పడి మాక్వార్టరుకు వచ్చినప్పుడు మా ఆవిడ హైమవతి ఎన్నడోకాని రాని అతిథికి ఏం మర్యాదలు చెయ్యాలో తెలియక తికమక పడింది. నేను వంటగదిలోకి వెళ్ళి "అప్పుడే వండిన కూరను టిఫినుగా పెట్టెయ్" అన్నాను. ఆమె తటపటాయించి ఆ కూర ప్లేట్లలో పెట్టి వాళ్ళకు అందించింది. తక్కిన వాళ్ళకు అదేమిటో అర్థంకాలేదు. కూర్మయ్యగారు టిఫిన్ పూర్తిచేసి, యింకా వుంటే బాగుండునన్నట్లు మొహంపెట్టి "ఇంత బ్రహ్మాండమైన టిఫిన్ తను ఎప్పుడూ తినలేదు" అన్నాడు. "యిలా చెయ్యటం మావాళ్ళకు కూడా చేతకాదు - బెజవాడవచ్చి నాలుగు రోజులు వుండి మా ఆవిడకు నేర్పకూడదా." అన్నారు. నాన్‌వెజ్ వంటలలో మునిగితేలే మావాళ్ళ కంటే కూడా ఒక బ్రాహ్మలమ్మాయి నాన్‌వెజ్‌ను యింతగొప్పగా తయారు చెయ్యడం అద్భుతం, అపూర్వం." అన్నారు. ఇలాంటి ఉదంతాలు మా స్నేహంలో వందలూ వేలు. ఇంతకూ ఆ టిఫిన్ సొరపిట్టు. బాలసొర కూర.

ఇక అసలు విషయానికొస్తే - నేను వ్రాయవలసిన కూర్మయ్యగారి జీవిత చరిత్ర యిప్పుడు డాక్టర్ పూర్ణచంద్‌గారు వ్రాయడం నాకు ఎంతో తృప్తిగానూ, సంతోషంగానూ వుంది. డాక్టర్ గంగరాజు వెంకటపూర్ణచంద్‌గారు ఆయుర్వేద డాక్టరు. శ్రీనాధుడన్నట్టు

ప్రౌఢ నిర్భర వయఃపరిపాకంలో వున్నవాడు. జనసామాన్యానికి తెలిసిన సులభంగా లభించగలిగిన అనేక వస్తువుల గుణాలను వివరిస్తూ వాటి వ్యాధి నిరోధక నివారణ శక్తులను విశదీకరిస్తూ అందరికీ అర్థమయ్యే భాషలో ఎన్నో వైద్య గ్రంథాలను వ్రాసినవాడు. ఆయుర్వేదాన్ని ప్రజలవంటింటికి చేర్చినవాడు. ప్రాచీన భారత మధ్యప్రాచ్య చరిత్రను అప్పటి ఆచార సాంప్రదాయాలను "సప్త సింధు" పేరుతో ఒక నవలగా రూపొందించి ప్రజలముందు సాక్షాత్కరింపచేసినవాడు. దినదిన ప్రవర్ధమానుడవుతున్న యీ డాక్టరు రచయిత కూర్మయ్యగారి జీవితచరిత్ర రచనకు పూనుకొనడం ఎంత గొప్పవిషయమో, యీ రచనా బాధ్యతను నిర్వహించడానికి ఆయనను ఎంచుకొన్న కూర్మయ్యగారి కొడుకుల వివేకము వారి మిత్రులైన అక్కపెద్ది వెంకట సీతారామాంజనేయులుగారి విచక్షణ అంతగొప్పవి. కూర్మయ్యగారి కుమారులు. వెంగళరావు, డాక్టర్. రామలింగేశ్వరరావు తండ్రికి యీ విధమైన అక్షర స్మృతిని నిర్మించదలిచారంటే వారి తపస్సు ఎంతటిదో ఊహించవచ్చు. నేటి ఆధునిక విద్యావంతులకు యీ పని ద్వారా కూర్మయ్యగారి పుత్రులు మార్గదర్శకులవుతున్నారు. ఇక ఆంజనేయులుగారి పేరు మహా రచయిత్రి లత గారి పేరుతో ముడిపడినట్టు ఆవిడ రచనా కల్పవృక్షానికి మూల ప్రాయమైనట్టిది. ఆంజనేయులు గారికి గల విస్తృత దేశాటన, వివిధ భాషా మూల గ్రంథాలగాఢ పరిశీలన, యిప్పటికీ నవ నవోన్మేషంగా విస్తరిస్తున్న ప్రతిభ ఎవరిమైత్రికైనా, అమూల్యమైన విద్యాశ్యమంతకాలే.

కూర్మయ్యగారి జీవిత చరిత్ర అంటే ఇరవయ్యవ శతాబ్దపు హరిజనాభ్యు దయోద్యమ సంపూర్ణ చరిత్రే. అట్టి చరిత్రకు ఒక ప్రామాణిక గ్రంథంగా కూర్మయ్యగారి జీవితాన్ని సాక్షాత్కరింపచెయ్యాలను కున్నాను నేను.

మాలవ్యాగారి హిందూయూనివర్సిటీలో న్యాయశాస్త్రం చదివిన కూర్మయ్యగారు తమ సమకాలీనులైన అన్నికులాల, మతాల, వర్గాల నాయకులనూ కలుపుకొని జాతిసమైక్యతకూ, దేశ సమగ్రతకూ, ఏకైక ప్రతీకగా నిలబడిన నాయకుడు. హాస్టళ్ళనూ, స్కూళ్ళనూ స్వయంగా నడిపిన అగ్రగామి. ఆర్త త్రాణపరాయణత్వంలో ఆయనకు ఆయనేసాటి. దేశ నాయకత్వానికి ప్రామాణిక గ్రంథంగా యువతర పారంపర్యానికి పాఠ్యగ్రంథంగా ఇరవయ్యవ శతాబ్దపు రాజకీయాలకు సాక్షీభూత గ్రంథంగా డాక్టర్ పూర్ణచంద్‌గారి రచనా సరస్వతికి శరదిందు కిరీటంగా యీ గ్రంథం శోభిల్లాలనేది నా ఆకాంక్ష. ఈ కృషిలో పాత్రధారులూ, భాగస్వాములూ అవుతున్న అందరికీ నాశ్రేయః శుభాకాంక్షలు.

[signature]
18.11-99

# రచయితను గురించి నాలుగు మాటలు

శ్రీ వేముల కూర్మయ్యగారి జీవిత చరిత్ర వ్రాసిన యీ సాహసి డా॥ జి.వి.పూర్ణచంద్ BAMS గురించి నాలుగు మాటలు రాస్తున్నాను.డాక్టరుగా రచయితగా, కవిగా, జర్నలిస్టుగా,సంఘసేవకుడుగా చాలా మందికి పరిచితుడే.యింతే కాదు యింకాచాలా వున్నాయి యితడి ఘనకార్యాలు. 1970లో మేఘుమాల అనే లిఖిత మాసపత్రికకు సంపాదకత్వంతో రచయితగా జీవితాన్ని ప్రారంభించాడు. ఆర్టిస్టుగా అనేక బొమ్మలు గీసాడు, అవి ఆంధ్రప్రభ వారపత్రిక పాఠకులకు సుపరిచితమే.

ఆంధ్రప్రదేశ్ సాహితీ అకాడమీ సభ్యుడిగా, స్పందన సాహితీ సమాఖ్య కార్యవర్గసభ్యుడిగా విజయసాహితి వ్యవస్థాపక కార్యదర్శిగా, సౌజన్య వారపత్రిక నిర్వహణలో పలు ప్రధానపాత్రలు వహించాడు. మినీకవితా ప్రదర్శనలను దేశంఅంతా ఏర్పాటు చేసాడు. వారధి పత్రికకు సంపాదకుడుగా, తెలుగు సాహిత్య సంస్థల సమన్వయ సమాఖ్య అనే అఖిల భారత సంస్థకు వ్యవస్థాపక కార్యదర్శిగా యింకా చెప్పాలంటే ఎన్నో......అవీయివీ అని ఎందుకూ అన్నిరకాలు. పై చెప్పిన వన్నీ అతి చిన్న తనంనుంచే అంటే పదమూడవ ఏటనుంచే శ్రీ కారంచుట్టి నిర్విరామంగా సాగిస్తూవస్తూన్నాడు. అలుపెరగని మనిషి.చిరునవ్వు పోనివ్వనిసౌమ్యుడుగా ఎంతటి వారినైనా ఆకర్షించగల స్వభావం, సంభాషణాచాతుర్యం గల శాంతమూర్తి. ఏ సాహిత్యసభ నిర్వహణకైనా, సంఘసేవాకార్యక్రమానికైనా ముందుకు దూసుకువచ్చే సాహసికుడు. ఒక వైపువైద్యం, మరొక వైపు సాహిత్యసేవా వెంపరలాట. యింకోవైపు లయన్స్ క్లబ్ సాంఘికసేవా కార్యక్రమాలలో దూకుడు ప్రకృతి సిద్ధ గుణాలుగా కలవాడు. సాహిత్య గ్రంథరచన, వైద్య గ్రంథాల రచనతోపాటు ప్రాచీన చరిత్ర ఘట్టాలను తవ్వితీసి చారిత్రక నవలలు వ్రాయటం ప్రారంభించాడు. అప్పుడే మొదట నవల 'సప్తసింధు' ఢంకామోగించింది. యితర భాషలలోకి అనువదింప బడుతోంది. రెండో నవల 'సుదాసు' శరవేగంతో సాగుతోంది. మహాకవి రాహుల్ సాంకృత్యాయన్ దివోదాసు రాసి సుదాసు యితడికి వదలిపెట్టాడా అని అనిపిస్తోంది. ఉన్నట్టుండి మరో బాంబుపేల్చాడు. అది దీనజనబాంధవుడు శ్రీ వేముల కూర్మయ్యగారి జీవిత చరిత్ర. కూర్మయ్యగారిని చూడకపోయినా, ఆయనను గురించి తెలియక పోయినా ఆ హరిజన నాయకుడిని గురించి వ్రాయటానికి సాహసించి నాలుగు నెలల నుంచి అహోరాత్రులు కృషిచేసి రాసిన సంగతి నాకుతెలుసు. అనేక పుస్తకాలు చదివాడు.

అనేకులను అడిగి తెలుసుకున్నాడు. అనేక చోట్లనుంచి పక్ష, వార, మాస పత్రికలు సంపాదించి పత్రికలనుంచి సేకరించిరాసాడు. చివరకు ఆనాటి ఉమ్మడి మద్రాసురాష్ట్ర అసెంబ్లీలో కూర్మయ్యగారి శాసనసభా ఉపన్యాసాలు, చర్చలు కూడా సంపాదించి ఒక మహత్తర గ్రంథంగా తయారుచేసాడు. ఎక్కడెక్కడో, ఏనాడో జరిగిన సంగతులు మనకు కళ్ళకు కనపడేటట్లు చేశాడు. ఆనాటి సంఘటనలు యీనాటి వాళ్ళకు సినిమాలో కన్పించినట్లు కాగితాలమీద అక్షరాల్లో చూపించాడు.

శ్రీ కూర్మయ్యగారు దక్షిణ భారతదేశంలో అగ్రశ్రేణి హరిజననాయకుడు. ఆయననుగురించి, ఆయన సేవను గురించి నా బోటివాళ్ళకు తెలుసు. ఆయనలోని చాతుర్యం యితర కులాలనుగాని, మతాలను గాని దూషించకుండా తన దారిన తాను మహత్తరమైన హరిజనసేవ చేసిన **హరిజనగాంధి**. హరిజన సేవలో గాంధీ గారి కంటే ముందున్నాడంటే అతిశయోక్తి కాదు. యావత్ భారతదేశంలో బెనారస్ హిందూ యూనివర్సిటీలో చదువుకునే అర్హత సంపాదించిన మొట్ట మొదటి హరిజనుడు శ్రీ కూర్మయ్యగారు. దక్షిణ భారతదేశంలో మొట్టమొదటి హరిజన మంత్రి ఆయనే!! ఆనాటి అంటే 1946 నాటి కాలంలో ప్రకాశం పంతులుగారి మంత్రివర్గంలో, ఓ మాండూరి రామస్వామిరెడ్డియార్ మంత్రివర్గంలో స్థానంపొంది నిరూపమానమైన హరిజన సేవ చేసిన మహావ్యక్తి. మనిషి చూట్టానికి ఎంతో సామాన్యుడుగా, నిరాడంబరుడిగా కనిపించినా కార్యశూరుడు. నేను కూర్మయ్యగారిని గురించి ఎక్కువగా వ్రాయటం అసంగతం. పుస్తకం చూస్తే ఈ రచయిత ఆయన జీవిత చరిత్రను చక్కని నవలగా చేసాడనే ఆశ్చర్యం కలగకమానదు. జీవితచరిత్రను నవలగా చేసిన మొదటిరచయితగా గుర్తింపబడతానని ఆశిస్తున్నాను.

కూర్మయ్యగారి పవిత్ర ఆత్మ ఇతడి శరీరములో ప్రవేశించకపోతే ఇంత చక్కగా ఆయన జీవిత చరత్ర వ్రాయలేక పోయేవాడేమో అని నాకు అనిపిస్తోంది. చివరగా ఈ చిరంజీవి డాక్టర్ పూర్ణచంద్, శతాధిక గ్రంథకర్తగా, శతాయుష్కుడుగా, పేరు ప్రఖ్యాతులతో విలసిల్లాలని దీవిస్తూ ముగిస్తున్నాను. నాకంటే చాలా చిన్నవాడయినా కాస్త ఏకవచనంతో సంబోధిస్తూ రాసినందుకు కోప్పడడనుకుంటాను-

**ఎ.వి.యస్.ఆర్. ఆంజనేయులు**

# నివేదన

ఉర్వి జనులకెల్ల
ఒక్క కంచము బెట్టి
పొత్తు గుడిపి కులము
పొలియ జేసి
తలను చేయి వెట్టి
తగనమ్మ జెప్పరా.....

అన్నారు వేమన్న...ఎంతో విశాల హృదయంతో కులం మతం విశృంఖల రాజ్యంచేస్తున్న ఆరోజుల్లోనే!!

కొందరు మహానుభావుల సందేశాలూ,ఉన్నత వ్యక్తిత్వాలూ ఒక్కో యుగంలో ఒక్కోరకంగా మానవాళిని ప్రభావితం చేస్తాయి.

హరిజనోద్యమ వైతాళికుడు, కూలీల గాంధీ, దీనజన బాంధవుడు, తన నాయకత్వ పటిమతో అస్పృశ్యుల జీవితాల కొక గమ్యాన్నీ,దిశనీ చూపించిన మహనీయుడు శ్రీ వేముల కూర్మయ్యగారు గత శతాబ్దపు ప్రథమార్ధంలో వేలాది అట్టడుగు ప్రజల్ని తన అపారమైన వ్యక్తిత్వంతో ప్రభావితం చేసిన వ్యక్తి! వారి జీవితాలలో వెలుగులు విరజిమ్మేందుకు. అహోరాత్రులు పోరాడిన మహాత్ముడాయన!!

శ్రీ వేముల కూర్మయ్యగారి జీవిత చరిత్ర రాయటం నిజన్నికి నాకు సాహసమే. నాకు ఊహతెలిసే నాటికే కూర్మయ్యగారు అస్తమించారు. ఈ గ్రంథంలో పేర్కొన్న సంఘటనలన్నీ నేను పుట్టకముందూ, నాకు బుద్ధితెలియక ముందూ జరిగినవే.

అంచేత విషయ సేకరణ కోసం కొంత శ్రమించ వలసి వచ్చినప్పటికీ, హరిజనోద్ధారకుడు శ్రీ వేముల కూర్మయ్యగారి జీవిత చరిత్రని పూర్తిచేయగలగటం నాకు గర్వకారణమైన విషయంగానే భావిస్తున్నాను.

శ్రీ వేముల కూర్మయ్యగారి కుమారులు వెంగళరావు అన్నయ్య గారు,డా॥ రామలింగేశ్వరరావు గారు, మురళీకృష్ణగారు నన్ను ఈ రచన చేయమని కోరినపుడు కష్టతరమే అయినా ఆ మహనీయుడి పైనగల అపారగౌరవంతో నా శక్తికిమించిన ఈ మహత్తర కార్యానికి పూనుకొన్నాను.

ముందు మాటలు వ్రాసి ఇచ్చిన పద్మశ్రీ కళాప్రపూర్ణ డా॥ బోయి భీమన్న గారికి వినమ్రతతో కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

అనేకమంది ప్రజల జీవితచరిత్రలూ,రచనలూ,స్వాతంత్రసమరం పై వెలువడిన అనేక గ్రంథాలను అందించి ఆశీర్వదించి ప్రోత్సహించిన శ్రీ.ఎ.వి.యస్.ఆర్ ఆంజనేయులు గారికి నా కృతజ్ఞతలు సమర్పించు కొంటున్నాను.

శ్రీ కూర్మయ్యగారు చిన్నప్పుడు చదువుకున్న ఎలకుర్రు శ్యామలా ధర్మప్రాథమికోన్నత పాఠశాల వివరాలు.అందించిన మేనేజర్ శ్రీకాశీనాథుని నాగేశ్వరరావు గారికీ, మద్రాసు శాసన సభా వివరాలు అందించిన తమిళనాడు రాష్ట్ర ఎడిషినల్ డైరెక్టర్ జెనరల్ ఆఫ్‌పోలీస్ శ్రీ వేముల చంద్రకిషోర్IPS గారికి ఈ గ్రంథాన్ని ప్రచురించిన మిత్రులు శ్రీ వి. యల్. నరసారెడ్డిగారికీ ఈ సందర్భంగా నా ధన్యవాదాలు తెలుపుతున్నాను.

శ్రీ వేముల కూర్మయ్య గారి జీవిత చరిత్ర వ్రాయటంలో ఏ సందర్భంలో అయినా పొరబాట్లు దొర్లితే పెద్దమనస్సుతో క్షమిస్తూ వాటిని నాదృష్టికి తీసుకు వస్తే సరిదిద్దుకొంటాను.

హరిజనోద్ధరణ కోసం దీక్షాబద్ధుడైన ప్రతిభారతీయుడికీ నమస్కృతులతో నా ఈ రచనను అంకితం చేస్తున్నాను.

విజయవాడ.
23-1-2000

ఇట్లు
డా॥జి.వి.పూర్ణచంద్.

## ఈ రచనకు సహకరించిన ముఖ్య గ్రంథాలు ఇవి...
## ఆయా రచయితలకు కృతజ్ఞతలు


1. **The Freedom Movement in Andhra**
   (Vol I 1800-1905 AD)
   *By Prof. M. Venkata Rangaiya*
2. **A Hundred Years of THE HINDU**
   *By Rangaswamy Partha Sarathi*
3. **నా జీవిత కథ - నవ్యాంధ్రము**
   *శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు ఆత్మకథ*
4. **నా జీవన నౌక**
   *శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య ఆత్మకథ*
5. **శ్రీ కాకాని వెంకటరత్నం జీవిత చరిత్ర**
   *By శ్రీ కలపాల సూర్య ప్రకాశరావు*
6. **Roses of December : An Autobiography**
   *By M.C. Chagla*
7. **CHURCHILL : A Life**
   *By Martin Gilbert*
8. **India From Lord Curzan to Nehru & After**
   *By Durga Das*
9. **స్వాతంత్ర సమరం**
   *బిపిన్‌చంద్ర, అమలేశ్ త్రిపాఠి, బరున్‌డే*
   *అను: శ్రీ తిరుమలశెట్టి శ్రీరాములు*
10. **ఆంధ్రకేసరి ప్రకాశం**
    *By యర్రమిల్లి నరసింహరావు*
11. **Witness to an era**
    *(India 1920 to the Present Day)*
    *By Frank Moraes*
12. **The Last Years of British India**
    *Michael Edwardes*
13. **దేశభక్త కొండా వెంకటప్పయ్యగారి జీవిత చరిత్ర**
14. **High Lights of Freedom Movement in Andhra Pradesh**
    *By Dr. Sarozini Regani*
15. **The Role of Madras Legslature in the Freedom Struggle 1861-1947**
    *By S. Krishna Swamy*
16. **Madras Legislatives Assembly Debates – Official Report Wednesday, 26th March, 1947**
    *Volume V - No 1*
17. తెలుగుస్వతంత్ర 1955 సం॥ సంపుటి
18. ఆంధ్రపత్రిక, కృష్ణా పత్రిక, ఆంధ్రప్రభ, భారతి, గృహలక్ష్మి, మరియు వివిధ దిన, వార మాస పక్ష పత్రికలు.

# దీనజనబాంధవుడు
## శ్రీవేముల కూర్మయ్య

**డా॥ జి.వి. పూర్ణచంద్**

"కిం గంగాంబు బింబితోऽంబర మణౌ
చండాల వాటీ పయః
పూరే చాంతర మస్తి కాంచన ఘటీ
మృత్కుంభయోర్వాంబరే --"

అప్రయత్నంగా నోట వెలువడ్తున్న శబ్దాల అర్థాలను విశ్లేషిస్తూ, వివేకిస్తూ సాగిపోతున్నారు వేముల వెంగళయ్య గారు... సాక్షాత్తు తిరుప్పాణి ఆళ్వారు అపర అవతారం అని ఆయనకు పేరు. పరమవైష్ణవమయిన ఆయన మూర్తిలో విష్ణుతేజం మూటగడ్తోంది.

శ్వేతాంబరధారి వెంగళయ్యగారు. తెల్లనిపంచ ఉత్తరీయం... మూర్తీభవించిన శాంతిదేవతలా ప్రకాశిస్తున్నారాయన.

తెల్లని గుర్రంమీద ఆయన ప్రయాణం.

వైష్ణవ మతగురువుగా చేతిలో తెల్లని గొడుగు ఆయనకు ఆచ్ఛాదనాన్నిస్తోంది.

అది సెప్టెంబర్ 10-1903.

సూర్యుడు ఉదయించాడు.

"గంగా జలంలోనూ, మాలపల్లె చెరువులోనూ ఒకేలా సూర్యుడు ప్రతిబింబిస్తున్నాడు."

బంగారు గిన్నెలోనూ మట్టికుండలోనూ ఆకాశం ఒకేలా వుంది.

"ప్రత్యగ్వస్తు నిస్తరంగ సహజనందాను బోధాంబుదౌ
విప్రోऽయం శ్వపచోऽయ మిత్యపి
మహాన్ కోऽయం విభేద భ్రమః"

శ్లోకం చివరికి వచ్చేసరికి పైకి బిగ్గరగానే చదివారు వెంగళయ్య.

"నిశ్చలమైన తరంగాలతో నిర్మలంగా వున్న తటాకంలా వుంటుంది.

మనిషిలోని ఆత్మ ! అలాంటి నిర్మలమైన ఆత్మకు వీడు బ్రాహ్మడు, వీడు అస్పృశ్యుడు. అనే భావాల్ని అంటగడతారెందుకు...?" అని ఆయన మనసు ఈ సమాజాన్ని ప్రశ్నించసాగింది. దానికి సమాధానం ఈ సమాజంలో ఎవ్వరూ ఇచ్చేందుకు సిద్ధంగాలేరు. అదీ ఆనాటి పరిస్థితి. ఈ సమాజంలోంచి అస్పృశ్యతా భావం ఎప్పటికైనా తొలగిపోవాలి... అస్పృశ్యులను ఉద్ధరించే పుణ్యపురుషుడు అవతరించాలి...! వెంగళయ్యగారు ఆలోచనా మగ్నంగా సాగిపోతున్నారు. ఆయన తెల్లగుర్రం నెమ్మదిగా అడుగులో అడుగువేస్తూ నడుస్తోంది.

"లోకానికంతా సమానంగా వెలుగునిచ్చే ఆ సూర్యభగవానుడు చీకట్లో మగ్గుతున్న అంటరాని ప్రజను ఉద్ధరించు గాక..." అనుకొంటున్నారాయన...

ఇంతలో ఎవరో పరుగున వచ్చి ఆయన్ని బిగ్గరగా పిలిచారు...

"దాసుగారూ..." అంటూ.

వేముల వెంగళయ్యగారు వెనక్కి చూశారు.

"మల్లవరం నుంచి కబురొచ్చింది - మీకు అబ్బాయి పుట్టాడంట..." రొప్పుకొంటూ వచ్చి చెప్పాడు కబురాయన.

వెంగళయ్యగారు ఆనందంతో పొంగిపోయారు. ఆయన మనసు ఘహర్షులు చేసే వేదఘోషలా ఉప్పొంగ సాగింది. పవిత్రగంగా నదీ తరంగంలా ఉవ్వెత్తున ఎగిసిపడసాగింది.

శరత్కాలపు సూర్యభగవానుడి లేలేత కిరణాలు ఆయన ముఖాన ప్రసరించి లేతమందారంగా వికసిస్తూ... మరింత ప్రకాశింప చేయసాగాయి.

నిన్న వెలుగు నిచ్చిన సూర్యుడు మళ్ళీ వచ్చాడు. సూర్యుడి వెలుగుని అందుకున్న లోకం చీకట్లను చిదుముకొంటోంది.

ఈ లోకానికేదో మంచి జరగబోతోందని అప్పుడే ఆయనకు స్ఫురించింది.

సర్వేజనాః సుఖినోభవన్తు - అనుకున్నారాయన. సమస్త భూమండల భారాన్ని తన వీపున మోస్తున్న ఆ కూర్మావతారంలా తనపుత్రుడు కూడా ఆర్తత్రాణ పరాయణుడిగా లోకోద్ధారకుడిగా, అంటరాని ప్రజల పాలిట దీనబంధువుగా వెలుగొందాలని ఆయన మనసు ఆశీర్వదించసాగింది. "కూర్మయ్య" అని మనసులోనే ఆయన తన బిడ్డకు నామకరణం చేశారు.

లేత కిరణాలు బంగారు కాంతులీనున్నాయి. సన్నగాలికి వేపచెట్టు తలాడిస్తోంది. ఎండిరాలిన రావి ఆకులు గలగలలాడుతున్నాయి.

"నాస్తితు పంచమః" అన్న వాక్యం ఆయన నోట్లో పదేపదే ఆడడం మొదలు పెట్టింది.

"అవును! పంచములు లేని సమాజం రావాలి! ఆ సమాజంలో అంటరానితనమే ఉండకూడదు!!" వెంగళయ్యగారి ఆలోచనలన్నీ అస్పృశ్యతా నిర్మూలన వైపే సాగుతున్నాయి.

బోర్లాపడిన పాపాయి పాకడానికి ప్రయత్నం చేస్తున్నట్లు చెరువుమీద అలలు మెలికల గీతలు గీసుకొంటూ నెమ్మదిగా కదులుతున్నాయి.

సూర్యుడు వెలుగొందుతున్న కొద్దీ చలిని వదిలేసి, చల్లగాలి హాయిగా వీస్తోంది. అయినా చెరువొడ్డున మర్రిచెట్టు కదలడంలేదు.

"తన బుద్ధి మారదు - తన నిర్ణయాలు మారవు-" అని మొండిగా నిలబడ్డ పూర్వాచారపరాయణుడిలా. చెరువొడ్డున మర్రి చెట్టు గంభీరంగా అలానే నిలబడివుంది.

దీనిని కదిలించడానికి మలయమారుతాలు చాలవేమో... మహా ప్రభంజనం ఏదో కదలి రావాలి కాబోలు...!!.



బెంగాల్ విభజనతో బ్రిటిష్ వారి పతనం భారతదేశంలో ప్రారంభం అయ్యింది.

దేశం వందేమాతరం నినాదంతో ప్రతిధ్వనిస్తోంది.

బంకిచంద్ ఆనందమఠం నవల ప్రజలకు స్వాతంత్ర్య సందేశాన్నిచ్చి విప్లవాత్మక కార్యక్రమాలకు పురికొల్పింది.

వందేమాతరం!

వందేమాతరం!

వందేమాతరం!

దేశం నలుమూలలా సుడి గాలి పర్యటనలు చేసి, బిపిన్ చంద్రపాల్‌గారు వందేమాతరం ఉద్యమాన్ని ప్రజల్లోకి తీసుకుపోతున్నారు.

ఆయన ఉపన్యాసాలు, ఆయన పేర్కొంటున్న సంస్కరణలు, ఆయన భావావేశం అందరిని ఆకట్టుకొంటున్నాయి.

అది అంతకు మునుపు ఎరగని జాతీయ భావావేశం!

వందేమాతరం ఉద్యమాన్ని చేత పుచ్చుకుని బిపిన్ చంద్రపాల్ గారు బందరు రావడంతో బందరు పురంలోని సంస్కరణాభిలాషులంతా పులకించి పోతున్నారు.

బ్రహ్మసమాజం పక్షాన ఉపన్యసించడానికి ఆయన బందరు విచ్చేశారు.

"జాతీయ స్థాయి ప్రతిష్ట కల్గిన లాల్, బాల్, పాల్, త్రయంలో ఒకరు బిపిన్ చంద్రపాల్. పంజాబ్ కేసరి లాలాలజపతిరాయి, బాలగంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్ ఈ ముగ్గురూ తొలి తరం స్వాతంత్రం సమరయోధులనీ, ఇప్పుడు కొత్తగా పద్దెనిమిదేళ్ళ క్రితం వ్యవస్థాపించిన భారత జాతీయ కాంగ్రెస్ సంపూర్ణ స్వరాజ్యం సాధించాలని కంకణం కట్టుకొందనీ బిపిన్ చంద్రపాల్‌గారిని పరిచయం చేస్తూ ముట్నూరి కృష్ణారావుగారు అనేక రాజకీయ విశేషాలను సభకు వివరించారు.

అయ్యదేవర కాళేశ్వరరావుగారు, డా॥ పట్టాభి సీతారామయ్యగారు తీరిక లేకుండా సభా ఏర్పాట్లు చూస్తున్నారు.

కృష్ణా పత్రిక ద్వారా ముట్నూరి కృష్ణారావుగారు ప్రజల్లో రగిలిస్తున్న స్వాతంత్ర్యే గురించి, ఆయన చేస్తున్న సమాజసేవ గురించి అక్కడ వున్న సభాసదులందరి తెలుసు. వయసులో చిన్నవారే అయినా, కృష్ణారావుగారిని ప్రతి ఒక్కరూ గౌరవిస్తార

బిపిన్ చంద్రపాల్‌గారు ఆరోజు బందరులో మహోపన్యాసం చేశారు.

"ఈనాడు, ఈ 1903 సంవత్సరంలో భారతదేశం మొత్తంమీద కేవలం పదా వేల మంది మాత్రమే నెలకు 75 రూపాయలు కన్నా ఎక్కువ జీతం తీసుకు వారున్నారు. దీని అర్థం ఉద్యోగాలు దొరక్క నిరుద్యోగులు పెరిగి పోతున్నారని కాద ఈ పరిస్థితి ప్రస్తుతం పాశ్చాత్య దేశాల్లో వుంది. కానీ, భారతదేశానికి వస్తే, ఇక్క పట్టభద్రులు తయారు కావడమే గగనంగా వుంది.

మిత్రులారా! ఒక్కసారి ఆలోచించండి.

గత వైభవాల గురించి గొప్పలు చెప్పుకుంటే ప్రయోజనం లేదు.

దూరదృష్టితో దృఢమైన భారత జాతిని నిర్మించుకోవాలని యువకుడైన తత్త్వవే వివేకానందుడు చెప్పిన మాటలు మీకు గుర్తుచేస్తున్నాను.

కరువు కాటకాలకు నిలయమైన ఇథియోపియా ఇటలీమీద గెలిచింది. 18 తర్వాత జపాన్ ఆధునికమైన పటిష్టమైన సైనిక శక్తిగల దేశంగా మారింది.

దీన్నిబట్టి మనకు అర్థం అవుతున్నదేమంటే, రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్య ఒక్కటే శాశ్వతం కాదని! తలచుకొంటే, బ్రిటిష్ వారిని జయించడం భారతీయుల అసాధ్యమేమీ కాదనీ...!!

ప్రియమైన స్నేహితులారా!!

మద్రాసు నగరంలో మీ తెలుగు వాడైన గాజుల లక్ష్మీ నరసింహ శెట్టిగా "చెన్నపట్టణ స్వదేశీ సంఘం" పెట్టి, బ్రిటిష్ వారి దౌష్ట్యాల్ని ఎదుర్కొంటూ ప్రజ సంఘటితం చేస్తున్నారు.

ఇంతకు మునుపులాగా కాకుండా, ఇప్పుడు భారతీయులంతా ఒకే దేశమ బిడ్డలుగా భావించుకోవాలని దేశభక్తులందరూ చెప్తున్నారు.

ప్రతిరోజూ సంధ్యావందనం చేసేప్పుడు జంబూద్వీపే, భరతవర్షే, భరతఖం అని సంకల్పం చెప్తున్నారు కదా... దాని అర్థాన్ని ఇప్పుడు చేతల్లో మనం నిరూపించా ప్రజలందరూ NATIONALIST MOVEMENT తో కలిసి రావలసిందిగా పిలుపు నిస్తున్నా భారతీయులందరూ ఒకే జాతి! ఒకే ప్రజ!!

మనం తమిళులమనీ, ఆంధ్రులమనీ, బెంగాలీలమనీ భేదభావం లేకుం అందరం అఖండ భారతీయులం అని భావించు కోవాలి--" అంటూ గంభీరం ఉపన్యసించారు బిపిన్ చంద్రపాల్.

రోమాంచితులైన ప్రతిఒక్కరిలోనూ ఆ సభలో దేశభక్తి తాండవించసాగింది.

ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావుగారు, బయ్యా నరసింహశర్మగారు, మోచర్ల రామచంద్రరావుగారి వంటి అఖిలభారత స్థాయిగల తెలుగు ప్రముఖుల స్ఫూర్తితో స్వరాజ్య సాధన చేయాలని అనుకోసాగారు. ప్రతిఒక్కరూ అది మన జన్మ హక్కుగా భావించారంతా!

బిపిన చంద్రపాల్ గారి గౌరవార్థం విందు ఏర్పాటు చేశారు ముట్నూరు కృష్ణారావుగారు.

చక్రపొంగలి, గారెలు, ఆవడలు వండించి వడ్డించారు. బ్రాహ్మలతో సహా అందరూ పాల్ గారితో కలిసి విందారంగించి కాఫీలు త్రాగారు ప్రశాంతంగా సమావేశం ముగిసింది.

కానీ, అది తుఫాన్ ముందరి ప్రశాంతత అని అప్పట్లో ఎవరూ ఊహించలేదు!



"చాతుర్వర్ణ్యం మయా సృష్టం" అంటూ భగవద్గీత శ్లోకాన్ని చదివి అర్థంచెప్తున్నారు వేముల వెంగళయ్య.

విష్ణుపాదంతో కూడిన త్రిపుండ్రధారణ చేసిన ఆయన ముఖవర్చస్సు ఆ మసక చీకటిలో సైతం దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది.

వైష్ణవ మతప్రచారం చేయడం ఆయనవృత్తి. వైష్ణవ పీఠానికి ఆయన అధిపతి.

పంచముల పురోహితుడుగా ఆయన చుట్టుప్రక్కల గ్రామాల్లో చాలా ప్రసిద్ధులు

అది నేటి గుంటూరు జిల్లా వడ్డమానుగ్రామం.

ఒకప్పుడు-బహుశా జైన సంస్కృతి బాగా వ్యాప్తిలో వున్నప్పుడు - ప్రసిద్ధిచెందిన ఊరిది.

భగవాన్ వర్ధమానుడిపేరున ఈ ఊరు వెలిసిందనీ, అదే వడ్డమాను అయ్యిందనీ చాలామంది నమ్మకం.

ఊరుకు పడమర దిక్కున కొండమీద బౌద్ధారామం కూడా వుంది. అయితే, అది ఇటీవలి కాలంలో బైటపడింది. ఈ కథాకాలానికి దాని గురించి ఎవరికీ తెలియదు.

తార్కికంగా వడ్డమాను సగటు భారతీయ గ్రామీణ సంస్కృతికి ప్రతిబింబంగా వున్న గ్రామమే!

ఆ సాయంత్రం వీధి అరుగుమీద కూర్చుని విష్ణువు గురించిన కథలు చెప్తున్నారు వేముల వెంగళయ్యగారు.

వెంగళయ్యగారి పురాణకథలు వినడానికి వేదాంతం అర్థంచేసుకోవడానికి పంచములేకాదు అప్పుడప్పుడూ ఇతర కులాలవాళ్ళు కూడా కాసేపు కూర్చుని విని వెళ్తుంటారు. అది ఆయన ప్రసిద్ధి.

ఆపూట కథ అర్జునుణ్ణి యుద్ధానికి తయారుచేయడం గురించి నడుస్తోంది. మన సామ్రాజిక వ్యవస్థ ఎలా ఏర్పడిందో అర్జునుడికి వివరంగా చెప్తున్నాడు శ్రీకృష్ణుడు-

"బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు - ఈనాలుగు వర్ణాలవారినీ నేనే సృష్టించాను" - అని గీతలో భగవంతుడు స్వయంగా చెప్పుకొన్నాడు - "వివరించారు వెంగళయ్యగారు.

"దాసుగారూ - వర్ణాలంటే ఏంటండీ" ఓ భక్తుడు కుతూహలంగా అడిగాడు.

ఈ గీతా శ్లోకంలో తర్వాతి భాగంలో దానర్థాన్ని భగవంతుడే స్వయంగా చెప్పాడు "గుణ కర్మ విభాజకః" అని! అంటే, గుణాన్ని బట్టి, చేసే పనిని బట్టి, వృత్తినిబట్టి మనుషులందరినీ నాలుగు రకాలుగా విభజిస్తున్నాను" అని దీని అర్థం -" వివరంగా చెప్పారు వెంగళయ్యగారు.

"మీకింకా వివరంగా అర్థం అయ్యేందుకు మరికొన్ని విషయాలు చెప్తాను. ఇప్పుడు ఇక్కడ కూర్చున్న మనల్ని అందర్నీ పంచములు అంటున్నారు కదా... మరి ఉన్నవి నాలుగు వర్ణాలే కదా... మనం ఐదో వర్ణం - కాబట్టి "పంచములు" అన్నారు మనల్ని" అంటూ ఇంకా ఏదో వివరించబోయేంతలో ఒక ప్రశ్న వచ్చింది -

"భగవంతుడు నాలుగు వర్ణాల్నే సృష్టించానని స్పష్టంగా చెప్పాడు కదా..." ఈ ఐదో వర్ణం వాళ్ళని భగవంతుడు సృష్టించలేదనే అర్థమా...? అని

"మంచిప్రశ్న!" మెచ్చుకోలుగా చూశారు వెంగళయ్యగారు. ఈ ఐదో వర్ణాన్ని ఖచ్చితంగా భగవంతుడు సృష్టించలేదు. మనుషులు సృష్టించారు. సృష్టించి. వాళ్లముఖాన అంటరానివాళ్ళని ముద్రవేసి ఊరికి దూరంగా తరిమేశారు" వివరించసాగారు వెంగళయ్యగారు. వింటున్నారు జనం.

"అందుకే మనుధర్మ శాస్త్రంలో మనువు ఏమంటాడో తెలుసా...బ్రాహ్మణ క్షత్రియో వైశ్యస్త్రయో వర్ణా ద్విజాతాయః చతుర్థ ఏక జాతిస్తు శూద్రో నాస్తితు పంచమః" అని. ఇంతపెద్ద సంస్కృతం మాటలు మీకు అర్థం కావు. చిన్నగా మీకు అర్థం అయ్యేలా చెప్తాను వినండి-

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు ఈ ముగ్గురూ కర్మకాండలు చేసేందుకు అధికారం గల వాళ్ళు. అందుకని వాళ్ళకి ద్విజులు అనిపేరు. మిగిలిన కులాలన్ని నాలుగోజాతి శూద్రులు క్రిందకు వస్తారు. ఇంక ఐదోజాతి అనేది లేనేలేదు.-" అని స్పష్టంగా చెప్పాడు మనువు. కాబట్టి శూద్రులకు అంటరానితనం ఎలాలేదో - మాలలకు మాదిగలకు కూడా అలానే అంటరానితనం వుండకూడదన్నమాట -"

వివరంగా విడమరచి బోధించారు వెంగళయ్యగారు.

"నాయనలారా! ఈ విషయాలు మీకు ఎందుకు చెప్తున్నానంటే, మనలో కొందరైనా పైకి వచ్చి మన వాళ్ళ పట్ల ఈ సమాజం పాటిస్తున్న అంటరానితనాన్ని రూపుమాపడానికి

కృషిచేస్తారని..." అన్నారు నిర్వేదంగా! ఆ మాటలు అంటున్నప్పుడు ఆయన కళ్ళు చెమర్చాయి.

"పూర్వ జన్మలో చేసిన పాపపుణ్యాల వలన ఈ జన్మలో పుట్టుకతోనే మనుషులంతా అసమానులు" అని బ్రాహ్మలు చెప్తుంటారు. బాగా పుణ్యం చేస్తేనే వచ్చే జన్మలో బ్రాహ్మడై పుడతారని వారి నమ్మకం. బ్రాహ్మడై పుట్టి, అంటరానితనం పేరుతో సాటి మనిషిని హింసించిన ఈ పాపం వలన మళ్ళీ వచ్చే జన్మలో బ్రాహ్మణ పుటక దక్కదని వాళ్ళు ఎందుకు ఆలోచించరో మరి..." అన్నారాయన.

కాసేపు ఆ వీధి అరుగుమీద మౌనం ధ్వనించింది. వెంగళయ్య గారు దాసరే అయినా, మాలలంతా ఆయన్ని, మతగుర్తువుగా పురోహితుడిగా ప్రత్యేక గౌరవం ఇస్తారు కానీ, వెంగళయ్య గారు అలాంటి ప్రత్యేకమైన గౌరవాలను ఎన్నడూ కోరుకోలేదు. అందరితో కలిసిపోవాలనే ఆయన తాపత్రయం!!

ఇంతలో దూరంగా --

"నాలుగూ వేదాలను మథించిన బ్రాహ్మలకన్నా పెరుగూనీ మథించీ వెన్నాతీసి వెన్నుడికీ పెట్టిన గొల్లలం మేమే గొప్పన్నా...." అంటూ భామాకలాపం నాటకంలో ఓ పాట వినిపించసాగింది.

విని నవ్వుకున్నారు వెంగళయ్యగారు.

ఈ యుగానికి కావలసింది. బ్రాహ్మలకన్నా గొప్పకులం అని అనిపించుకోవడం కాదు. అన్ని కులాల మనుషులూ సమాన మవటం కావాలి అసలీ కులాలే లేని సమాజం మనకు రావాలి - అన్నారాయన.

"గొల్లవాళ్ళు తెచ్చే పాలు పెరుగు ఆళ్ళ మడికి పనికొస్తాయిటండి. గొల్లల్ని మాత్రం ఇంట్లోకి రానియ్యరండి. మడి అంటారండి. మనూరు రజకుల్నే తీసుకోండి. చలవచేసి ఉతికితెచ్చిన బట్టలు మాత్రం అంటుకోవచ్చుటండి. పూజారిగారింట్లో పనిమనిషి అంట్లుతోమితే పైన మంత్ర జలం చిలకరించినట్లు కాసిని నీళ్ళు చల్లి లోపల పెట్టుకొంటారండి... ఇంతకన్నా అవమానం వుంటుందా అండీ -" కొంచెం ఆవేశంగా అడిగాడు కాస్త వయసులో పెద్దాయన.

దానికి చిన్నగా నవ్వి సమాధానం చెప్పగారు వెంగళయ్యగారు.

"అంటరానితనం అనేది అన్ని కులాల్లోనూ అంతో ఇంతో ఏదో ఒక రూపంలో పాటించబడ్తూనే ఉంది. ప్రతికులం వాళ్ళు ఇంకోకులం వారికన్నా ఎక్కువ కులంగా చెప్పుకోవాలని చూస్తున్నారు. కులాల మధ్య ఈ ఆధిక్యపోటీ రోజురోజుకీ పెరిగిపోతోంది.

ఒకప్పుడు బౌద్ధ మతం పుచ్చుకున్నారు కాబట్టి, బ్రాహ్మలు, కోమట్లు, విశ్వబ్రాహ్మలు...వాళ్ళంతా శాకాహారులుగా జీవిస్తూ జంధ్యం వేసుకొని గాయత్రి చేసుకొంటున్నారు. వీళ్ళతోపాటు సాలీలు కూడా జంధ్యం వేసుకొని శాకాహారులుగా

మారారు. కంసాలులు, కుమ్మరులుకూడా చాలా మంది జంధ్యం వేసుకొని బ్రాహ్మణుల్లా జీవించాలని ప్రయత్నిస్తున్నారు. ఇదంతా ఈ ఆధిపత్య పోరాటంలో గెలుపుకోసమే.

మీకో కథ చెప్తాను వినండి -

1824 లో చిత్తూరు జిల్లా సదుప్పేరిలో ఓ విశ్వబ్రాహ్మల పెళ్ళికి బ్రాహ్మణ పురోహితుణ్ణి పిలవకుండా విశ్వబ్రాహ్మలపురోహితుణ్ణి పెట్టుకున్నారు. దాంతో బ్రాహ్మలకు కోపం వచ్చింది. వెంకట్రామనాయుడు అనే ఊరి పెద్దని వెంట పెట్టుకొని వెళ్ళి ఆ పెళ్ళి పందిరి మీద దాడి చేశారు.

"బ్రాహ్మలు మాత్రమే పౌరోహిత్యం చెయ్యాలి. ఇది మా హక్కు" అని ఆ తర్వాత కోర్టుకెక్కారు బ్రాహ్మలు.

విశ్వ బ్రాహ్మలు తరవున వెళ్ళమాచార్యులు, మార్గ సహాయాచార్యులు, రుద్రమాచార్యులు అనే ముగ్గురు తమకు పౌరోహిత్యం చేసే హక్కుందని కోర్టులో వాదించారు. వారికి హసయత్ సాయిబుగారు వకీలుగా వున్నారు.

కోర్టు విశ్వబ్రాహ్మల పక్షాన కేసు కొట్టేసింది దౌర్జన్యానికి పూనుకొన్నందుకు బ్రాహ్మలకు శిక్షవేసింది-" ఇదీ ఆ కథ.

నాయనలారా! ఇక్కడ మనం ఆలోచించవలసింది ఏ కులం వాళ్ళు గొప్ప అన్నది కాదు- ఏ కులమూ లేకుండా మనుషులందరం ఒక కులంగా వుండాలంటే ఏంచెయ్యాలనే విషయం గురించి -" గంభీరంగా ఉపన్యాసధోరణిలో వివరించారు వెంగళయ్య.

"మరి బ్రాహ్మలంతా అందరికంటే గొప్పకులస్థులు కాదంటారా..?" రెట్టించాడు ఇందాకటి శ్రోత.

"ఆ మాటకొస్తే బ్రాహ్మల్లో కూడా ఈ తక్కువ ఎక్కువ తేడాలు చాలా వున్నాయి. వైదీకి బ్రాహ్మలు తమని నియోగి బ్రాహ్మలకన్నా ఎక్కువ బ్రాహ్మలనుకొంటారు. ప్రతి చోటా ఎవరికి వారు ఇతరుల్ని తక్కువగానూ తమని ఎక్కువగానూ భావించుకోవడం అనే వుంది. అందుకే కులాలు లేకుండా మనం స్వేచ్ఛగా, సమానంగా బతకాలి- " అన్నారు వెంగళయ్య.

ఆ రాత్రి పురాణ కాలక్షేపం అంతా కులాల గురించేసాగింది.

"ఇదీ మంచిదే పెద్దకులాల్లో వున్నట్లే నిమ్నవర్ణాల వారిలో కూడా ఒకరిని ఇంకొకరు తక్కువగా భావించుకోవటం, ఒకరిపట్ల ఇంకొకరు అస్పృశ్యత పాటించటం అనేది వుంది. ఇలాంటి విషయాల్ని వివరంగా చెపితే పంచములంతా తమలో తాము భేదభావాలు లేకుండా కలిసిపోయి ఐకమత్యంగా వుంటారు-" అని మనసులో అనుకోసాగారు వెంగళయ్యగారు. రాత్రి ప్రొద్దుపోవటంతో ఆ పూటకథకిక 'స్వస్తి' చెప్పారాయన.



బందరులో బిపిన్ చంద్రపాల్ గారి సభకు వెళ్ళిన చాలామంది ముఖాలు వెలవెల పోయాయి.

నిజానికి బ్రిటిష్ వారి ఆగ్రహానికి గురి అయి, ఎలాంటి శిక్ష నెదుర్కోవాల్సి వస్తుందోనని వారిలో ఎవరూ భయపడటం లేదు. ఇది విదేశీభయం కాదు - స్వదేశీ భయమే!

అందరిచేతుల్లోనూ బ్రాహ్మణ సంఘం పంపిన శ్రీముఖాలున్నాయి. ఎవరికీ నోటమాట రావటం లేదు.

'ఏమిటో శర్మా ! మనఖర్మకాకపోతే ఈ నోటీసూ...?' అని ఒకాయన!

"నీకూ వచ్చిందటోయ్.... శాస్త్రీ?" అని ఇంకొకాయన.

బందరు పట్టణంలో బ్రాహ్మలందరినీ ఒక్క కుదుపు కుదిపింది బ్రాహ్మణ సంఘం.

మనం పోరాడవలసింది బ్రిటిష్ వారిపైనో సాటి కులస్థులపైనో అర్థంకాలేదు చాలామంది సంస్కరణ వాదులైన బ్రాహ్మలకు!

జంధ్యం తీసేసి, పంచములకోసం పాఠశాల నడుపుతున్న అయ్యదేవర కాళేశ్వరరావు గారి వంటివారు ఈ నోటీసుని లెక్కచేయకపోవచ్చు. కానీ, దేశంకోసం ఏదైనా చేయాలనే భావావేశంతో వున్న బ్రాహ్మణులు చాలా మందిని ఈ నోటీసు భయపెట్టిందన్న మాట వాస్తవం.

"బిపిన్ చంద్రపాల్ అనే శూద్రుడూ, క్రైస్తవుడూ అయిన వానితో కలిసి గారెలు, ఆవడలు వంటి భక్ష్యములు భుజించి, కాఫీ వంటి మత్తుపదార్థం త్రాగినందుకు మిమ్మల్ని బ్రాహ్మణ కులంలోంచి ఎందుకు వెలివేయకూడదో తెలుపుకోవలసింది" అని నోటీసు ఇచ్చారు... ఆసభకు హాజరయి, విందు తీసుకున్న ప్రతి బ్రాహ్మణుడికీ, బ్రాహ్మణ సంఘం అధ్యక్షులు. బందరు ఖొజ్జిల్లిపేట నాగేశ్వర స్వామి దేవాలయంలో విచారణ సభ మొదలయ్యింది.

సంస్కరణ వాదులంతా ఒకవైపు కూర్చున్నారు. పూర్వాచార పరాయణులైన పెద్దలు తమ ఆధిక్యతను ప్రదర్శిస్తూ ముందువరసల్లో కూర్చున్నారు.

అవసరం అయితే ఉపయోగపడతారని, ఎందుకైనా మంచిదని, అయ్యదేవర కాళేశ్వరరావుగారు కాలేజీ స్టూడెంట్లలో గట్టిగా నిలబడే కొందరు బ్రాహ్మణయువకుల్ని వెంటతెచ్చుకున్నారు.

బ్రాహ్మణ సభాపతి స్థానంలో పురాణం సుబ్రహ్మణ్య అవధానులుగారు ఆశీనులయ్యారు. వేమూరి సుబ్బారావు పంతులుగారు సంస్కర్తల పక్షాన వాదించడానికి వకాల్తా పుచ్చుకున్నారు.

సభా విచారణ ప్రారంభం అయ్యింది.

పురాణం వెంకటప్పయ్యగారు, జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారూ ఆ రోజుల్లో బందరులో ప్రముఖ న్యాయవాదులు. వీరిద్దరూ పూర్వాచార పరాయణుల పక్షాన, వాదిస్తూ సంస్కరణవాదులపైన ఆరోపణలు చేయటం మొదలు పెట్టారు.

సంస్కరణవాదుల్లో చాలామంది ఆందోళనగా కన్పించారు. బిపిన్ చంద్రపాల్ గారి సభకు వెళ్ళేముందున్న సంతోషం ఇప్పుడు వాళ్ళలో ఎవరిలోననూ లేదు. ఏదో తెలియని భయం! అనేక ప్రశ్నలు... దేనికీ సమాధానం దొరకటంలేదు- ఈ గొడవలు నుంచి బైట పడగలమా...? కులసంఘం "వెలి" తప్పించుకోగలమా...?

"అయ్యదేవర హరా! మీరు అనేకసార్లు అరెస్టు అయ్యారు కదా... అరెస్ట్ జరిగేటప్పుడు భయపడ్డారా...." కాళేశ్వరరావుగారిని ఓ సంస్కరణవాది అడిగాడు.

"బ్రిటిష్ వారి భయం కన్నా, కుల పెద్దలు వెలివేస్తారనే భయం మీకు ఎక్కువగా వున్నట్టుంది-" నవ్వుతూ అన్నారు కాళేశ్వరరావుగారు. "భయపడకండి - నన్ను చాలాసార్లు బ్రాహ్మణ సంఘం వెలివేసింది. అయినా నాకేమీ కాలేదు. - " అని అభయం ఇచ్చారు కాళేశ్వరరావుగారు సభలో వాదోపవాదాలు మొదలయ్యాయి.

"సంఘ సంస్కరణల పేరుతో కొందరు బ్రాహ్మణులైన ముఖ్యులు హిందూ మతాచారాలను విమర్శిస్తూ మత విధ్వంసానికి పాల్పడుతున్నారు. ఇలాంటి వ్యక్తుల పక్షాన పెద్దలు వేమూరి సుబ్బారావుగారు వకాల్తానామా పుచ్చుకోవడం ఆశ్చర్యంగా వుంది.-" అన్నారు పురాణం వెంకటప్పయ్యగారు.

"బందరులో సంస్కరణ వాదులైన బ్రాహ్మలు ఎవరూ హిందూమతాన్నిగానీ, హిందూమత పెద్దల్నిగాని ధిక్కరించినట్లు ఎక్కడా సాక్ష్యం లేదు - "అని వేమూరి సుబ్బారావుగారు ప్రతివాది వాదనని పూర్వపక్షం చేశారు.

"13 సంవత్సరాల క్రితం మనబందరు పట్టణంలోనే నోబుల్ కళాశాలలో చదువుకొంటున్న 12మంది బ్రాహ్మణ యువకులు ఒకేరోజు క్రైస్తవమతం స్వీకరించిన సంగతి మీ అందరికీ గుర్తుండే వుంటుంది. ధన్వాడ అనంతం, ఓరుగంటి శివరామ కృష్ణయ్య, చేవెంద్ర వెంకటాచలం, దర్భారామశాస్త్రి, బోడి సీనయ్య, సముద్రయ్య, మల్లాది వెంకటరత్నం, ప్రభల రామచంద్రయ్య... వాళ్ళంతా హిందూమతాన్ని అవమానిస్తూ క్రైస్తవాన్ని స్వీకరించిన బ్రాహ్మణులే!

బ్రిటిష్‌వారు రోజూ కనీసం వందమందిని ప్రలోభపెట్టి, క్రైస్తవమతం స్వీకరించేలా చూడమని పురమాయించినట్లు తెలుస్తోంది.

ప్రభుత్వంవారి ప్రలోభాలకు ఇతర కులస్థులు తేలికగా లొంగిపోవచ్చు. కానీ, బ్రాహ్మణులు కూడా అందుకు ఊతం ఇస్తూ క్రైస్తవులతో కలిసి విందులు స్వీకరించటం. కాఫీ తాగటం ఖచ్చితంగా మత విరుద్ధమైన కార్యాలుగానే భావిస్తున్నాను.-" అన్నారు వెంకటప్పయ్యగారు.

వేమూరి సుబ్బారావుగారు వెంటనే లేచి ఈ వ్యాఖ్యానాన్ని ఖండిస్తున్నానని ప్రకటించారు.

సభపతిగారు కూడా పూర్వాచార పరాయణులే కాబట్టి, ఆయనకూ వేమూరి సుబ్బారావుగారి వాదనలు కొంచెం ఇబ్బందిగానే ఉన్నాయి. "అధ్యక్షా! క్రైస్తవమతాంతరీకరణలనేవి, కేవలం బ్రిటిష్ ప్రభుత్వం వారు తమ ప్రభుత్వానికి అనుకూలంగా వుండేలా భారతీయుల్ని మచ్చికచేసుకోవడానికి చేస్తున్న ఒక ఎత్తుగడ మాత్రమే! క్రైస్తవులుగా మారిన హిందువులు భారత జాతీయ కాంగ్రెసుకు, అది పిలుపునిచ్చే ఉద్యమాలకూ వ్యతిరేకంగా పనిచేసే వ్యక్తుల కూటమిగా మారిపోతున్న సంగతిని మీరు కూడా గమనించండి! అందుకని బ్రాహ్మణులూ, పంచములే కాదు అన్ని కులాలవాళ్ళూ హిందూ ధర్మాన్ని వదలి క్రైస్తవం స్వీకరించడాన్ని జాతీయతాభావ దృష్టితో మేముకూడా ఖండిస్తున్నాం. సంస్కరణ వాదులైన ప్రతి ఒక్కరూ క్రైస్తవ మతాంతరీకరణని వ్యతిరేకిస్తారు. అంతమాత్రాన క్రైస్తవులను శత్రువులుగా చూడనవసరం లేదు. - అన్నారు.

వెంకటప్పయ్యగారికి ఈ సమాధానం చాలా కోపం తెప్పించింది. "ఓ ప్రభువా! వారికేమి కావలయునో వారికే తెలియదు. వారిని క్షమియింపుము అని ఏసుక్రీస్తు చెప్పిన వాక్యాలు ఈ బందరు సంస్కరణ వాదులకు బాగా వర్తిస్తాయని నా అభిప్రాయం-" అని ఎద్దేవాగా అన్నారు. ఆ మాటకు పూర్వాచారులు ఘొల్లున నవ్విచప్పట్లు కొట్టారు.

వేమూరి సుబ్బారావు గారు ప్రశాంతంగా కూర్చున్నారు. కోపం తెచ్చుకొంటే వాదించేప్పుడు పట్టు తప్పి విషయాన్ని వదిలేసి అనవసరంగా అరుపులూ కేకలూ వస్తాయి. అందుకని విజయం సాధించే లాయరెప్పుడూ చిరునవ్వుని కోల్పోడు.

"క్రైస్తవుల చర్యలను మాత్రం ఖండిస్తారట కానీ, క్రైస్తవులతో మాత్రం మిత్రత్వం వదులుకోరట అన్నారు మళ్ళీ ఎద్దేవాగా వెంకటప్పయ్యగారు.తిరిగి చప్పట్లు మ్రోగాయి.'

"ఇదంతా మత ధిక్కారం, బ్రాహ్మణ సంఘ వ్యతిరేకచర్యలుగానే నేను భావిస్తున్నాను" అని ఖండితంగా ప్రకటించి కూర్చున్నారాయన.

"మహాశయా! కాలం మారుతోంది. 18వ శతాబ్దపు పురాతనయుగంలోంచి 19వ శతాబ్దపు ఆధునికయుగంలోకి మనం అడుగు పెట్టి అప్పుడే మూడు సంవత్సరాలయ్యింది. 19వ శతాబ్దపు అత్యంత ఆధునిక ప్రపంచంలోకి మన సమాజం పరిణమిస్తోంది.

కొన్ని శతాబ్దాలుగా రాజులు, పాదుషాలు, దొరలు మనల్ని, మన జాతీయుల్ని బానిసల్ని చేసి చీకటి గదుల్లో అణగదొక్కి వుంచారు.

ఇప్పటికైనా మనం కళ్ళు తెరిచి వాస్తవ పరిస్థితిని అర్థం చేసుకొని,ప్రపంచంలో వస్తున్న మార్పుల్ని అవగాహన చేసుకోగలగాలి. ఇదేజరగకపోతే హిందూ సమాజం తప్పకుండా కుళ్ళిపోతుంది.

అందుకనే, అధ్యయనం కోసం, పరిశీలనకోసం మాత్రమే సంస్కరణవాదులు ఆ సభకు హాజరయ్యారు. ఇందులో కుల పెద్దలపట్ల ధిక్కారం ఏదీ నాకు కన్పించడం లేదు''- అన్నారు.

"శూద్రునితో కలిసి గారెలు తిని, కాఫీ త్రాగడం కూడా సంస్కరణయేనా-?'' వ్యంగ్యంగా అన్నారు వెంకటయ్యగారు.

ఈ ప్రశ్నతో సంస్కరణ వాదుల పని అయిపోయిందని సంతోషపడ్డారు సనాతనులు.

"ఖచ్చితంగా శూద్రులు వండిన భక్ష్యములు శూద్రులతో కలిసి బ్రాహ్మణులు భుజించడం, కాఫీ వంటి మాదకద్రవ్యాలను సేవించడం బ్రాహ్మణ్యానికి విరుద్ధం. ఇట్టి చర్యలను ఖండించి తీరాల్సిందే!'' అని వెంకటప్పయ్యగారు మళ్ళీ బల్లగుద్ది చెప్పారు.

సంస్కరణ వాదులు ఏం సమాధానం చెప్తారోనని అందరూ ఆసక్తిగా ఎదురు చూడసాగారు.

"కాఫీ త్రాగడం మాటేమిటీ - అందులో సంస్కరణ ఏదీలేదుగా - ఇక్కడ మనకి దొరికిపోతారంతా...'' అనుకోసాగారు సనాతన పరాయణులు. కాఫీతాగడం కూడా పెద్దనేరం ఏమీకాదు దానికి కులబహిష్కారం వంటి శిక్షలు మంచివికాదనే వారూ వున్నారు వారిలో.

ఇంతలో బందరు నోబుల్ కళాశాలలో లెక్చరర్‌గా పనిచేస్తున్న నరసింహశాస్త్రిగారు లేచి యాజ్ఞవల్క్య స్మృతిలోంచి కొన్ని శ్లోకాలుచదివి వినిపించడం మొదలుపెట్టారు. ఎవరికి వాళ్ళు దాని అర్థం ఏమిటా అని ఆలోచిస్తుండగా నరసింహశాస్త్రి గారే వాటి భావం వివరించారు.

"మహాశయా! ఈ శ్లోకాలు ఇక్కడ పాండిత్య ప్రకర్షకోసమో పురాణ కాలక్షేపం కోసమో నేను చదవటంలేదు. ఇప్పుడు మన మధ్య ఏర్పడిన వివాదానికి ఇందులో చక్కని పరిష్కారం వుంది -

తైలంలోవేసి వండితే, శూద్రుడు వండినా ఆ భక్ష్యాల్ని బ్రాహ్మలు తినవచ్చునని యాజ్ఞవల్క్యస్మృతిలోని ఈ శ్లోకాల్లో స్పష్టంగా వుంది. కాబట్టి, పూర్వాచార పరాయణులూ, సనాతవ వాదులూ చేసిన వాదాల్ని ఈ మహాసభ అంగీకరించేట్లయితే ఆనిర్ణయం యాజ్ఞవల్క్యస్మృతికి వ్యతిరేకం అవుతుందేమోనని భయపడ్తున్నాను. ఎందుకంటే, బ్రాహ్మలకు స్మృతులను ధిక్కరించిన పాపం అంటుకోకూడదు కదా... ' అన్నాడు ఎంతో వినయంగా!

అంతే! సభలో సనాతనుల ముఖాలు మాడిపోయాయి.

"ఈ తైలపక్వశాస్త్రి మధ్యలో వచ్చి మన కొంపముంచాడు గదండీ గౌరీనాథ శాస్త్రిగారూ...'' అన్నారు వెంకటప్పయ్యగారు.

సభాపతి సుబ్రహ్మణ్య అవధానిగారు చివాల్న లేచి నుంచున్నారు. "ఈ సభని ఇంతటితో ముగిస్తున్నాను." అంటూ ప్రకటించి, వెనక్కి తిరక్కుండా వెళ్ళిపోయారు.

ఆయన వెనకే పూర్వాచారవాదులంతా ఒక్కొక్కరూ చల్లగా జారుకున్నారు.

"ఒక వేదమైనను అధ్యయనము చేయని బ్రాహ్మణులు తమ కుమారులకు వేదాధ్యయనం చేయించకుండా డబ్బుమీద ఆశతో ఆంగ్లవిద్యల్ని నేర్పిస్తున్నారు. వాళ్ళని డాక్టర్లుగానూ లాయర్లు గాను, గవర్నమెంట్ ఉద్యోగులు గానూ చేస్తున్నారు. పైకిమాత్రం పూర్వాచార పరాయణులమని హిందూసంఘంలో గొప్పలు చెప్పుకొంటున్నారు" అని విమర్శించారు అయ్యదేవర కాళేశ్వరరావుగారు. "ఈ విజయం ఇక్కడితో ఆగితే సరిపోదు. ఈనాడు సనాతన వాదుల పక్షాన నిలిచిన వారిలో తక్కువ మేధావులు ఎవరూలేదు. ముఖ్యంగా పురాణం వెంకటప్పయ్యగారి వంటి పెద్దలందరిని నెమ్మదిగా మనలో కలుపుకోవాలి - " అన్నారు కాళేశ్వరరావుగారు. ఉద్యమం బలపడాలి అనేదే ఆయన ధ్యేయం.



బడి గంట కొట్టారు.

పిల్లల గుసగుసలు, కేరింతలు, అల్లర్లు... అన్నీ ఠక్కున ఆగిపోయాయి.

ఎక్కడిదొంగలు అక్కడనే గప్‌చిప్... అంతా ఎవరి చోట్లలో వాళ్ళు మూతిమీద వేలువేసుకొని కూర్చున్నారు.

బడి అంటే... అది బడే... చెట్టుక్రిందే నడుస్తున్నా పాఠాలు చెప్తారు కాబట్టి దాన్ని బడి అనే అనాలి!

బడిలో వాడే వస్తువు కాబట్టి ధాన్ని "బడిత" అన్నారన్నట్లుగా... చర్మానికి తాకితే చిర్రున చీరుకుపోయే... బెత్తం... మాష్టారి బల్లమీద మాష్టారికి బదులుగా మొత్తం స్కూలు పిల్లల్ని కంట్రోల్ చేస్తోంది.

"ఒరేయ్ సుబ్బావధానీ...", దూరంగా ఎవరితోనో మాట్లాడుతున్న స్కూలు మాస్టారు ఐదో క్లాసు స్టూడెంట్‌ని గట్టిగా పిలిచారు.

సుబ్బావధాని లేచినిలబడ్డాడు.

"ఈ దస్తావేజులు రెండూ ఈయన గారికి రాసిపెట్టి వస్తాను. అందాకా క్లాసులు నువ్వు తీసుకో - బిగ్గరగా అక్కడినుంచే అరిచారు మాష్టారు.

సగటు గ్రామీణ జీవితంలో స్కూలు మాస్టర్ ఆరోజుల్లో నాలుగు అక్షరం ముక్కలు నేర్చిన వాడు కాబట్టి పరోపకార పరాయణుడిగా ఊరి ప్రజలకు అనేక రకాలుగా వినియోగపడే వాడు!

కరణాలు, మున్సబులతో భూమి వ్యవహారాలు మాట్లాడిపెట్టటం,. కోర్టు విషయాల్లో లాయర్లతో మాట్లాడి పెట్టటం, దస్తావేజులు రాసి పెట్టటం. క్రయవిక్రయాల లావాదేవీలు నడిపి పెట్టటం... ఇలాంటి పనులన్నింటికీ స్కూలు మాష్టారు ఎంతగానో తోడ్పడేవారు.

సుబ్బావధాని ఒకటో తరగతి వాళ్ళచేత 'అఆ'లు, రెండో తరగతి వాళ్ళ చేత ఎక్కాలు మూడో తరగతి వాళ్ళచేత తెలుగు వాచకం నాలుగో తరగతి వాళ్ళచేత పెద్ద బాలశిక్ష చదివించసాగాడు.

మిగతా ఐదో తరగతి పిల్లలు స్కూలు మొత్తాన్నీ కంట్రోలుచేస్తున్నారు- సుబ్బావధాని పర్యవేక్షణలో.

ఇంతలో మూడో తరగతి పిల్లలమధ్య చిన్నగా అలజడి మొదలయ్యింది.

సుబ్బావధాని... పాపంవాడూ కుర్రాడే.. అటువైపు చకాచకా అడుగులేసి 'సైలెన్స్' అని బిగ్గరగా అన్నాడు.

"ఎవడ్రా అరిచింది- తాటవలిచేస్తాను- మాష్టారికి చెప్పమంటారా..." గదమాయించాడు.

చెట్టు చుట్టూరా నేలమీదే కూర్చున్నారు పిల్లలు. తరగతుల వారీగా కూర్చోవడంతో ఒకేసారి పిల్లలందరిన్నీ అదుపులో పెట్టడానికి వీలయ్యింది.

"అరిచింది ఎవడ్రా...?" మళ్ళీ అడిగాడు సుబ్బావధాని.

'నేనే...' అంటూ ఓ బ్రాహ్మల కుర్రాడు లేచినుంచున్నాడు.

"ఎందుకరిచావు..."

"వీడెవడో నన్ను అంటుకో వద్దంటే, అంటుకొంటూన్నాడు - అందుకని..."

"అంటుకుంటే ఏవయ్యింది...?"

"ఏమో నాకు తెలీదు- బళ్ళో ఎవర్నీ అంటుకోకుండా ఇంటికి రమ్మని మా బామ్మ చెప్పింది."

"అంటుకొంటాను - ఏం చేస్తావ్?" రెట్టించాడు అంటుకున్న ఆ అంటరాని కుర్రవాడు.

"అంటుకొంటే ఏంచేస్తానా...? గూబ్బగలగొడతాను-".

"అయితే... అంటుకొన్నాను- ఏదీ కొట్టు" రెచ్చిపోయాడు ఆ కుర్రవాడు.

"ఒరేయ్ అంటరానివాడా.. మా బామ్మతో చెబుతానుండు -" అంటూ ఏం చేయాలో తోచక ఏడుపు లంఘించుకున్నాడు బ్రాహ్మల కుర్రవాడు.

"నిన్నే కాదు - అందర్నీ అంటుకుంటాను. వీణ్ణి అంటుకున్నాను. వీణ్ణి అంటుకున్నాను... అందర్నీ అంటుకుంటాను..." అంటూ రోషంతో అందరినీ అంటుకోవటం అనే ఉద్యమాన్ని ప్రారంభించాడు. ఆ అంటరాని వాళ్ళబ్బాయి. దాంతో ఒకటోతరగతి పిల్లలంతా లేచి అతనిమీద తిరగబడ్డారు. ఒకరిమీద ఒకరుపడి తన్నుకోసాగారు.

పాపం సుబ్బావధానికి క్లాసుని కంట్రోలు చెయ్యడం ఎట్లాగో తెలీలేదు.

దాన్తో, వాడి ఐదో తరగతి పిల్లల్ని పిలిచి వాళ్ళ సహకారంతో ఒకటో తరగతి వాళ్ళందరినీ విడదీయించాడు.

అందరూ కలిసి క్లాసులో గలభా సృష్టించిన వాళ్ళ సహకారంతో అంటరాని వాళ్ళబ్బాయిని మాష్టారి దగ్గరకు లాక్కువెళ్ళారు.

ఒకటో తరగతే చదువుతున్నా బలిష్టంగా వుండడంతో ఆకుర్రవాణ్ణి లాక్కు వెళ్ళడానికి పెద్దపిల్లలు నానా అవస్థ పడ్డారు.

"వీడు క్లాస్‌లో అందర్నీ అంటుకొని ఏడిపిస్తున్నాడు" అని ఫిర్యాదు చేశాడు సుబ్బావధాని. వాడి పంచె కట్టుజారిపోకుండా మొలతాడుని ఒకసారి సరిచేసుకున్నాడు.

"ఎవరబ్బాయిరా నువ్వు-" గద్దించాడు మాష్టారు. దస్తావేజులు రాసేపని మధ్యలో ఆపవలసివచ్చి నందుకు ఆయనకు చాలా చిరాగ్గా వుంది.

"వేముల వెంగళయ్యగారబ్బాయిని-" గొప్పగా చెప్పాడు తలెగరేస్తు

"అబ్బా!" హేళనగా అన్నాడు మాష్టారు. వెంగళయ్య గారబ్బాయివా... దొరగారబ్బాయివి కదూ..." వ్యంగ్యంగా అన్నాడాయన. 'నీపేరు?' ఉరిమిచూస్తూ గదమాయించి అడిగాడు.

"కూర్మయ్య- వేముల కూర్మయ్య" తనదే ఘనమైన పేరైనట్లు చెప్పాడు ఆ కుర్రవాడు.

"ఈ వెధవ అందర్నీ అంటుకున్నాడ్రా-?" మాష్టారు సుబ్బావధాన్ని అడిగాడు. "మేం అందరం మైలపడ్డాం... అండీ-" జవాబు చెప్పాడు అవధాని.

దాంతో మాష్టారికి చాలాకోపం వచ్చింది. "ఒరేయ్! ఈ కూర్మయ్యచేత యాభై గుంజీలు తీయించండి. మీ అందరూ ఇంటికి పోయి స్నానాలు చెయ్యండి. ఈ పూటకు క్లాసులు లేవు పొండి - " అని కేకలేసి మళ్ళీ తన దస్తావేజులు రాసే పనిలోకి దూరిపోయాడాయన.

"ఈస్కూలు పిల్లల్తో వేగడం మీకు చాలా కష్టం లాగుందే! దస్తావేజులు రాయించు కొనేందుకు వచ్చినాయన మాష్టారి పట్ల సానుభూతిగా అన్నాడు.

"ఏం పిల్లలో... ఏంచదువులో... ఇవి చట్టుబంతలు. అన్నారు మాష్టారు విసుగ్గా!

దస్తావేజులు రాయించుకునేందుకు వచ్చినాయనునాసంభాషణ కొనసాగించాడు "పంచముల పిల్లలు చదుకొని మాత్రం ఉపయోగం ఏవుంటుందండీ...? పంచములకి లౌకిక వ్యవహారాలు కావాలా? గణితం, సాంఘిక శాస్త్రం, భౌతికశాస్త్రాలు వీళ్ళకెందు కండీ... ఉళ్ళేలతారా...? రాజ్యాలేలతారా?" తన మనసులో వున్న అక్కసంతా వెళ్ళగక్కాడాయన.

స్కూలుమాష్టారేమీ మాట్లాడలేదు.

"ఇలాంటివాళ్ళ మధ్య చదివిస్తున్నారు కాబట్టి బ్రాహ్మలు వాళ్ళ పిల్లలకు సచేలస్నానం చేయిస్తున్నారు. ఈ పంచములతోకూర్చుని, మా పిల్లలుకూడా అంటరాని

వాళ్ళయిపోతున్నారు. మమ్మల్ని మాలల్లో కలిపేశారు కదండీ" అన్నాడాయన. మాష్టారు ఇంకేం మాట్లాడకుండా దస్తావేజులు రాసే పనిలో తలదూర్చారు. ఆ ఆగంతకుడు ఏమేమో మాట్లాడుతున్నాడుగాని, మాష్టారు విన్పించుకోలేదు.



పేదవాడి పేగులా వూరు ఛెరువెండిపోయింది!

వేసవి వెళ్ళి నెలరోజులు దాటినా ఇంకా ఎండలు కరకరలాడ్తూనే వున్నాయి. ఇలాంటి ఎండలు ఎప్పుడూ చూళ్ళేదు... అనుకొంటున్నారు వడ్డమాను ప్రజలు. ఎండలు మండుతూనే వున్నాయి - వానజాడలేదు. చుట్టుపక్కల వూళ్ళలో కూడా నూతులు నిండుకున్నాయి. నూతి అడుగున ఎక్కడో చెంబుడు నీళ్ళూరితే, ఆ బురదనే తోడుకుని నీటిని పిండుకొంటున్నారు... ప్రజలంతా ఆదుర్దాగా వున్నారు... వాన పడక పోతే ఏంచెయ్యాలి...?

"ఇంత ఎండకి నెర్రెలిచ్చిన ఈనేలమీద ఎంత వానకురిస్తే సరిపోనూ...?" అంటున్నాడో రైతన్న!..... ఆకాశంలోకీ నేలమీదకీ తేరిపారచూస్తూ!

గోదాముల్లో ధాన్యం నిలవుంచుకున్న వాళ్ళకి కూడా తాగునీరు దొరకకపోవడంతో దిగులు పట్టుకొంది -

తిండి లేకపోయినా ప్రాణాలు నిలబెట్టుకోవచ్చు.... నీరులేక పోతే ఏం చెయ్యాలి...?

పిల్లల ఆలనాపాలనల్ని వదిలేశారు. ముద్దూముచ్చట్లు మరిచిపోయారు. దారిన పోయేవాడు అంటరానివాడైనా వాడి భుజాన వ్రేలాడే తాబేటికాయలో నీళ్ళు తాగడానికి ఎవరూ వెనకాడడం లేదు. అంటుకోగలవాడైనా, అంటరానివాడైనా... ఒకటే ఆలోచన... "కరువులో ప్రాణాలెలా నిలబెట్టుకోవాలి..."

అమరావతికి వెళ్ళి, కృష్ణలో దూకితే గానీ ఈ తపన తీరేట్లు లేదు... కృష్ణలో మాత్రం నీరెక్కడుంది!!

ఎవరికి తోచిన మార్గాన వాళ్ళు వూరి నుంచి బైట పడే ఆలోచన చేస్తున్నారు.

గుంటూరు జిల్లా అంతా అప్పట్లో చాలా భాగం వర్షాధారభూములే! జొన్నలు, సజ్జలు, వరిగెలు మొక్కజొన్నలు పండుతుంటాయి. పండుతున్నాయి అనడం కన్నా పండిస్తున్నారంటే బావుంటుంది. దిక్కులేని సంసారం... తీరులేని వ్యవసాయం.. కాసింత చినికితే మళ్ళీ పొలం పనులు మొదలెట్టవచ్చు... చినుకే కరువైపోయింది.

మొన్న మొన్నటిదాకా, 1904 వరకూ కృష్ణా మండలంలోనే గుంటూరు జిల్లా కూడా కలిసివుండేది కాబట్టి, కలెక్టర్‌తో పనయినా, కోర్టుతో పని అయినా రేవు దాటి బందరు వచ్చే వారు ప్రజలు. బందరులో బియ్యంతో వండిన అన్నం దొరికేది.

వడ్డమానులో రైతులైనా, కూలీలైనా ఆవూళ్ళో తాము పండించుకొన్నదాన్నే తినేవారు. వాళ్ళకి జొన్నలూ, వరిగెలూ పండుతాయి. వాటినే తింటూబతుకుతుంటారు ఆవూరి ప్రజలు.

బ్రాహ్మలు కూడా చాలామంది జొన్నన్నం లేదా వరిగన్నమే తింటున్నారు. కొంతమంది మాత్రం ఒకపూట వరిగన్నమో జొన్నన్నమో తింటూ రెండో పూట బియ్యంతో వండిన అన్నం తింటున్నారు., కొందరు పామఱ్ఱు నుంచో బందరునుంచో కాసిని బియ్యం కొని తెచ్చుకొనేవాళ్ళు. లేకపోతే బియ్యం కోసం నెల్లూరుదాకా పోవాల్సి వచ్చేది.

మొత్తం మీద రెండుపూటలా వరి అన్నం తినేవాళ్ళు వడ్డమానులో ఆరోజుల్లో ఎవరూ లేరు.

చెరువు పూర్తిగా ఎండిపోయి, చెరువడుగున నెర్రెలిచ్చిన నేల బైటపడ్డాక... అబ్బో ఈ చెరువు ఇంతలోతుందా... అన్పించింది. అంతలోతు చెరువూ ఎండి పోయింది.

చెరువులోపలి నల్లరేగడి మట్టిని అచ్చులుఅచ్చులుగా తవ్వి, గంపలకెత్తుకొని బళ్ళలో వేసి తీసుకుపోయి పొల్లాల్లో పోసుకొంటున్నారు రైతులు.

పల్లాలను పూడ్చుకుంటే, వాననీరు నేలంతా సమంగా ఇంకుతుంది.

చెరువుండగా ఎవరికీ ఏ కష్టమూ తెలీలేదు. అంతచెరువూ ఒక్కసారిఇగా ఎండిపోతే అందరికి ఆశ్చర్యంగానే వుంది. గుండె దడదడలాడుతోంది. తలుచుకొంటే... రేపెలాగడుస్తుందోనని.

గడుగ్గాయిలు రాళ్ళేసినా, పశువులు ఒంటికంటుకున్న బురదతెచ్చి తనలో కడిగినా అమాయకంగా శాంతమూర్తిలా వుండే చెరువు అదృశ్యం అయిపోయేసరికి కన్నీళ్ళ పర్యంతం అయ్యింది వూరు.

వెంగళయ్య గారు పారుగూరునుంచి పొలాల మీదుగా అడ్డదారిన ఇంటికి వస్తున్నారు. చేతిలో తెల్లగొడుగు! ఆయన తెల్లగుఱ్ఱం తుప్పల్ని తొక్కుకుంటూ నెమ్మదిగా నడిచొస్తోంది. దారిలో పొలాల్లో కన్పించే రైతుల్ని పలకరిస్తూ వస్తున్నారాయన.

"ఏం లక్ష్మయ్య... అవతల పక్క పల్లం ఎక్కువగా వుంది చూసుకో-" అన్నాడు ఓ చిన్న రైతుని పలకరించి.

"లచ్చిగా" అనండి - సాలుబాబూ" వినయంగా చేతులుకట్టుకొని అన్నాడు లక్ష్మయ్య. నవ్వారు వెంగళయ్య! "రోజులు మారాయి లక్ష్మయ్యా- ఇంకెప్పుడు అలా నిన్ను లచ్చిగా అని ఎవర్నీ పిలవొద్దనిచెప్పు -" అన్నాడు.

లక్ష్మయ్యతమ్ముడు ఈరిగాడు మట్టిబండి చక్రం మీద కాలేసి ఎక్కినుంచుని ఎలపటి ఎద్దుని అదిలించాడు. అది గిఱ్ఱున పక్కకుతిరిగింది. మట్టిని కుప్పగా పోసిన బండి మట్టికుప్పమీంచి పక్కకు జరిగింది. కాడిని ఎడ్లమీదకు లాగి బండిముందుకు లాక్కుపోయాడు ఈరిగాడు. కాదు - ఈరయ్య.

పల్నాడులో తవరిపేరు అందరికీ ఎరుకే- జాతకాలు సెప్తారు మూర్తాలెడతారు- బాపనోరి దగ్గరికెళ్ళాలంటేనే భయపడేటోళ్ళం - మాకు మీరే పంతులుగోరు. మీరేది సెపితే అదేమాకు ఏదం-" అన్నాడు మళ్ళీ దణ్ణంపెట్టి లక్ష్మయ్య." వానదేవుణ్ణి ఈ ఏడాది నమ్ముకోమంటారా?" అనడిగాడు.సందేహంగా!

"ఏం భయంలేదు. వానలు సమృద్ధిగా కురుస్తాయి-" అభయం ఇస్తున్నదేవతలా అన్నారు వెంగళయ్య.

"సంతోషమే! వానలుకురవడానికి పంచాంగం ప్రకారం ఇంకా వారం రోజులు పడ్తాయి. అందాకా చక్కగా నేలచదునుచేసుకో-" అన్నారు వెంగళయ్య.

సరేనన్నట్లు తలూపాడు లక్ష్మయ్య.

ఈ వారంరోజుల్లో ఊళ్ళో వానకోసం యజ్ఞం చేస్తున్నారు. వానలు కురిపించే ప్రయత్నాలు చాలా జరిగాయి. పెద్దయ్య అయ్యావార్లుంగారు వానకోసం యజ్ఞం చేయిస్తున్నారు. జనం చాలామంది చెరువుగట్టునే నిలబడిచూస్తున్నారు. గుడిపూజారిగారు ఎండిన చెరువు మధ్యలో కళింగం దగ్గర కూర్చుని పూజ చేయిస్తున్నారు.

మున్సబుగారు, కర్ణంగారు, ఊళ్ళో అయ్యావార్లంతా అక్కడే వున్నారు. మిగిలిన జనం గట్టుమీదే నిలబడి చూస్తున్నారు.

పెద్దయ్య అయ్యావార్లుంగారే యజ్ఞం నిర్వహింపచేస్తున్నారు.

'ధామన్తే విశ్వం భువన మధిశ్రిత
మంతః సముద్రే హృద్యంతరాయుషి
అపామనీకే సమిధౌయ ఆభృత
స్తమ శ్యామ మధుమంతంత ఊర్మిమ్"

అంటూ మంత్రాలు చదువుతున్నారు పూజారిగారు.

ఉచ్చైస్స్వరంతో వెలువరిస్తున్న పూజారిగారి మంత్రోచ్చాటన ఆ ప్రాంతాన్నంతా పవిత్రం చేస్తోంది. ఈ యజ్ఞానికయినా వానలు కురిస్తే బావుణ్ణు-

వడ్లమానులో నీటి ఎద్దడి వార్తల్లో కెక్కింది. తాగేందుకు గుక్కెడు నీళ్ళు దొరక్క ప్రజలు అల్లల్లాడిపోతున్నారని వార్తా పత్రికలు బైట ప్రపంచానికి చాటిచెప్పాయి.

గుంటూరు జిల్లా కొల్లూరు నుండి, గాజుల్లంక మీదుగా రేవుదాటి కృష్ణాజిల్లా జనం వలసపోతున్నారని కృష్ణాపత్రికలో రాశారు.

"క్రైస్తవం పుచ్చుకొంటే తిండిపెట్టి మంచినీళ్ళు ఇస్తాం" అని మిషనరీ వాళ్ళు టంకుకొట్టించారు. వడ్లమానులో టంకు విని ఒకరిద్దరు రెడ్లు, కాపులూ మిషనరీల

వైపు వెళ్ళారు గానీ, పంచములు ఎవరూ మతం వదులుకొని క్రైస్తవంలోకి వెళ్ళడానికి ఇష్టపడలేదు." అనికూడా పత్రికలు రాశాయి.

"ఆ విష్ణుమూర్తి మిమ్మల్ని చల్లగా చూస్తాడు" ఖంగారుపడకండి- అంటూ వెంగళయ్యగారు పంచముల్ని ఒకేతాటిమీద నడిపిస్తున్నారు. ఆయన మాటమీదే ఎవ్వరూ క్రైస్తవంలోకివెళ్ళలేరు.

హిందూల్లో అగ్రవర్ణాలవారు ఎంత హీనంగా అంటరానివాడని, ఛండాలుడనీ నీచంగా చూస్తున్నా, హిందువుగానే జీవితాంతం జీవిస్తామని, క్రైస్తవ మతాధిపతులు పెట్టే ప్రలోభాలకు లొంగమనీ చాటి చెప్పారు పంచములు. అదీ వడ్డమాను ప్రత్యేకత. కృష్ణా పత్రికలో ఈ విషయం స్పష్టంగా రాశారు.

మొత్తంమీద వడ్డమాను అనేకరకాలుగా వార్తల్లో కెక్కింది. యజ్ఞాలు చేసినా, బలులిచ్చినా ఎక్కడా వానకురిసే ఆశలేని పరిస్థితి.

కొండమీద శివాలయంలో అమ్మవారికి రోజూ మేకపోతుల్ని బలిస్తూనే వున్నారు. శివుడికి అమరావతి నుంచి తెచ్చిన కృష్ణాజలాలతో అభిషేకం చేస్తూనే వున్నారు.

కొండ క్రింద వేణుగోపాల స్వామి గుడిలో కూడా నిత్యం యాగాలు నిర్వహిస్తూనే వున్నారు. వానలు కురవలేదు.

ఇంతలో మున్సబుగారి ఆజ్ఞమీద టంకు వేయించారు. గుంటూరు డిప్యూటీ కలెక్టర్ జయంతి రామయ్య పంతులుగారు వడ్డమాను సందర్శిస్తున్నారు కాబట్టి, ప్రజలందరూ వచ్చి ఆయనకు మహజర్లు సమర్పించుకోవచ్చనేది టంకు సారాంశం.

వెంగళయ్యగారు వానలు కురుస్తాయని చెప్పింది. సరిగా ఆరోజునే! ఆరోజు వాన రావాలి... అని లక్ష్మయ్య లాంటి చాలామంది ఎదురు చూస్తున్నారు. ఇంతలో జయంతి రామయ్యగారు ఊరిలో పర్యటనకు వచ్చారు. ఆయన గురించి మున్సబుగారు ప్రజలకు పరిచయం చేశారు.

"మనకు డిప్యూటీ కలెక్టరుగా వున్నటువంటి జయంతి రామయ్య పంతులు గారు న్యాయదృష్టి కలిగినటువంటి, సమర్థులైన గొప్ప అధికారి. వీరు గొప్పపండితులు కూడా! పురాతన శిలా శాసనములు చదవడంలో వీరు నేర్పరులు. ప్రాచీన భారత దేశ చరిత్ర గురించి అనేక విషయాలూ క్షుణ్ణంగా తెల్సిన వారు. ఆంధ్ర సాహిత్య లోకంలో వారికి మంచిపేరుంది. అటువంటి గొప్ప అధికారి జయంతి రామయ్య పంతులుగారు మన గ్రామాన్ని సందర్శించడాన్ని నా అదృష్టంగా భావిస్తున్నాను. కరువు రోజుల్లో దొడ్డమనసుతో మనల్ని ఆదుకోవడానికి ఆ ఈశ్వరుడే పంతులుగారి రూపాన ఈ ఊరికి విచ్చేశాడని భావిస్తున్నాను.

మహాజనులారా! మన ఊరికష్ట సుఖాల గురించి ప్రభుత్వం వారికి నేను తెలియజెప్పవలసిందంతా చెప్పాను. మీరుకూడా ప్రజల పక్షాన కుల పెద్దలు గ్రామపెద్దలు విడివిడిగా వచ్చి ప్రభువుల వారికి తమసమస్యలను విన్నవించుకొంటూ మహజర్లు సమర్పించు కోవలసిందిగా కోర్తున్నాను. తమ కోర్కెల పత్రాలమీద ప్రభుత్వం వారు విచారణ జరిపి తగు చర్యలు తీసుకొంటారు... అని వివరించారు మున్సబుగారు.

జయంతి రామయ్యగారికి ముందుగా తయారుచేసుకున్న మెమోరాండం కాపీల్ని ఊళ్ళో వివిధ కులాల తరపున, కులపెద్దలు విడివిడిగా సమర్పించి తమతమ సమస్యల్ని విన్నవించుకున్నారు.

వాటిని అందుకున్నాక జయంతి రామయ్యగారు తన సమాధానం ఇవ్వడం ప్రారంభించారు.

'ప్రజలారా! గౌరవనీయులైన మున్సబుగారూ, కులాల పెద్దలు అందరూ చెప్పిందంతా విన్నాను. వాటి పరిష్కారాలు సత్వరం జరిగేలా చూస్తాను. అన్నింటికన్నా ముఖ్యంగా ఈ ఊళ్ళో ప్రస్తుతం నీటి ఎద్దడిసమస్యని పరిష్కరించాలి! ఊరికి జీవనాధారమైన చెరువు ఎండిపోవడంతో ఊరంతా ఎండిపోయినట్లయిపోయింది.

వానలు కురిస్తే తప్ప నీటిసమస్య తక్షణం తీరేలా లేదు.

ఒంటెద్దు బండి మీద నీళ్ళను మీ ఊరికి రెండు దఫాలుగా పంపించే ఏర్పాటు చేయిస్తాను" అని ప్రకటించారు.

ఊరంతా చప్పట్లు చరిచారు.

వేముల వెంగళయ్యగారు లేచి "మహాశయా! వర్ధమానులో నీటి సమస్య చాలా తాత్కాలికమైంది. అది రేపటితోనే పరిష్కారం అవబోతోంది. అంత కన్నా ముఖ్యసమస్య పంచములకు చదువుకునే అవకాశం లేకపోవడం. ఇక్కడ ఒక స్కూలు ఏర్పాటుచేయించండి" అన్నారు.

జయంతిరామయ్యగారు ఆశ్చర్యంగా "మీ ఊళ్ళో పంచముల కోసం స్కూలు పెట్టించమనికోరారు. సంతోషం. ఆ ఏర్పాటు చేయిస్తాను. కానీ, మంచినీటి సమస్య రేపటినించే ఎలా పరిష్కారంకాబోతుంది?" అనడిగారు.

"అయన చలనాలను గుణించి చూస్తే ఈ రోజునే- కనీసం ఈ రాత్రి నుంచి గానీ రేపు తెల్లవారు ఝామునుంచీ గానీ వానలు కురవాలి. వానలు మంచిగానే ఈ ఏడాది కురుస్తాయి. ఈ ఊరు చెరువు మళ్ళీ నిండుతుంది.-" అన్నారు.

జయంతి రామయ్యగారు మున్సబుగారి వంక చూశారు. మున్సబుగారు కరణం గారి వంక చూశారు. కరణంగారు అయ్యవార్లుం గారివంక చూశారు. అందరూ ఒకరిమొఖం ఒకరు చూసుకున్నారు.

"నా గుణకారం ప్రకారం మేఘ గమనం మందంగా వుంది. వాయుబలం అధికంగా వుండటం చేత మేఘాలు చెల్లాచెదురౌతాయి. అందుకని వానలు స్వల్పంగానే వుంటాయి. అవికూడా ఇప్పట్లో వచ్చే సూచనలు లేవు-" జ్యోతిష్యం బాగా తెల్సిన అయ్యవార్లుంగారు కూడా లేచి తన అభిప్రాయాన్ని ప్రకటించారు.

వివాదం ఇలా నడుస్తూండగానే ఆకాశం మేఘావృతమైంది. అందరికి ఆశ్చర్యంవేసింది.

పెద్దయ్య అయ్యవార్లు జయంతి రామయ్యగారికి నమస్కరించి అన్నారు. ఇది శాస్త్ర చర్చలు జరిపే సమయంకాదు. అయితే ఈ వేముల వెంగళయ్య మాత్రం తక్కువ సిద్ధాంతి అని నేను భావించడంలేదు. మాలదాసరి అయినప్పటికి ఈ కరువురోజుల్లో క్రైస్తవమతం పెట్టిన ప్రలోభాలకు లొంగకుండా పంచములందరినీ ఒకే మాట మీద నడిపి హిందూ మతంలోనే నిలిపాడు. ఆ సంగతి ఈ ఊళ్ళో చాలామందికి తెలుసు కూడా! ఆయన విష్ణుచిత్తుడి వంటివాడు. వైష్ణవ భక్తి తప్ప ఆయనకు మరో ధ్యాసలేదు. బ్రాహ్మణులు హిందూమతానికి చెయ్యలేనిది ఈ దాసరి చేశాడు. అతని మాటంటే పంచములందరికి అంత గురి" అని ప్రశంసించాడు.

పెద్దయ్య అయ్యవార్లు మాట్లాడుతుండగానే దబదబారెండు చినుకులు కురిశాయి. సాయంకాలం ఎండ ఒక్కసారిగా అదృశ్యమై వెల్తురు తగ్గడం మొదలుపెట్టింది. చల్లగాలి శకలాలు ఒకటిరెండు రివ్వున వీచాయి.

"కలెక్టర్‌గారూ! మా ఊళ్ళో మాలదాసరి గొప్పదనం చెప్పడానికి ఇంతకంటే తార్కాణం ఏం కావాలి..." అన్నాడు ఓ కులపెద్ద.

వాన నెమ్మదిగా పెద్దది కావడం మొదలుపెట్టింది. సభ తీరిన జనం అలానే తడుస్తూనే కూర్చున్నారు. ఒళ్ళు తడిసి ఎన్నాళ్ళయిందో...! వాన దేవుడికి అస్పృశ్యతలేదుకదా!

జయంతి రామయ్యగారు లేచి, తన మెడలో వేసిన పూలదండని తీసి వెంగళయ్యగారి మెడలో వేసి సత్కరించారు.

ఊరు ఊరంతా పులకరించి పోయింది!! వెంగళయ్యగారు ప్రశంసల జడివానలో తడిసిపోయారు. "ఇది వానకాదయ్య వెంగళయ్య! నీ ప్రతిభకు పాదాభిషేకమయ్యా' అన్నారు పెద్దయ్య అయ్యవారు.

చెరువు నిండిపోయి. తామరలు కలువలు కలిసిపోయి పగలూ రాత్రి తేడాలేకుండా ఎర్రెర్రగా. తెల్లతెల్లగా నవ్వుతోన్నట్లు ఆయన ముఖారవిందం వెలిగిపోయింది.



వడ్డమానులో వైద్యుడు వెంకటయ్య ఇల్లు జనంతో కిటకిట లాడ్తోంది.

అందరూ పట్టు బట్టల బ్రాహ్మలే! ఒకరిద్దరు బ్రాహ్మణ ముత్తయిదువలు కూడా వచ్చారు. దుఃఖభాజనులై వున్నారంతా!

ఊరి పురోహితులుగారి పెదతండ్రి పెద్దయ్యవంతులుగారి మనవణ్ణి పాముకరిచింది. వైద్యంకోసం తీసుకొచ్చారు.

వెంకటయ్య వైద్యంచేసే హడావిడిలో వున్నాడు.

పాముకరిచిన గాటుమీద నోరుపెట్టి రక్తం పీల్చి మూడుసార్లు ఉమ్మేసాడు. గాయాన్ని నీళ్ళుపోసి కడిగాడు. లోపలికి పరిగెత్తికెళ్ళి ఏహో ఆకులు కలిసి నోట్లో వేసుకొని నమిలాడు. బాగా నమిలి, బైటకి తీసి గాయంమీద పెట్టబోయాడు. ఒక్కక్షణం ఆగాడు.

"ఆగావేంటి వెంకటయ్యా! త్వరగా కానీ..." రోగినివెంటపెట్టుకొని తీసుకొచ్చిన వేముల వెంగళయ్యగారు వెంకటయ్యని గట్టిగా అదిలించారు.

"బాబూ! బాపనోరి బిడ్డ... నా నోట్లో మూలికల ఎంగిలి తమ్మ తీసి గాయం మీద పెట్టి కట్టుకట్టాలి.. బాపనోనికి ఎంగిలంటించిన పాపానికి నాకు పురుగులు పడాల... బాబుకు మేలు జరగాల..." అన్నాడు వైద్యుడు వెంకటయ్య. వెంకటయ్యసందేహం అర్థం అయి, తాతగారు పెద్దయ్య అయ్యవార్లుం గారు వెంకటయ్య భుజంమీద చేతులు వేశారు.

అంతపెద్ద అయ్యవార్లుంగారు తనను అంటుకొన్నారని అనిపించేసరికి వెంకటయ్య నరాలు పులకించిపోయాయి. జన్మధన్యం అయ్యిందని అనుకొన్నాడు. ఎందుకంటే ఆత్మీయతనిండిన ఆ స్పర్శ... అంతకుమునుపు ఎన్నడూ ఆయన ఎరగనిది. బహుశా ఈ స్పర్శ గతంలో అయ్యవార్లుంగారు కూడా ఎరిగివుండకపోవచ్చు.

"ఏం ఫర్వాలేదు... నేను చెప్తున్నాను- నీ వైద్యం మీద నమ్మకంతో నువుచేసేది చెయ్యి... భగవంతుడిదే భారం... నామనవడు బ్రతకాలి..." అన్నారాయన.

క్షణం ఆలస్యం చెయ్యకుండా ఎంగిలితమ్మని పాముకరిచిన గాయంమీద పెట్టి కట్టుకట్టాడు వెంకటయ్య.

కాసేపటికి పంతులుగారి మనవడు సేదతీరాడు -హమ్మయ్య అని ఊపిరి పీల్చుకున్నారంతా!!

వడ్డమానులో వెంకటయ్యని తెలియని వాళ్ళులేరు.

ఆయన క్షురకుడు.

కానీ, క్షురక వృత్తిని చేయడంలేదు. ఏదో... కుంటభూమివుంటే వ్యవసాయం చేసుకొంటున్నాడు. అదిచాలనప్పుడు నలుగురితో కలిసి వ్యవసాయ కూలీగా వెళ్తుంటాడు.

వెంకటయ్య వడ్డమానులోనే కాదు చుట్టుపక్కల వూళ్ళలోకూడా ప్రసిద్ధుడే! ఆయనకు నాటువైద్యమూ తెలుసు. పశువైద్యం కూడా తెలుసు. అదే ఆయన ప్రశస్తికి కారణం.

ఇంతమంది బాపలు వెంకటయ్య ఇంటికి తరలివస్తే - "కూర్చోపెట్టడానికి మా ఇంట కురిసీలు లేవు బాపయ్యా-" అన్నాడు వెంకటయ్య.

పెద్దపంతులు గారిని మాత్రం ఓ చిన్న పీట వేసి దానిమీద కూర్చోబెట్టాడు.

నవ్వుతూఅన్నారు పంతులుగారు- "వెంకటయ్య! నువ్వు మంగలివైనా నీకు చేతులెత్తి నమస్కరిస్తున్నాను. ఇవ్వాళ నామనవడిని బతికించావు కదయ్యా- నీకు ఎంతకావాలో చెప్పు-"

"అయ్యవార్లుంగారూ! మీ బోంట్లకు ఎదుట నిలబడిమాటాడే దయిర్నం లేనోణ్ణి. తవరిలాగా పండితుణ్ణికాను. సదూకోలేదు. మాతాత సచ్చిపోతా సెప్పిన నాలుగు ఆకుల్ని గుర్తెట్టుకొని పదిమందికి మేలుసేత్తావుండాను. ఆడు మాలోడా - మాదిగోడా అని సూడను ఎవురికాడా పైసా తీసుకోకూడదని మాతాత ఆన పెట్టిండు. అట్టాగే సేత్తావుండాను. అయినా నాది జానెడు పొట్ట. పిల్లాజెల్లా లేనోణ్ణి నాకు డబ్బేటికండీ...' అన్నాడు.

అతని దొడ్డమనసుకు, గొప్ప హృదయానికి ఆశ్చర్యపోయారు పంతులుగారు.

లోకంలో డబ్బు తీసుకోకుండా జనంకోసం బతికేవాళ్ళు వున్నారన్నమాట.....!!

ఆశ్చర్యపోయారాయన. మనిషి మానవుడిగా ఎదగటం అంటే ఇదేననుకున్నారు. చదువు కాదు... సంస్కారం కావాలి. చిన్నకులంలో పుడితేనేం... తనకన్నా గొప్పసంస్కారవంతుడిగా కన్పించాడా క్షణంలో వెంకటయ్య!

"బ్రహ్మసమాజం, దివ్యజ్ఞాన సమాజం వాళ్ళు చెప్పేదికూడా ఇదే! వాళ్ళంతా గొప్ప పండితులు. కానీ, ఏ చదువూ సంధ్యాలేని. వెంకటయ్య అంతకన్నా ఎక్కువగా ఆచరించి చూపెడ్తున్నాడు-" అనుకున్నారు, అయ్యవార్లుంగారు.

ఏమో! నిజంగానే మనుషులంతా సమానం అనే రోజువస్తుందేమో... వస్తే మంచిదే... ఆహ్వానించాలి మనం... అని నిశ్చయించుకున్నారాయన.

పాముకరిచిందని తెలియంగానే తన మనవణ్ణి ఈ వెంకటయ్య దాకా తీసుకొచ్చిన వేముల వెంగళయ్యగారిని దగ్గరకు పిలిచి "నాయనా! మీరంతా ఈ రోజు నా మనవణ్ణి బ్రతికించారు. మీ మేలు ఈజన్మలో మరిచిపోను- అన్నారు.

కృతజ్ఞతగా చూస్తూ వెంగళయ్యగారు అన్నారు. "వైద్యుడు వెంకటయ్యకి పూర్వజన్మ సుకృతం వుంది కాబట్టి ఈ జన్మలో ఇలా పుణ్యాత్ముడిగా బతుకున్నాడు. ఆయనకే ఈ వైద్యం తెలియకపోతే. అందరిలాగానే 'ఎంకిగాడు' అనిపించుకునేవాడే కాదండీ ..." అనీ.

పెద్ద పంతులుగారు నిజమేనన్నట్టు తలూపారు.

"నువు చెప్పింది వాస్తవమే వెంగళయ్య! కేవలం వెంకటయ్య వైద్యం కోసమే ఇక్కడకు మేమంతా రావాల్సివచ్చింది. అంతవరకూ నిజం. కానీ, ఒక్కవిషయం ఆలోచించు. రాజిగాణ్ణో, రామిగాణ్ణో అలాపిలుస్తుంటే ఆ పిలుపులో దోషం వుందని పిలిచేవాళ్ళకే గాదు, పిలిపించుకునే వాళ్ళక్కూడా తెలీదు. అలావాటైపోయిన పిలుపది. ఒకవేళ రామయ్యా అన్నా 'ఎవర్నో' అనుకొంటాడు. తననే అని తెలిస్తే ఉలిక్కిపడతాడుకూడా... అవునంటావా" అనడిగారు.

వెంగళయ్యగారు సమాధానం చెప్పలేదు.

పెద్దపంతులుగారు అన్నారు-

"ఎంకిగాణ్ణి 'వెంకటయ్య' అని పిలవడానికి అతనికి వైద్యం తెలియడం ఒక్కటే కారణం కాదు వెంగళయ్యా! అతనిదగ్గర దొడ్డ హృదయం వుంది. అది అయ్యవార్లక్కూడా లేనిది. అందుకని!!" అని మెచ్చుకోలుగాచూశారు.

పెద్దపంతులుగారి ప్రశంసకి వెంకటయ్య కళ్ళవెంబడి నీళ్ళు తిరిగాయి. ఆనందంతో పులకించిపోయాడాయన.

"రామిగాణ్ణి రామయ్యని చేయాల్సింది నీవంటి డొక్క శుద్ధివున్నవాళ్ళే వెంగళయ్యా! ప్రహ్లాదుణ్ణి విష్ణుమూర్తి కాచినట్లు " నీవాళ్ళనీ ఆ శ్రీ మహావిష్ణువే ఓమహాత్ముడి అవతారం ఎత్తి కాపాడుతాడు అని అందర్నీ ఆశీర్వదించి బైటకు నడిచారాయన.

రోడ్డుమీద దాకా పంతులుగార్ని సాగనంపి వచ్చారు వెంగళయ్య. వైద్యుడు వెంకటయ్య మట్టి బానలో నీళ్ళని ముంతతో తీసుకొని ముఖంకాళ్ళూచేతులూ కడుక్కున్నాడు.

దూరంగా మాలపల్లె చెరువు వెండిపళ్ళెంలా తళతళలాడుతోంది. ఆకాశంలో మేఘాలు ఆ వెండిపళ్ళెంలో ప్రతిబింబించి, కమ్మగా వండిన వరి అన్నంలా అవుపిస్తున్నాయి. చెట్లకొమ్మల మధ్యనుంచి తొంగి చూస్తున్న సూర్యుడు ఎర్రని ఊరగాయలా నోరూరిస్తున్నాడు.

"ఈపొద్దు చద్ది మీఇంట్లోనే తింటా వెంకటయ్యా-" అన్నారు వెంగళయ్యగారు చనువుగా!

"మా ఇంట్లోనా...?" ఆశ్చర్యంగా అడిగారు వెంకటయ్య!"

"అవును! మీ ఇంట్లోనే తింటా... ఇప్పుడేగా పెద్దయ్యవారు చెప్పారు-" అన్నారు వెంగళయ్య. సంస్కరణల్ని, ప్రారంభించిందీ బ్రాహ్మలే! వాటిని అందిపుచ్చుకొన్నదీ బ్రాహ్మలే! వాటికి వ్యతిరేకంగా నిలబడిందీ బ్రహ్మలే! ఏ మార్పయినా బ్రాహ్మలు ముందుగా మారితేనే లోకం అంతా మారుతుంది. "- అన్నారాయన కొంచెం నిర్వేదంగా!

కానీ, "ఆయన మిమ్మల్ని ఇలా మాబోటి తక్కువ కులంవాళ్ళ ఇళ్ళలో భోజనం చెయ్యమని చెప్పలేదే...?" రెట్టించే అడిగాడు వెంకటయ్య!

"ఆయన చెప్పిన దాంట్లో సారం అదే... పెద్దకులంవాళ్ళు మనల్నందర్నీ అంటరానివాళ్ళుగా చూస్తున్నారు. చిన్నకులం వాళ్ళం మాత్రం ఏంచేస్తున్నాం...?? మనలో మనం ఇంకొకళ్ళని అంటరాని వాళ్ళుగా చూస్తున్నాం. ఇదిపోవాలనే అయ్యవారు చెప్పారు. నాకూ నిజమేననిపించింది. అందుకే ఈ రోజునించి ఒక నిర్ణయానికి వచ్చాను. నేను దాసరి నయినా మాలలు, మాదిగలు, మంగళ్ళు, ఎరుకలు, యానాదులు అందరినీ సమానంగా చూస్తాను.- అందరి ఇళ్ళలోనూ భోజనం చేస్తాను. స్వయంపాకాలు తెచ్చుకోవటం మానేస్తాను.-" ప్రతిజ్ఞ చేస్తూ అన్నారు వెంగళయ్యగారు.

చెరువు మీద ఏటవాలుగా పడ్తున్న సూర్యకిరణాల వంక మరోసారి చూశాడు వైద్యుడు వెంకటయ్య. అవి చెరువు ఒడ్డున కొలువైవున్న గంగానమ్మతల్లి పాదాలను భక్తితో కొలుస్తున్నట్లనిపించాయి.

పారాడుతున్న పాపాయి లేచినిలబడి నడవటం నేర్చుకొంటూ సంతోషంతో కొట్టిన కేరింతల్లా ప్రకృతి పులకరిస్తున్నట్లనిపించింది



వెంగళయ్యగారికి సుస్తీచేసిందన్న వార్త వడ్డమానులోనేకాదు, చుట్టుపక్కల ఊళ్ళలో కూడ పాకిపోయింది.

నిన్నటినించీ మూసిన కన్ను తెరవలేదంటున్నారు.

మాయదారిజబ్బు - చెట్టంత మనిషిని నిట్టనిలువునా కూల్చింది- అనుకోసాగారు జనం.

"ఆయనకు ఊరేదేవాలయం- అంటరానివాళ్ళంతా ఆయనకు దేవుళ్ళే! ఎన్నిరకాలుగా ఆదుకునేవాడో- ఎంత సాయపడే వాడో... మహానుభావుడు..."

"పెద్ద మానవుడండీ ఆయన ! ముగ్గురు మగపిల్లలంట... ఓ ఆడపిల్లకూడా వుందంట..., ఇదిగాక మొదటి మనువుకో కొడుకున్నాడంట... ఆ పిల్లణ్ణి మేనమామలు తీసుకుపోయి సదివిస్తాంద్రంట..." ఆయన వివరాలు తెలిసిన ఓ ఇల్లాలు పదిమందికీ చెప్తోంది.

"పెద్దకొడుకు కూర్మయ్యకి నిండా పన్నెండేళ్ళయినా రాలేదు. రెండో తరగతి చదువుతున్నాడంట. ఇంకా అబుడతడే. కూలీనాలీ చేసి తల్లినీ మిగిలిన పిల్లల్ని ఈదుకు రావాలి మరి..." జాలిగా అంది మరో ఇల్లాలు.

"ఏటే... ఇట్లా మాట్లాడుతున్నావు. పెద్దప్రాణానికే ముప్పు వచ్చిందంటావా...?" ఖంగారుగా అడిగిందింకొకావిడ!

"వైద్యుడు నాభంనేదనేసినాడంట-" జవాబుచెప్పిందామె!

కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యారంతా!
దేముడా! రక్షించు!
అల్లా దయచూడు
వేణుగోపాలస్వామీ కరుణించు
పోలేరమ్మ తల్లీ... పోతులిచ్చుకొంటాం...
శంకరా! భవభయవశంకరా! కావవే వరదా!"

ఎవరికి తోచిన ప్రార్థన వారు చేయసాగారు. అందరూ వెంగళయ్యగారిని దక్కించుకోలేక పోతున్నామనే కుమిలిపోతున్నారు.

"ప్రొద్దున్నే పెద్దయ్య అయ్యవార్లు కూడా వచ్చి చూసె వెళ్ళారంట. పూజారిగార్ని వెంటెట్టుకొని తీసుకొచ్చారంట. పూజారిగారు మాలపల్లె వైపు రావడం ఏవిటా అని నాకు మతిపోయి వెళ్ళి సూద్దునుగదా... మంచంలో కుప్పకూలి పడిపోయున్నాడమ్మా మహానుబావులు. పూజారి నాభంనేదని సెప్పారటమ్మ తల్లీ..."

సీత కష్టాలు సీతవి - పీతకష్టాలు పీతవీ అనీ... కూటికి లేకపోయినా ఒకర్ని అడిగిన పాపాన పోలేదు ఆ మనిషి... బతికితే అలా బతకాలి...! మతగురువు కాబట్టి మనలాగా కూలీ పనికిరాలేదు. అలాగని పెద్ద కులపోళ్ళు ఆయన్ని కలుపుకొని అదరించరు. అందుకే ఆయన అలా దిగులుతో మంచం పట్టాడు."

"గుంటూరులో కుగ్లరు ఆస్పత్రి పెట్టారంట గదా అమెరికా వాళ్ళ ఆస్పత్రి. మంచి పేరున్న డాక్టరంట - ఆడకు తీసుకుపోదామా...?"

"ఆలోచన భాగానే వుంది - వెంగళయ్యభార్య అచ్చమ్మగారిని అడిగిచూద్దాం - ఆవిడ ఏవంటుందో... " అంటున్నాడు ఇంకొకాయన.

ఇంతలో ఇంట్లోంచి పెద్దపెట్టున శోకాలు విన్పించాయి. జరగరానిదేదో జరిగిందని ఖంగారుగా అంతా లోపలికి పరిగెత్తారు. అయిపోయింది అప్పటికే అంతా అయిపోయిది.

జనం అంతా లోపలే తారట్లాడుతున్నారు ఇంట్లో చోటులేక - చిన్న కుర్రవాడు కూర్మయ్య తన తమ్ముళ్ళని, చిన్ని చెల్లెల్ని తీసుకొని బైట కిటికీలోంచి లోపలికి చూస్తూ నిలబడ్డాడు. లోపల ఏం జరిగిందో అతనికి అర్థం కాలేదు. అర్థం చేసుకోగలిగేంత వయసు అతనికి లేదు - బైటనించి ఎవరో అంటున్నారు... ఈ కుర్రాణ్ణి నేనే స్కూలుకు తీసుకు పోయి జేర్పించాను. పంతులుగారు మొదట్లో మొరాయించాడు కాని, చివరికి ఒప్పుకొన్నాడు. ఇంకా ఈ కుర్రవాడు చదవడం, పైకిరావడం... ఇదంతా ఎంత వరకూ అవుతుందో..." అనీ!

ఆ మాటలు వింటున్న ఆ చిన్నారి కూర్మయ్యకు దుఃఖం ముంచుకొచ్చింది. ఎలా ఏడవాలో అతనికి తెలీలేదు.



# 2

"నమస్తే z స్తు మహాదేవ
భూతన భవ్య భవాశ్రయ
నమస్తే స్తుతి నిత్యాయ
నమస్త్రైలోక్య పాలినే..."

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు శివధ్యాన్నం పూర్తి చేసుకొని యలకుర్రులోని ఆయన స్వంత ఇంటిలో ముందుగదిలోకి వచ్చి కూర్చున్నారు.

ఆయన గదిలోకి వచ్చే వరకూ గదిబయటే ఎదురు చూస్తూనిల్చున్నాడో చిన్న కుర్రాడు.

యలకుర్రు గ్రామం కృష్ణాజిల్లా నిడుమోలు దగ్గరుంది. నిడుమోలు నుంచి రెండుమైళ్ళ డొంక దారిన వెడితే యలకుర్రు వస్తుంది. మద్రాసు బొంబాయి నగరాల్లో అమృతాంజనం వ్యాపారం చేస్తూనే ఆంధ్రరాష్ట్రంలో నిమ్నవర్ణాల అభ్యున్నతికోసం నాగేశ్వరరావు పంతులుగారు కృషి చేస్తున్నారు. స్త్రీపునర్వివాహం, రజస్వలా పూర్వ వివాహాల నిషేధం, అంటరానితనం నిషేధం వంటి కార్యక్రమాల కోసం ఆయన తన సంపాదనంతా ఖర్చు చేస్తున్నారని ఆయన గురించి అంతా చెప్పుకొంటున్నారు.

ఒకప్పుడు,కృష్ణాతీరంలో శైవమతాన్ని విస్తరింపచేసిన' శ్రీపతి పండితారాధ్యుల కాశీనాథ స్వామి ఆ వంశంలో గొప్ప ప్రసిద్ధులు. మహిమలు కల్గిన శివభక్తుడిగా దైవాంశ సంభూతుడిగా కాశీనాథస్వామి ప్రజల పూజలందుకున్నారు.

అంతటి కాశీనాథ స్వామి వారి పేర్న వీరివంశం కాశీనాథుని వంశంగానే వ్యవహరించ బడుతోంది అప్పటినించి!

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారిది నిండైన విగ్రహం. మెడలో వేలాడుతున్న శివలింగంతో విభూధి రేఖలతో నడిచొచ్చిన పరమ. శివుడిలా ప్రకాశిస్తున్నారాయన.

"అయ్యవార్లంగారూ" పిలిచాడు బయటనిల్చున్న కుర్రవాడు.

బయటకు వచ్చి చూశారు కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు.

సాక్షాత్తూ ఆ పరమశివుడే ఎదురుగా ప్రత్యక్షమైనట్లు... ఆయన పాదాలమీద మోకరిల్లాడా కుర్రవాడు.

నాగేశ్వర రావుపంతులుగారు ఆ కుర్రవాణ్ణి ఆత్మీయంగా పైకిలేపి "ఏం కావాలి నాయనా?" అని అడిగారు.

ఆయన స్పర్శతో పులికించిపోయిన ఆకుర్రవాడి నోటమాట రాలేదు. ఆయనవైపు అలా చూస్తూ నిల్చుండిపోయాడు-

1761లో కాశీవాథ స్వామికి 435 ఎకరాల యలకుర్రు అగ్రహారాన్ని కానుకగా జమీందారు వెంకట్రాది అప్పారావుగారు ఇచ్చారని చరిత్ర.

కృష్ణాజిల్లా యలకుర్రు, ఈడుపుగల్లు, గుంటూరుజిల్లా పెదపులివర్రు ఈ మూడు గ్రామాల్లోనూ కాశీనాథుని వంశస్థులకు చెందిన అగ్రహారాలున్నాయి.

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు యలకుర్రు అగ్రహారీశులు.

యలకుర్రులోకి అడుగుపెట్టంగానే ముందే నాగేశ్వరరావు పంతులుగారి ఇల్లువస్తుంది.

బొంబాయినగరంలో వుంటున్న నాగేశ్వరరావుగారు పనిమీద యలకుర్రు వచ్చినప్పుడు ఇంటిదగ్గరే ఆయన్ని దర్శించుకొని పాదాలమీద పడ్డాడా కుర్రాడు. నాగేశ్వరరావు పంతులుగారు అతన్ని ఆదరించారు. సరిగ్గా సమయానికి నాగేశ్వరరావుగారు యలకుర్రు రావడం అతని అదృష్టం.

"చదువుకొంటాను చధువుచెప్పించండి అయ్యవారూ...." ప్రాధేయపడ్డాడా కుర్రవాడు.

"నీపేరు?"

"కూర్మయ్య"

"మీనాన్న?"

"లేడు. చనిపోయాడు. నేనూ, మా అమ్మా మల్లవరంలో పొలం కూలికి పోతున్నాం. నాకేమో చదువుకోవాలనుంది - "మా తమ్ముళ్ళిద్దరూ, మా చెల్లెలు కూడావుంది. నేను చదువుకొని, వాళ్ళనికూడా చదివిస్తాను-" ఎంతో బాధ్యతాయుతంగా వున్నాయి చిన్నారి కూర్మయ్యమాటలు.

"ఏ క్లాసులో చేరాలి...?"

"నాలుగో క్లాసులో చేరాలి". అంటూ జేబులోంచి ఒక ఉత్తరం తీసి ఇచ్చాడు కూర్మయ్య.

ఉత్తరం తీసి చదూకున్నారు నాగేశ్వరరావుగారు అది నిమ్నవర్ణాల నాయకుడు సుంద్రు వెంకయ్యగారు నాగేశ్వరరావు పంతులుగారి పేర్న రాసిన ఉత్తరం.

"మహాశయా! మీరు ఎంతో వదాన్యతతో యలకుర్రు గ్రామంలో శ్యామలాధర్మ ప్రాథమిక పాఠశాలని నెలకొల్పారు. అది ఈ పరిసరప్రాంత ప్రజలందరికి విద్యాదానం చేస్తూ ఎంతో మేలుచేస్తోంది.

తమ తల్లిగారైన శ్రీమతి శ్యామలాదేవిగారి పేరుతో తమరు నెలకొల్పిన ఈ పాఠశాల అన్ని వర్ణాల వారికీ సమానంగా విద్యాదానం చేయాలని తమరు అనేకసార్లు ప్రతిపాదించారు కూడా!

అయితే, మన పాఠశాలలో నిమ్నవర్ణాల వారినిచేర్చుకోవటానికి ప్రధానోపాధ్యాయులు అంగీకరించటం లేదు-

ఈ ఉత్తరం తెచ్చి ఇచ్చిన కుర్రవాడు దాసరుల అబ్బాయి. చురుకైన వాడు. మీవంటి పెద్దలు ఆశీర్వదించినచో జీవితమున ఎంతో ఉన్నతిని పొందగలడని నా భావన.

అందువలన తమరు పెద్ద మనసుతో దీవించి ఈ కుర్రవాణ్ణి తమ పాఠశాలలో చేర్పించేందుకు అనుమతించవలసిందిగా ప్రార్థన.

ఇట్లు
తమ విశ్వాసపాత్రుడు
సుంద్రు వెంకయ్య

ఉత్తరం పూర్తిగా చదువుకొని, ,చాలాబాధపడ్డారు నాగేశ్వరరావు పంతులుగారు.

వెంటనే మనిషితో కబురంపి స్కూలు ప్రధానోపాధ్యాయులు పోతుకూచి యజ్ఞనారాయణగారిని రమ్మని చెప్పమన్నారు.

అది 1916 ఏప్రిల్ ఒకటవ తేదీ. యలకుర్రు గ్రామంలో ఒకవిధంగా సంచలనం కల్గించిన రోజు అనే చెప్పాలి.

"పంతులు గారూ! ఈ రోజునుంచీ మన ధర్మపాఠశాలలో పంచములను కూడా తప్పకుండా చేర్చుకోవాలని నేను నిర్ణయించాను. పంచముల క్కూడా. సమానంగా చదువుచెప్పటానికి మీకేమైనా అభ్యంతరమా...?" అనడిగారు కొంచెం గట్టిగానే..

ప్రధానోపాధ్యాయులు యజ్ఞనారాయణగారు వినయంగా లేచి నుంచుని "పంచములకు విద్యాదానం చెయ్యటంకన్నా పుణ్యాకార్యం లేదని నేనూ భావిస్తున్నాను.

కానీ, వారు స్వేచ్ఛగా అగ్రహారం వీధుల్లోంచి నడిచి వచ్చే అవకాశం కల్పించండి. అగ్రహారికులు నిమ్నవర్ణాలవారిని చేర్చుకోవటానికి అభ్యంతరాలు చెప్పకుండా పరిస్థితులు చక్కబెట్టండి-" అన్నాడు.

నాగేశ్వరరావు పంతులుగారికి చాలారోషం వచ్చింది ఆ మాటతో! ఆ కోపం మీదే "ఇదిగో కూర్మయ్యా! ఇలారా..." అని బైటనిల్చుని వున్న చిన్నారి కూర్మయ్యని లోపలికి పిలిచారు.

"ఈ కుర్రవాడు మాల దాసర్ల అబ్బాయిట. ఇతణ్ణి నాలుగో తరగతిలో చేర్చుకోండి. ఇదుగో ... ఇతన్ని నేను అంటుకున్నాను... ఇలా మా ఇంట్లోకి రానిచ్చాను... ఈ సంగతి అందరికీ చెప్పండి." అన్నారు.

అలాగేనని నిష్క్రమించబోయారు హెడ్ మాష్టారు.

"చూడండి మాష్టారూ... మా వంశంలో గోకర్ణుడు అనే ప్రసిద్ధుడు ఒకాయన మా పూర్వీకుల్లో వుండేవాడు. ఆయన ఒక పంచముడికి జ్ఞానదానం చేసి కైలాస గతుడైనట్లు మా వంశ చరిత్ర చెప్తోంది. నాకు మా వంశస్థుడైన ఆ గోకర్ణుడు ఆదర్శం. నేను కూడా అయన దారిలోనే పంచముల్ని ఆదరించాలని నిర్ణయించుకున్నాను. ఆదరిస్తాను. అందుకని, మన ధర్మపాఠశాలలో నిమ్నవర్ణాల వారు ఎవరొచ్చి చేరినా అభ్యంతరం పెట్టకండి- ప్రోత్సహించండి" ఆదేశిస్తూ అన్నారు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

అంతే! ఆరుమైళ్ళ దూరానవున్న మల్లవరం నుంచి కూర్మయ్యగారితో పాటు ఇంకా కొందరు పంచముల పిల్లలుకూడా వచ్చి యలకుర్రు శ్యామలాదేవి ప్రాధమికోన్నత పాఠశాలలో క్షణాలలోచేరారు.

మధ్యాన్నానికి ఈ వార్త యలకుర్రు అగ్రహారంఅంతా గుప్పుమంది. చుట్టుపక్కల ఊళ్ళలో అగ్రవర్ణాలవారు ఆగ్రహంతో ఊగిపోయారు.

"శ్యామలా ధర్మ ప్రాథమికోన్నత పాఠశాలలో ఇంత అధర్మమా"

భోజనాలకు ఇళ్ళకు వచ్చిన పిల్లలు ఎవరూ తిరిగి సాయంత్రం స్కూలుకు వెళ్ళలేదు. అగ్రవర్ణాలవారంతా తమ పిల్లల్ని స్కూల్లో చదివించకుండా, మాన్పించేస్తామని నిర్భయంగా వచ్చి ప్రధానోపాధ్యాయులకు చెప్పి వెళ్ళారు.

అందరూ మానేయగా స్కూల్లో ఇంక నిమ్నవర్ణాలవారి పిల్లలు మాత్రమే ఐదారుగురు మిగిలారు.

విశాలమైన ఆవరణలో పెద్ద పాఠశాలని కట్టించారు నాగేశ్వరరావు పంతులుగారు.1911లో ప్రారంభమైన ఆ పాఠశాల, ఈ ఐదేళ్ళలోనూ మంచి ఫలితాలు సాధించింది. యజ్ఞనారాయణగారు శ్రమపడి చేసిన కృషివల్లే స్కూలు పిల్లలు మంచి మార్కులు తెచ్చుకొంటున్నారని ప్రతిఒక్కరూ అనుకొంటున్నారు.

అలా ప్రశాంతంగా సాగుతున్న ఈ పాఠశాలలో ఈ పంచముల విషయం విషాదకర పరిణామంగానే భావించారంతా!

"పిల్లలు ఎవరు రాకపోయినా, స్కూల్లో మాష్టార్లు ఎవరూ రాకపోయినా, ఒక్క పంచముడు వచ్చినా బడిని నడపండి - ఆపకండి-" మళ్ళీ అదేశించారు నాగేశ్వరరావు పంతులుగారు.

ఊరిపెద్దల్ని పిలిపించి ఒక్కొక్కరితో విడివిడిగా చర్చలు జరిపారు. సమస్య పరిష్కారంకానిదే బొంబాయి వెళ్ళకూడదని నిర్ణయించుకున్నారు. మూడు రోజులు సమ్మెగట్టిన అగ్రవర్ణాల వారు నాగేశ్వరపంతులుగారి ఆదేశాల మీదే ఇదంతా జరుగుతోందనీ, సంఘసంస్కరణలో ఇది ఒక భాగంగా ఆయన భావిస్తున్నారని క్రమంగా అర్థంచేసుకోవడం మొదలుపెట్టారు. నాలుగోరోజునుంచీ ఒక్కొక్కరే పిల్లలు బడికి రావడం మొదలు పెట్టారు.

ముఖ్యంగా ప్రథానోపాధ్యాయులు పోతుకూచి యజ్ఞనారాయణ గారి ముఖం కళకళలాడింది.

ఇంత అలజడికి కారకుడైన విద్యార్థి వేములకూర్మయ్య మీదే మాష్టార్లందరి దృష్టినిలబడిపోయింది! అంధుకు తగ్గట్టే గొప్పగా అతని చదువూ, ప్రవర్తనా కూడా వున్నాయి! అన్నిరంగాల్లోనూ రాణిస్తున్న విద్యార్థి కూర్మయ్యపట్ల మాష్టార్లక్కూడా అవ్యాజానురాగం ఏర్పడసాగింది. అందరు అగ్రవర్ణాల విద్యార్థుల మధ్యా తలలో నాలుకలా చాకచక్యంగానడుచుకోసాగాడు విద్యార్థి కూర్మయ్య.



బెజవాడ వన్‌టౌన్ వీధులు కళకళలాడుతున్నాయి.

1917 వ సంవత్సరం - గాంధీగారు... భారతదేశంలోకి అడుగుపెట్టి అప్పటికి రెండేళ్ళయ్యింది!

పంచముల్ని హరిజనులని పిలవటం ఇంకా మొదలు కాలేదు. "అస్పృశ్యులు" అనేదే ఆనాటికి వాడుకలో వున్న పదం. అంటరానివాళ్ళు, ఛండాలులూ, నిమ్నవర్ణాలవారూ... ఇలా రకరకాలుగా పిలుస్తూండేవారు. ఈ పిలుపుల్లో ఎక్కడా వీళ్ళూ మానవమాత్రులేనన్న గ్రహింపు వుండేది కాదెవరికీ!

1917 నాటికి "హరిజన సేవ" పిలుపుని కాంగ్రెస్ ఇంకా ఇవ్వలేదు. కానీ, కాంగ్రెస్‌కన్నా ముందే, అప్పటికే ఆంధ్రరాష్ట్రంలో పంచముల సేవాకార్యక్రమాలు ముమ్మరంగా ప్రారంభమయ్యాయి.

బెజవాడలో అయ్యదేవర కాళేశ్వరరావుగారు, యలకుర్రులో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, గుంటూరులో ఉన్న లక్ష్మీనారాయణగారు నల్లపాటి హనుమంతరావుగారు, రాజమహేంద్రవరంలో చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు. వీరంతా పంచములకోసం పాఠశాలలు నడుపుతూ, వారికి ఉచితవిద్య, భోజన సౌకర్యాలు కల్పించటం వంటి సేవా కార్యక్రమాలు చేపట్టి ఆనాటికే రాష్ట్రం అంతా ప్రసిద్ధులై వెలుగొందుతున్నారు.

బ్రిటిష్ వారి పుణ్యమా అని కులతత్వం పెరిగాక రాష్ట్రంలో వివిధ కులాలవారు కులసంఘాలు పెట్టుకొని స్వకులాభిమానాన్ని, స్వకుల ఉన్నతిని చాటుకొంటున్నారు. బ్రాహ్మణులు, వైదికులు, రెడ్లు, కమ్మవారు, విశ్వబ్రాహ్మలు... ఇలా ప్రతికులంవారికి కులసంఘా లున్నాయి.

కానీ, పంచములకోసం ఎవరూ అలాంటి సంఘాన్ని ఏర్పరచిన పాపాన పోలేదు. పంచములు స్వయంగా కులసంఘాల నేర్పరచుకునే అవకాశాలు కూడా ఆరోజుల్లో లేవు.

అందుకే, బెజవాడలో కాళేశ్వరరావుగారి నాయకత్వాన "ఆదిఆంధ్రుల ప్రథమ మహాసభ"ని ఏర్పాటు చేస్తున్నారు.

1917 అక్టోబర్ నెల మొదటివారం... బెజవాడ ప్రథమ ఆదిఆంధ్ర మహాసభ వేడుకగా జరుగుతోంది.

గూడూరి రామచంద్రరావుగారు, వేమూరి రాంజీరావుగారు వెల్లంకి కృష్ణమూర్తిగారు, పింగళి లక్ష్మీనారాయణ (స్వామి నారాయణానంద సరస్వతి)గారు సభలను చక్కగా నిర్వహిస్తున్నారు.

హైదరాబాద్‌లో ప్రముఖ ఆదిఆంధ్ర నాయకులు భాగ్యరెడ్డి వర్మ గారిని సభాధ్యక్షులుగా ఆహ్వానించారు.

సాయంకాలం బహిరంగసభ జరిగే మైలవరం రాజా హాలు వరకూ బెజవాడ వన్‌టౌన్ వీధుల్లో భాగ్యరెడ్డివర్మగారినీ, సుంద్రువెంకయ్యగారినీ గుర్రపు బగ్గీలో కూర్చోబెట్టి ఊరేగింపుగా తీసుకువెళ్తున్నారు.

అయ్యదేవర కాళేశ్వరరావుగారు తన సొంత గుర్రపుబండిలో వారిద్దరిని ఎక్కించి, ఎదురు వరసలో ఆయన నడుస్తూ ఊరేగింపుని నడిపిస్తున్నారు.

పంచముల నాయకులు రాయుడు గంగయ్యగారు, అత్తిలి సూర్యనారాయణగారు, నరాలశెట్టి దేవేంద్రుడు గారు, చింత శేషయ్యగారు, కుసుమ వెంకట్రామయ్యగారు, మంగళగిరి రాఘవదాసు గారు, నూతక్కి వెంకటేశ్వర రావుగారు... వీరంతా ముందు పీఠీన నడుస్తున్నారు.

"ఆది ఆంధ్రుల ఐక్యత వర్థిల్లాలి...!

"అంటరానితనం నశించాలి!"

"ఆదిఆంధ్రులకు ప్రత్యేక నియోజకవర్గాలు కల్పించాలి..." అంటూ నినాదాలు చేసారు ఊరేగింపులో పాల్గొన్న వారంతా. ఆహ్వాన సంఘం అధ్యక్షులు సుంద్రు వెంకయ్యగారు సభకుస్వాగతం పలికారు. భాగ్యరెడ్డివర్మగారు అధ్యక్షస్థానం నుంచి ప్రతిపాదించిన తీర్మానాలను సభ ఏకగ్రీవంగా ఆమోదించింది.

పంచముల్ని ఆదిఆంధ్రులని పిలవాలనేది మొదటి తీర్మానం. రామిగాడు, - సుబ్బిగాడు - అని కాకుండా రామయ్య, సుబ్బయ్య అని సర్కారీ లెక్కల్లో రాయాలనేది రెండవ తీర్మానం. అస్పృశ్యత పాటించకుండా గట్టి చట్టం చేయాలని కోరుతూ మూడోతీర్మానం చేశారు.

అసెంబ్లీ ఎన్నికల్లో ఆది ఆంధ్రులకు ప్రత్యేక ప్రాతినిధ్యం కావాలని కూడా మరో తీర్మానాన్ని ఆమోదించారు.ఆది ఆంధ్రులు ఏ రాజకీయ పార్టీకీ సంబంధం లేకుండా రాజకీయాలకు అతీతంగా వుండాలని కూడా నిర్ణయించారు.

సభానంతరం సుంద్రు వెంకయ్యగారు ఈ సభలను దిగ్విజయం చేసిన అందరికి ధన్యవాదాలు చెప్పారు.

"అయ్యదేవర కాళేశ్వరరావుగారి ఆలోచనల్లో పుట్టి, కాశీనాథుని నాగేశ్వరరావుగారి పూనికతో పూర్తయిన సభలివి!" అన్నారాయన సంతోషంగా.

"తొలిసారిగా పంచములు 'ఆది ఆంధ్రులు' గా మారిన ఈ సమావేశం చరిత్రాత్మకమైనది" అని ఆయన ప్రకటించారు.

"ప్రియమిత్రులారా! బెజవాడనగరంలో ఈ సభలు జరుపుకోవడానికి హాలుని అద్దెకివ్వడానికి ఎవ్వరూ ముందుకురాని విషయం ఎంతో బాధాకరమైనది. పంచములు వస్తే భవనాలు మైలపడతాయిట! కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు గట్టిగా చెప్పి ఈ మైలవరం రాజా హాలుని సభానిర్వహణ కోసం అలాగే మాడపాటి వారి టౌన్‌హాలుని భోజనాల ఏర్పాట్లకోసం అంగీకరింపచేశారు. ఈ సభల నిర్వహణ అంతా స్వంతఖర్చుతో చేయించారు. ఈ సభాముఖంగా కాళేశ్వరరావుగారికీ నాగేశ్వరరావుగారికి, ధన్యవాదాలు తెలుపుతున్నాను." అని ప్రకటించారు.

మంగిపూడి వేంకటశర్మగారు "నిరుద్ధభారతం" అనే గ్రంథం వ్రాసి, ఈ సభలో ఆవిష్కరింపచేసి ప్రతిఒక్కరికీ ఉచితంగా పంచి పెట్టారు.

ఆది ఆంధ్రుల సభలో మంగిపూడి వేంకట శర్మ గారిని ఘనంగా సత్కరించారు.

ఇంకనుంచీ క్రమం తప్పకుండా ప్రతిసంవత్సరం ఆది ఆంధ్ర సభలు జరగాలనీ నిర్ణయించారు.

మాంటేస్క్యూ గారు మద్రాసు వస్తున్నారు. బెజవాడ ఆదిఆంధ్రుల సభ చేసిన తీర్మానాన్ని ఆయనకు నివేదించటానికి భాగ్యరెడ్డివర్మ గారినీ, సుంద్రు వెంకయ్యగారినీ, రాయుడు గంగయ్య గారినీ ఒక కమిటీగా వేసి మద్రాసు పంపాలని, సభలో నిర్ణయించారు. సభ జయప్రదంగా ముగిసింది.

చీకటి పొరల్ని తొలగిస్తూ, పున్నమి చంద్రుడు వెలుగు రేఖలు విరజిమ్ముతున్నాడు. గుండెల్లో ప్రకాశిస్తున్న వెలుతురులో అణిగిపోయిన ఆత్మాభిమానం స్పష్టంగా అవుపిస్తోంది. పంచములు... ఆనాటినించీ 'ఆది ఆంధ్రులు...'!!

తాము మనుషులమనీ అందరిలాగానే తమకూ రక్తమాంసాలున్నాయనీ... తమకూ అందరితోపాటే సమాన హక్కులున్నాయనీ గ్రహించగలిగేందుకు ఈ సభలు తోడ్పడ్డాయి. నాకదే ఆనందం..." అంటూ సంతృప్తి ప్రకటించారు అయ్యదేవర కాళేశ్వరరావుగారు.

పున్నమి వెన్నెట్లో చంద్రుడు వెలుగురేఖలు విరజిమ్ముతున్నాడు.

చుట్టూ వున్న చీకటిని తిడ్తూ కూర్చునేకన్నా ప్రయత్నం చేసి ఒక చిరుదీపం వెలిగించటం గొప్ప... అన్న ఆర్యోక్తిని ఆయన పదేపదే జ్ఞాపకం చేసుకున్నారు.



యలకుర్రు శ్యామలా ధర్మ ప్రాథమికోన్నత పాఠశాల ఐదవ వార్షికోత్సవ సభ వైభవోపేతంగా జరుగుతోంది.

ఆకాశాన్ని తాకేటంత గంభీరంగా అశేష జనవాహినిలో ఆఖరువ్యక్తికి కూడా వినిపించేలా ఉపన్యసిస్తున్నారు ముఖ్య అతిథి అయ్యదేవర కాళేశ్వరరావుగారు.

ఉదయం నుంచీ విద్యార్థి వేములకూర్మయ్య చాలా బిజీగా వున్నాడు స్కూలు వార్షికోత్సవ సభకు ఏర్పాట్లన్నీ అతని చేతుల మీదుగానే జరిగిపోతున్నాయి.

రంగు కాయితాల జెండాలతో స్కూలంతా అంగరంగ వైభవంగా అలంకరింపచేయడం అతని డ్యూటీ. గదులన్నీ నీళ్ళుపోసి కడిగించాడు! విశాలమైన దాని ఆవరణంతా అలికి ముగ్గులు పెట్టించాడు. విద్యార్థులంతా కోలాహలంగా తీర్చిదిద్దుతున్నారు స్కూలుని. సాయంకాలం సభకోసమే అందరూ ఎదురుచూస్తున్నారు.

ముందు బహుమతులందుకోవచ్చు. ఆ తర్వాత పాటలు, నాటికలు, ఏకపాత్రాభినయాలు... ఒకటేమిటి... అంతా హుషారే హుషారు! ముఖ్య అతిథిగా విచ్చేసిన అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఆనాటి సామాజిక రాజకీయ పరిస్థితుల్ని అందరికీ అర్థంఅయ్యే భాషలో వివరించడం మొదలెట్టారు.

కాళేశ్వరరావుగారి ఉపన్యాస శైలి అవతలి వ్యక్తిని అంగీకరింపచేసే పద్ధతిలో ఉంటుంది. రెచ్చగొట్టేలా ఆయన మాట్లాడరు. "ఇలాచేసి తీరాలి మనం" అని ఎవరికి వారు తమంతతామే దీక్షవహించేలా ఉంటుంది.

వార్షికోత్సవ సభని స్కూలు ప్రధానోపాధ్యాయులు పోతుకూచి యజ్ఞనారాయణ గారు సమర్థంగా నడిపిస్తున్నారు.

"ప్రియమైన ప్రజలారా! విద్యార్థులారా!" కాళేశ్వరరావుగారు బిగ్గరగా అందరికి వినిపించేలా ఉపన్యసించటం ప్రారంభించారు.

"స్వాతంత్ర్యం అతిత్వరలోనే రాబోతోంది... భారతీయులు తలుచుకొంటే సాధించలేనిదిలేదు... బ్రిటిష్‌వారు మనకొక లెక్క కాదు... లెండి! సోదరులారా... స్వాతంత్ర జ్యోతిని వెలిగిద్దాం... సంగ్రామ భేరి మ్రోగిద్దాం..." అంటూ ఆయన ఉచ్ఛైస్వరంతో ప్రసంగిస్తుంటే పొంగుతున్న రక్తంతో ఉత్తేజితులై వింటున్నారు జనం... స్వాతంత్ర్య సముపార్జనకు అంటరానితనమే ఒక అవరోధంగా వుంది. అంటరానితనం పాటించడం వలన బ్రిటిష్‌వారిపై మనం జరిపే పోరాటంలో అత్యధిక సంఖ్యలో వున్న నిమ్నవర్ణాల సహకారాన్ని పొంది, వారిని కూడా కలుపుకొనిపోవటంలో మనం విఫలం అవుతున్నాం. స్వాతంత్ర్యం ఇందుకే ఆలస్యం అవుతోంది.

ప్రియమైన ప్రజలారా!

1916లో దాదాభాయి నౌరోజీ ఢిల్లీ పార్లమెంట్ (ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్) లో నిమ్నవర్ణాలవారి అభివృద్ధి కోరుతూ ఒక తీర్మానం ప్రవేశం పెట్టారు. బ్రిటిష్ వారు నౌరోజీగారి ప్రతిపాదనల్ని అంగీకరిస్తూ దేశంలో అన్ని రాష్ట్ర (ప్రావిన్షియల్) ప్రభుత్వాలూ ఈ తీర్మానాన్ని అమలుచేయాలని ఆదేశాలు జారీచేశారు.

అంతమాత్రాన బ్రిటిష్ వారికి పంచముల మీద ప్రత్యేక ప్రేమ వుందనుకోనవసరం లేదు. పంచములను క్రైస్తవ మతంలోకి ఆకర్షించటానికి బ్రిటిష్ వారు వేస్తున్న ఎత్తుగడ ఇదీ అందుకే, ఇంతకన్నా ఎక్కువగా పంచములకోసం హిందువులు. అగ్రవర్ణాల వారూ ఎంతో చేయల్సి వుందని నా అభిప్రాయం!

ప్రజలారా!

యలకుర్రులో ఈ ధర్మపాఠశాలలో పంచములను చేర్చుకున్నారని తెలిసి నాకు చాలా సంతోషంగా వుంది. బందరు జాతీయ కళాశాలలో కూడా ఈ ఆది ఆంధ్రులను చేర్చుకోవటం ఒక శుభపరిణామం!

పంచములను ఇప్పుడు "ఆదిఆంధ్రులు" అని పిలుస్తున్నాం అంతా!

"ఆదిఆంధ్రుల ఉద్ధరణ కోసం, వారిలో ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం పెంపొందింపచేయటం కోసం, స్వయం సహాయం, ఐకమత్యం నెలకొల్పటం కోసం, తాగుడు మాన్పించి, పరిశుభ్రత వృద్ధిచేసి వారి ఇబ్బందుల గురించి స్థానిక సంస్థల తోనూ, ప్రభుత్వం వారితోనూ రాయబారం నడపటానికి మేమంతా ప్రయత్నిస్తున్నాం...

ఇలానే యలకుర్రు ఈ చుట్టుప్రక్కలనున్న ప్రతిగ్రామ సీమలో కూడా ఇటువంటి అస్పృశ్యతా నివారణ సంఘాల్ని ఏర్పాటుచేసి ఆదిఆంధ్రులను కూడా మనుషులుగా తీర్చిదిద్దే బాధ్యత తీసుకోవలసిందిగా ప్రతి ఒక్కరిని కోర్తున్నాను.

ప్రజలారా!! ఆదిఆంధ్రులకు రామాయణ, భారతాది గ్రంథాలను విన్పించటం, హరికథలు చెప్పించటం చేయండి. క్రైస్తవ మతం వారి ప్రలోభాలకు లొంగకుండా ఆదిఆంధ్రులు హిందువులుగా గర్వంగా తిరిగేలా చూడవలసిన బాధ్యత ఈ సభలో వున్న హిందువులైన పెద్దలందరిదీగా నేను భావిస్తున్నాను'' అన్నారాయన.

సభానంతరం వివిధ పోటీల్లో విజేతలకు బహుమతులు అయ్యదేవర కాళేశ్వరరావుగారి చేతులమీదుగా అందింపచేస్తున్నారు.

ఆటలు, పాటలు, వక్తృత్వం, చిత్రలేఖనం, వ్యాసరచన, ఏకపాత్రాభినయం పోటీల్లో విజేతలు ఒక్కొక్కరే ప్రధానోపాధ్యాయులు పేర్లు పిలుస్తుంటే వేదిక మీదకు వచ్చి బహుమతులు తీసుకోసాగారు.

ప్రతి అంశంలోనూ మొదటి బహుమతి విద్యార్థి కూర్మయ్యకే వచ్చింది. ఆ చిన్నారి విద్యార్థి వేదికమీదకు వచ్చినప్పుడల్లా చప్పట్లు కొట్టి హుషారు చేస్తున్నారు విద్యార్థులు. ఆటపాటలలోనేకాదు, ఆఖరికి చదువులో కూడా ఈ విద్యార్థే ఫస్టున రావటం అయ్యదేవర కాళేశ్వరరావుగారికి చాలా ఆశ్చర్యం కల్గించింది.

బహుమతి తీసుకోవటానికి వేదిక మీదకు పిలిచినప్పుడల్లా అతన్ని దీక్షగా పరిశీలించసాగారు కాళేశ్వరరావుగారు. అతని కళ్ళలో ప్రయోగశీలత, తీక్ష దృష్టి, పట్టుదల, కృషి అనేవి ఆయనను ఎంతగానో ఆకర్షించాయి. మొదటి చూపులోనే కలిగిన అభిమానం అది...!

"ఎవరీ కుర్రవాడు...?'' అడిగారు స్కూలు ప్రధానోపాధ్యాయులు యజ్ఞనారాయణగారిని.

"ఇక్కడికి దగ్గరలోనే మల్లవరం అనే వూరుంది. ఆ వూళ్ళో దాసరుల కుర్రవాడు'' వివరించి చెప్పారు మాష్టారు.

"నిజమా!'' ఆశ్చర్యపోయారు కాళేశ్వరరావుగారు.'' ఆ కుర్రవాడి ముఖంలో సరస్వతీ కటాక్షం కన్పిస్తోంది మాష్టారూ!' అన్నారాయన.

"తండ్రి చనిపోయాడు. తల్లి కూలిపనులు చేసుకొంటూ కుటుంబాన్ని పోషిస్తోంది. ఈ కుర్రవాడు కూడా ఖాళీసమయంలో వ్యవసాయకూలీగా వెళ్లానే చదువులో రాణిస్తున్నాడు." మరింత వివరంగా చెప్పారు మాష్టారు. వింటున్నారు కాళేశ్వరరావు గారు.

"కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఈ కుర్రవాడి చదువుకోసం కొద్దిమొత్తం స్కాలర్‌షిప్‌గా ఇస్తే, అదిపెట్టి ఇద్దరు తమ్ముళ్ళని కూడా చదివిస్తున్నాడు.-" తన శిష్యుడు గొప్పతనాన్ని ఎంతో మెచ్చుకోలుగా చెప్పారు ప్రధానోపాధ్యాయులు.

"పై చదువులు చదువుతావా అబ్బాయీ" ఆప్యాయంగా దగ్గరికి పిలిచి అడిగారు కాళేశ్వరరావుగారు చిన్నారి కూర్మయ్యని!

అంతగొప్ప దేశభక్తుడు దగ్గరగా పిలిచి భుజంమీద చేతులు వేసి మాట్లాడుతుంటే ఆ చిన్నారి కూర్మయ్య హృదయం ఒక్కసారి పొంగిపోయింది.

"చదువుకొంటానయ్యా!" అన్నాడు వినయంగా.

"ఏం చదువుతావు-?" మళ్ళీ అడిగారు కాళేశ్వరరావుగారు.

"ప్లీడరు చదువులు చదువుతాను" కూర్మయ్యగారి చిన్నారి మనసు అప్రయత్నంగానే ఆయన చేత అలా అనిపించింది.

"మంచిది! చదువు!! నీకేమైనా సాయంకావాలంటే నా దగ్గరికి రా-" ఆశీర్వదించారు కాళేశ్వరరావుగారు.

కూర్మయ్యగారి జీవితంలో మొదటి మలుపు అక్కడే తిరిగింది!! అదే ఆయన భవిష్యత్తుకు పునాది వేసింది!!



1921 జనవరి

ఆంధ్ర రాష్ట్రకాంగ్రెస్ కమిటీ సమావేశం సుదీర్ఘచర్చల్లో మునిగితేలుతోంది

బెజవాడ రామమోహన గ్రంథాలయం హాలు కాంగ్రెస్ వాదులతో కిటకిటలాడిపోతోంది.

ఆ ఏడాది బెజవాడలో అఖిలభారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశానికి ఆతిథ్యంఇస్తూ, దేశ నాయకులందరినీ బెజవాడకు ఆహ్వానించాలనే విషయంపై తర్జనభర్జనలు జరుగుతున్నాయి.

గాంధీగారు బెజవాడ వస్తారంట! నెహ్రూగారు చిత్తరంజన్ దాసుగారు, మాలవీయాగారు ఇలాంటి పెద్దల్ని బెజవాడలో చూడడం అంటేనే పులకరింతగా వుంటుంది.....

కానీ, సభానిర్వహణా ఎలా... అన్నదే సమస్య!

"ఇది మా బెజవాడకు ప్రతిష్టాత్మకమైన అంశం. ఈ ఊళ్ళో ఏంచేసినా మంచైనా, చెడైనా అది మా వూరికే దక్కాలి! మేం ఎట్టి పరిస్థితుల్లోనూ పారుగూరు వారి మీద

ఆధారపడకుండా ఈ సభల్ని జరుపుతాం - '' నిర్ణయించినంత ఖండితంగా చెప్పారు అయ్యదేవర కాళేశ్వరరావుగారు.

రాష్ట్రకాంగ్రెస్ కమిటీకి అధ్యక్షులుగావున్న దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు ప్రధాన కార్యదర్శి గొల్లపూడి సీతారామశాస్త్రిగారు, సహాయ కార్యదర్శి వి.వి.గిరిగారుకూడా వేదికపైన ఆశీనులయ్యారు.

కాళేశ్వరరావుగారు, పట్టాభి సీతారామయ్యగారు, కాశీనాథుని నాగేశ్వరరావు గారు, బులుసు సాంబమూర్తి గారు, దండు నారాయణరావుగారూ వర్కింగ్ కమిటీ సభ్యులు.

అందరూ కూర్చుని కూలంకషంగా చర్చించి ఈ సమస్యని పరిష్కరిస్తున్నారు.

"మిత్రులారా! అఖిలభారత స్థాయి నాయకులు వస్తున్నప్పుడు లక్షలాది జనం తండోపతండాలుగా వస్తారు... పెద్ద తిరణాల లాగా వుంటుంది. అంతమందికీ సరిపడే స్థలం బెజవాడలో వుందా?" సూటిగా అడిగారు వెంకటప్పయ్యగారు.

కాళేశ్వరరావు గారు విసురుగా నుంచున్నారు."స్థలం అనేది ఏర్పాటు చేస్తేనే తయారౌతుంది! దేశరాజకీయాల్లో ఉదయిస్తున్న సూర్యుడిలా వెలుగొందుతున్న గాంధీ గారిని బెజవాడకు తీసుకురావటం మా ధ్యేయం: ఆయన్ని అఖిలభారత కాంగ్రెస్‌కు అధ్యక్షుణ్ణి చేయటమే మా ఆశయం! అందుకోసం ఏమైనా చేస్తాం! అన్నారు. అక్కడితో ఆగకుండా ఉద్రేకంగానే మాట్లాడసాగారు.

"కరెంటు మా బెజవాడకు లేదు. అయినా సభలు నిర్వహించగలం. పూటకూళ్ళు, హోటళ్ళు తగినన్ని బెజవాడలో లేవు. అయినా జనంమహాత్ముల్ని చూట్టానికి వస్తున్నారు గాని భోజనాలు చేయటానికి గాదు. వారి భోజనాలు వారు తయారుచేసుకొనే సౌకర్యాలు కల్పిస్తాం. ఉదారంగా విరాళాలిచ్చే స్తోమతవున్న దాతలు బెజవాడలో అంతగాలేరు. అయినా. బెజవాడ పౌరుల సహకారంతోనే కార్యక్రమాన్ని దిగ్విజయంగా నడిపిస్తాం! మాకాశక్తిసామర్థ్యాలున్నాయి-'' చాలా ఆవేశంగా ప్రసంగించారు అయ్యదేవర కాళేశ్వరరావుగారు.

"బెజవాడకు ఈ సభలు నిర్వహించే అవకాశంఇస్తే నా సహకారం పూర్తిగా వుంటుంది" అని ప్రకటించారు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

"గాంధీగారిని దేశనాయకుడిగా చేయటానికి బెజవాడ తోడ్పడుతోందంటే. అందరికంటే ముందు నేనే వుంటాను.'' అన్నారు డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు: కొండా వెంకటప్పయ్యగారు కూడా ఈ ఊపును చూసి సంతోషించారు..

"ఈరోజే అఖిల భారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి ఉత్తరం రాస్తాను - బెజవాడలో సమావేశానికి అంగీకరించమని- '' అని ప్రకటించారాయన.

సభలో ఇంకా అనేక నిర్ణయాలు తీసుకున్నారు జాతీయ విద్యాకమిటీని ఏర్పరచాలనేది ఒక నిర్ణయం. అయ్యదేవర కాళేశ్వరరావుగారి అధ్యక్షతన ఈ కమిటీని నియమించారు. దాని పక్షాన ఒక ఉచిత నేషనల్ హైస్కూల్‌ను వ్యవస్థాపించాలని కూడా తీర్మానించారు.

కాళేశ్వరరావుగారు జాతీయహైస్కూలు ఏర్పాటు ఒకవైపు, కాంగ్రెస్ సభల ఇంకో వైపు... రెండు బరువైన బాధ్యతలతో బైటకువచ్చారు.

ఆయనకు అండగా నిలబడి, నమ్మకంగా సాయపడే మనిషికోసం ఎదురుచూస్తున్నారు.

అంతలోనే - "నమస్కారం సార్!" అంటూ పలకరించిన యువకుడు వేముల కూర్మయ్యగారిని చూడగానే ఆయనకు ప్రాణంలేచి వచ్చింది!!

ఇంక అనుకున్న పనులన్ని అయిపోతాయనిపించింది ఆయనకి! హాయిగా ఊపిరి పీల్చుకున్నారు కాళేశ్వరరావుగారు.



1922 మార్చి 10

జడ్జి "బ్రూంఫీల్డు" గారు వంచిన తల ఎత్తకుండా కాయితాల్లో తలకాయి దూర్చి కేసు విచారణ చేస్తున్నారు.

నేరం చేశాడని ఆరోపించబడి బోనులో నిలబడ్డ ఆ ముద్దాయి వంక చూసే ధైర్యం జడ్జిగారికి లేదు. బ్రూంఫీల్డ్ గారికే కాదు - రవి అస్తమించని బ్రిటిష్ ప్రభుత్వానికే ఆ వ్యక్తివంక చూసే ధైర్యం లేదు.

ఆయనే... గాంధీజీ!

"ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజల్లో అవిధేయతని పురిగొల్పుతున్నారని మీమీద ప్రభుత్వం వారు ఆరోపిస్తున్నారు..." సన్నగా గొణుగుతున్నట్లు అన్నారు బ్రూంఫీల్డ్‌గారు 'దీనికి మీ సమాధానం ఏమిటి మిస్టర్‌గాంధీ...?" చాలా సౌమ్యంగా అడిగాడాయన. ప్రశ్నవేసేప్పుడు కూడా గాంధీగారివైపు చూడలేదాయన.

గాంధీగారు బోనులోంచే సమాధానంచెప్పారు.

"మైలార్డ్! చెడు అనే దానికి ఎప్పుడూ అవిధేయంగా వుండమనే మా భారతీయ సంస్కృతిచెప్తుంది-"

"మీరు బ్రిటిష్ వారికి సహకారం ఇవ్వడానికి నిరాకరిస్తున్నారా?" అడిగాడు జడ్జి-సూటిగా - ఆయనవైపు చూడకుండానే తలవొంచుకుని!

"మంచి అనేదానికి మాత్రమే నా సహకారం వుంటుంది.." అని గాంధీగారి సమాధానం కఠినంగా....

"ప్రభుత్వ నియమాల ప్రకారం మీ అవిధేయతకు శిక్షవేయవచ్చు" జడ్జిగారి స్వరంలో తెచ్చిపెట్టుకున్న కాఠిన్యం కొద్దిగా!

"మైలార్డ్! నా హృదయం ప్రకారం ప్రభుత్వానికి అవిధేయత అనేది ఈ దేశ పౌరుడిగా నా బాధ్యత. మీ చట్టప్రకారం ఈ అవిధేయత నేరం అయితే నేను నేరస్తుణ్ణే అని గర్వంగా ఒప్పుకొంటున్నాను. నాకు శిక్షవేయించండి-" అన్నారు సౌమ్యంగానే గాంధీజీ!!

గాంధీగారు తనను ఏ మాత్రం తికమకపెట్టకుండా ఇంత తేలికగా తానే నేరస్థుణ్ణని అంగీకరిస్తాడని ఊహించని బ్రూంఫీల్డ్ గారు ఆ మాటలతో అవాక్కయి పోయారు.

ఒక్కక్షణం ఆగి, కాసిని నీళ్ళుతాగి, చెకచెకా తన తీర్పు చదివేయసాగారు.

"కోట్లాదిమంది భారతీయుల దృష్టిలో మీరు మహాత్ములు. కానీ, చట్టందృష్టిలో నేరస్థులని స్వయంగా మీరే అంగీకరించారు. కాబట్టి మీకు ఆరేళ్ళు జైలుశిక్ష విధిస్తున్నాను" అని చటుక్కున తీర్పు చదివి, కాయితాలు మూసేసి, వంచిన తలఎత్తకుండా లేచి తన గదిలోకి వెళ్ళి పోయారు జడ్జి బ్రూంఫీల్డ్‌గారు.

గాంధీగారికి జైలుశిక్ష వార్త తెలియడంతో దేశం అల్లకల్లోలం అయ్యింది.

మళ్ళీ అల్లర్లు చెలరేగాయి.

ప్రజలు ఉత్తేజితులు కావాలనే ఆశించారు గాంధీ. కానీ, ఉద్రేకులు కావటం ఆయన్ని కలవరపెట్టసాగింది!

క్రమేణా అల్లర్లు మతం రంగు పులుముకొంటున్న సంగతి కూడా జైల్లోంచి గమనించసాగారు గాంధీ!! "భారత రాజకీయాలు మతపరంగా నడిస్తే అంతకన్నా దౌర్భాగ్యం ఈ దేశానికి ఉండదు -" అనుకొన్నారాయన.



గాంధీగారి అరెస్టు జరిగి రెండేళ్ళు కావొచ్చింది.

దేశంలో ముస్లింలీగ్, హిందూ మహాసభల మధ్య చెలరేగిన కొట్లాటలు ఢిల్లీ లక్నో అలహాబాద్, జబుల్‌పూర్, నాగపూర్‌లలో మారణహోమాన్ని సృష్టించాయి.

గాంధీగారు జైల్లోంచే ప్రజలకు శాంతి సందేశాలు పంపుతున్నారు. కానీ, హిందూ, ముస్లిం మతోన్మాదులెవరికీ ఆయన పలుకులు చెవిసోకటం లేదు.

గాంధీగారు వివరించి విడమరిచి చెప్పారు తన సందేశంలో... "ఇదంతా బ్రిటిష్‌వారి కుట్ర" అని.

"మొదట చరిత్ర పాఠాల్లో 'ముస్లింలు హిందువుల్ని అణగద్రొక్కారు, హిందూదేవాలయాల్ని పగులకొట్టి హిందూ స్త్రీల మాన ప్రాణాలను దోచుకున్నారనే విషయాలకు అధిక ప్రాధాన్యం ఇచ్చి హిందువుల్ని రెచ్చగొట్టారు. ముస్లిం రాజవంశాలు బలహీనపడేవరకూ ఈ ధోరణిలో పనిచేశారు.

1900 సంవత్సరం తర్వాత ఈ రకమైన ప్రచారాన్ని హిందువుల మీదకు మళ్ళించారు. దేశంలో మైనారిటీలుగా వున్న ముస్లింలను అణగదొక్కి మెజారిటీ హిందువులు అన్ని సుఖాలూ పొందుతున్నారని ముస్లింలను రెచ్చగొట్టటం మొదలుపెట్టారు. బ్రిటిష్‌వారి ఆశీస్సులతోనే ముస్లింలీగ్ ఏర్పడింది. దాన్ని తమకుఅనుకూల సంస్థగా మార్చుకొనేందుకు బ్రిటిష్‌వారు అన్ని ఎత్తుగడలు అవలంభిస్తున్నారు....." అని ప్రజలకు వివరించారు కాంగ్రెసు వాదులు.

"ఈ మతకల్లోలాలన్నీ బ్రిటిష్ ప్రభుత్వం రెచ్చగొడ్తున్న అంశాలని గమనించకపోవటం వలన దేశం... ముఖ్యంగా ఉత్తర భారతదేశం రావణకాష్టంలా రగుల్తూనేవుంది" అని పత్రికలుకూడా వ్యాఖ్యానించసాగాడు.

గాంధీగారి విజ్ఞప్తులకు మతకల్లోలాలు ఆగకపోగా పెరిగాయి.

తీవ్రమైన ఆవేదనకు లోనయ్యారు గాంధీ...

మనోవేదనతో మహాత్ముడు మంచం పట్టారు. అయినా మతోన్మాదులు ఆయన్ని పట్టించుకోలేదు.

ఈ మతకల్లోలాలు- ఈ నరుక్కోవటాలు, చంపుకోవటాలు, గృహదహనాలు. లూఠీలు... ఇవన్నీ ఎవరు చేస్తున్నారు...

వారు ఆశించే ప్రయోజనం ఏమిటీ...

చంపిన వాడికి వచ్చిన లాభం ఏమిటీ...

చచ్చిన వాడు పొందిన సౌఖ్యం ఏమిటీ...

ఏమిటీ వైపరీత్యం...?!



1924 ఫిబ్రవరి 5.

ఆరేళ్ళ శిక్ష పూర్తి కాకుండానే, రెండేళ్ళకే గాంధీగారి విడుదలకు ఆదేశాలు జారీచేసింది బ్రిటిష్ ప్రభుత్వం.

"మీ అనారోగ్యాన్ని దృష్టిలోపెట్టుకొని విడుదలచేస్తున్నట్లు ప్రభుత్వం ప్రకటిస్తోంది..." అని పోలీసు అధికారి గాంధీగారికి వివరించాడు.

గాంధీగారు నిర్వేదంగా ఆయనవంకచూశారు.

"నా దేశం అగ్ని గుండంలా రగుల్తుంటే మీ ప్రభుత్వం సమిధలు వేసి మంటలు రేపుతుంటే నేను ఆరోగ్యంగా వుంటానని మీరు ఎలా భావించారు?" ఎదురు ప్రశ్నించారు గాంధీ!

పోలీసు అధికారి మౌనంగా తలదించుకున్నాడు. గాంధీగారు లేచి కూర్చున్నారు. ఒత్తిగిలిపడుకున్న ఆయన్ని లేపి కూర్చోబెట్టడానికి పోలీసు అధికారి సాయపడబోయాడు.

గాంధీజీ వారించారు.

"మతాలతో సంబంధంలేని అమాయకులైన సాదేశప్రజలు ఈ మారణ హోమంలో మలమలమాడిపోతున్నారు. చేతనైతే వారికి సాయం చేయండి ఈ మతకల్లోలాల్ని ఆపండి. అమాయక ప్రాణాలను కాపాడండి..." దుఃఖభాజనుడయ్యారు మహాత్ముడు.

లేచినుంచుని, తూలుతున్నశరీరాన్ని నిలదొక్కుకొంటూ జైలుగది బైటకు వచ్చారు గాంధీజీ. పోలీసుఅధికారి గాంధీజీకి నమస్కరించాడు. "మీ ప్రభుత్వం దయ మీకు కలుగు గాక!" ఆశీర్వదిస్తూ అన్నారు గాంధీ!

భారతీయుడైన ఆ పోలీసు అధికారి బ్రిటిష్‌వారి తొత్తుగా భారతీయుల్నే హింసించే ఉద్యోగం చేయాల్సివస్తున్నందుకు ఎంతో సిగ్గుపడ్డాడు.

ఎవర్నీ పలకరించకుండా, ఎవ్వరివంకా కన్నెత్తి చూడకుండా తిన్నగా సబర్మతి ఆశ్రమానికి బయల్దేరారు గాంధీ!

ఆయన హృదయంలో అగ్ని పర్వతం బ్రద్దలౌతోంది.

మతం అనే ఈ దుష్టశక్తి... బహుశా కొన్ని దశాబ్దాలపాటు ఈదేశాన్ని ఇలానే పట్టిపీడిస్తూనే వుంటుంది కాబోలు... దీనికి విరుగుడు లేదా...?

సబర్మతి ఆశ్రమంలో ఎవ్వరికి దర్శనం ఇవ్వకుండా వంటరిగా వుండిపోయారు గాంధీ.

గాంధీగారి మౌనాన్ని భరించలేకపోతున్నారు ప్రజలు.

మతోన్మాదం మాత్రం అడ్డూ అడుపు లేకుండా బుసలు కొడుతూనే వుంది!



ఏప్రియల్ 1924

ప్రసిద్ధ తిరువాన్కూరు రాష్ట్రం వైకమ్ గ్రామంలో దేవాలయం నాలుగు ప్రత్యేక వీధులు సత్యాగ్రహులతో నిండిపోయాయి.

వంతులువారీగా సత్యాగ్రహులు జెండాలు పుచ్చుకొని, దేవాలయవీధుల్లో ప్రదర్శనలు చేస్తున్నారు.

"అంటరానితనం మహాపాపం!"

"అస్పృశ్యులకూ వీధుల్లో నడిచే హక్కుంది!"

"జంతువులు నడిచే వీధిలో మనుషుల్ని నడవకూడదా?" అంటూ అంటరానితనాన్ని వ్యతిరేకిస్తూ బ్యానర్లు పట్టుకొని ఊరేగింపు జరుపుతున్నారు.

పూర్తి శాంతిమార్గాన ప్రదర్శన సాగిపోతోంది.

రామస్వామి నాయకర్, శ్రీనివాసఅయ్యంగార్ ఊరేగింపుకు నాయకత్వం వహిస్తూ ముందు వరసలో నడుస్తున్నారు.

వైకమ్ గ్రామంలో ప్రజలు ఇళ్ళలోంచి బైటకు వచ్చి ఆడామగ అందరూ ఊరేగింపుని తిలకిస్తున్నారు.

సుబ్రహ్మణ్య భారతి వంటి ప్రసిద్ధ కవుల దేశ భక్తి గీతాలను పాడుకొంటూ ఊరేగింపులో కాంగ్రెస్ కార్యకర్తలు నడిచి పోతున్నారు.

కురూరు నీలకంఠ నంబూద్రిపాద్ గారు కార్యకర్తలకు శిక్షణఇచ్చి ఈ సత్యాగ్రహం చేయిస్తున్నారు.

"ఏమిషే బుష్షీ.... చూస్తున్నావుషే... ఊరేగింపుషే..." అంటూ ఇంట్లోంచే ఓ తెలుగింటి బ్రాహ్మణ అత్తగారు వత్తిఫత్తి పలుకుతూ తనకోడల్ని పిలిచింది. బైట ఊరేగింపు చూస్తూ నిలబడ్డ కోడలు అత్తగారిని విన్పించు కోలేదు.

"వొషే! షెవుఢషే!!" అని మళ్ళీ బిగ్గరగా అరిచింది. ఎంత గట్టిగా వత్తిపలికితే అంత గొప్ప బ్రాహ్మణులను కొంటారని ఆవిడ అభిప్రాయం!

"విస్సావఝుల వారి విస్సాయి ఊరేగింపులో పడి తిరుగుతున్నాడషా..." చివరి అక్షరం దీర్ఘం తీస్తూ చెప్పింది కోడలు... వీధి అరుగుమీంచే!

"ఏం ఊరేగింపుషా?" అడిగింది అత్తగారు.

"పరియాల్ని (అస్పృశ్యుల్ని) అగ్రహారాల్లోకి రానివ్వాలషా..." అంది కోడలు వీధిలోంచే!

ఆమాట వింటూనే అవాక్కయ్యింది అత్తగారు!

"ఈ పరియాలెంతటివారషే! పరమాత్మనే ధిక్కరిస్తారషే!!" అంది కోపంగా!! "అసలిదంతా మన తెలుగువారే చేసారషే! వాళ్ళని చూసి వీళ్ళూ అలా తయారయ్యారషే....." అని విసుక్కుంది.

సత్యాగ్రహం ప్రజల్లో చక్కని అవగాహన తెచ్చిందని, అస్పృశ్యుల్ని అంటరాని వారిగా చూడడం అమానుషం అని చాలామంది గ్రహించారనీ సత్యాగ్రహులు సంతోషించారు. "మారనివారు ఎటుతిరిగీ మారరు. అవగాహనాపరులైన అగ్రవర్ణంవారే మనకు కావాలి! వారుమారి, పదిమందిని మార్చగలుగుతారు..." అన్నారు బ్రాహ్మణ వ్యతిరేకత గురించి వ్యాఖ్యానిస్తూ శ్రీనివాస అయ్యంగార్!

సత్యాగ్రహం ఇలానే ప్రతిరోజూ జరపాలని నిర్ణయించారు. అస్పృశ్యుల సమస్యని ప్రజలందరూ అర్థంచేసుకునే వరకూ ఈ ఉద్యమం సాగాలని తీర్మానించుకొన్నారు. "మిత్రులారా! గాంధీగారు సత్యవ్రతదీక్షలో ఉన్నారు. ఉత్తరభారతదేశం మతకల్లోలాలతో అల్లకల్లోలంగావుంది. వారు దీక్ష విరమించిన తర్వాత తిరువాన్కూరు వచ్చి మహారాణి పార్వతిబాయి గారితో మాట్లాడగలనన్ని

సందేశం పంపారు." అంటూ స్వామీ నారాయణ గురువుగారు గాంధీగారి సందేశాన్ని అందరికీ చదివి వినిపించారు. ప్రజల హర్షధ్వానాలు అగ్రహారాన్ని దాటి ట్రావెన్‌కోర్ కోట బురుజులు దాటి రాణిగారిని చేరాలి...!! అదీ అందరి ఆకాంక్ష!!



గాంధీగారు జైలునుంచి విడుదలై నెలలుగడుస్తున్నాయి దేశ పరిస్థితిలో ఏ మార్పూలేదు.

మేరుపర్వతం అంత సహనం వహించిన గాంధీగారికి ఇది పరీక్షే అయ్యింది.

1924 సెప్టెంబర్ నెల

అకస్మాత్తుగా నిరవధిక నిరాహార దీక్ష చేస్తున్నట్లు ప్రకటించారు గాంధీ. మతకల్లోలాలు తక్షణం ఆపాలని ఆయన డిమాండ్ చేశారు. మతోన్మాదులు అణుమాత్రం కూడా ఆయన్ని లెక్క చెయ్యలేదు.

5 రోజులు గడిచాయి.

గాంధీగారి నిరశన వ్రతం కొనసాగుతూనేవుంది. దేశ పరిస్థితిలో మార్పులేదు.

10 రోజులుగడిచాయి.

దేశభక్తులందరూ ఆందోళనతో సబర్మతి ఆశ్రమానికి పరుగులుతీయడం ప్రారంభించారు.

దేశనాయకులంతా గాంధీగారి చుట్టూ కూర్చున్నారు. ఆయన్ని వేయి కళ్ళతో కాపాడుకోవాలని వారి ఆదుర్దా!

"మత కల్లోలాలు ఆగాయి... దేశం ప్రశాంతంగా వుంది..." అన్న వార్త రాలేదు. గాంధీగారి దీక్ష ఆగలేదు.

ఈ దారుణాతిదారుణ హత్యాకాండను మొదటగా హిందువులే ప్రారంభించారని ముస్లింలు ఆరోపించారు. ముస్లింలే మొదలు పెట్టారని హిందువులు ఆరోపించారు. "ఎవరు ముందు ప్రారంభించారన్నది కాదు - ఎవరు ముందు ఆపుతారన్నది ప్రశ్న!" అన్నారు నీరసంగా గాంధీజీ!

20 రోజులు గడిచాయి.

గాంధీగారి పరిస్థితి ఆందోళనకరంగా మారింది. అసలే అనారోగ్యం... ఆపైన ఈ నిరశన వ్రతం...

చిక్కి శల్యమైపోయారు గాంధీ.

కన్నీరు మున్నీరుగా విలపిస్తోంది దేశం...

గాంధీ గారికి ఏదైనా జరిగిందంటే...... మతం గురించి మాట్లాడిన వాడినల్లా నరికేయాలన్నంత కోపంగా వున్నారు ప్రజలు. కొందరు మతోన్మాదుల దౌష్ట్యానికి ఇందరు

సామాన్యప్రజలు ఎందుకు బలి కావాల్సివస్తోందని ప్రతివారు ప్రశ్నించ సాగారు. మత పిశాచాలకోసం "గాంధీగారెందుకు ప్రాణత్యాగం చెయ్యాలి" అని నిలదీయ సాగారు.

మతసంబంధమైన వాదనలు చేసే వ్యక్తులపైన వత్తిడి పెరగసాగింది. మతం కన్నా గాంధీగారు దేశానికి అతిముఖ్యం!!

21వ రోజు...

కారణం ఏదైనా కానీండి... ఆరోజు అవాంఛనీయ సంఘటనలు ఒక్కటికూడా జరగలేదు.

ముస్లింలీగ్, హిందూ మహాసభ నాయకుల్ని కూర్చో పెట్టి రాజీ చర్చలు జరిపారు.

"సమైక్యత కుదిరింది" సంతోషంగా గాంధీగారికి వార్త చేరవేశారు.

"కానీ, సామరస్యం కుదరలేదు కదా...!!" నిరాహార దీక్ష విరమిస్తూ అన్నారు గాంధీ.

మోతీలాల్ నెహ్రూ, మౌలానా అబూకలామ్ అజాద్ తలవంచుకొని నిల్చున్నారు.

"మతరాజకీయాలకు దూరంగా వుంటామని హిందూ ముస్లిం నాయకుల నుంచి హామీ పొందగలిగారా...?" అడిగారు గాంధీ.

"అది అసాధ్యమైన విషయం" అన్నారు మోతీలాల్‌నెహ్రూ తల అడ్డంగా ఊపుతూ.

"హిందువైనా, ముస్లిమైనా ఈ దేశానికి పెనుముప్పు ఎప్పటికైనా మతతత్త్వవాదులే..." అన్నారుగాంధీ!

గాంధీజీ తాను నిస్సహాయుణ్ణనే నిర్వేదంలో పడిపోయారని అందరూ గుర్తించారు. విషాద ఛాయలు సబర్మతి ఆశ్రమం అంతా అలముకున్నాయి.

తపోదీక్షకుపక్రమించిన రుషిలా ప్రార్థనా గదిలోకి నిష్క్రమించారు గాంధీ. ఆ గదినించి బైటకి రావడమే మానేశారు.

1925-27 మధ్యకాలాన్ని నిరాశాజనకమైన కాలంగా చరిత్రకారులు చెప్తారు.

సబర్మతి ఆశ్రమంలోనే సత్యవ్రత దీక్ష కొనసాగించసాగారు గాంధీ.

సరిగ్గా అదే సమయంలో గాంధీజీ ఆశ్రయాన్ని కోరుతూ వెళ్ళారు కూర్మయ్యగారు.

సబర్మతి ఆశ్రమంలో ఆశ్రయం దొరికితే కూర్మయ్యగారి జీవితం మరో మలుపు తిరిగినట్టే!

కాలం ఆయన జీవితాన్ని ఏ దిశన నడుపుతోందో చూడాలి మరి!!

సబర్మతి నదీ జలతరంగ క్షాళితమైన ఇసుకరేణువులా ఆయన హృదయ లాలిత్యం ప్రకాశిస్తోంది. స్వరాజ్య భానుడివైపు తిరిగి ధ్యానిస్తూ నిల్చున్నారు కూర్మయ్యగారు...... గాంధీజీగారి పిలుపు కోసం ఎదురుచూస్తూ...!!



" నా ఆశలన్నీ ప్రార్థనలోనే వున్నాయి. ప్రార్థనకు సమాధానంకోసం ఆశపెట్టుకున్నాను" అన్నారు గాంధీజీ...

సరిగ్గా అదే సమయంలో వేముల కూర్మయ్యగారికి సబర్మతి ఆశ్రమంలో గాంధీగారిని దర్శించేందుకు అనుమతి లభించింది.

"బెజవాడ నుంచి వచ్చావుకదూ..." కూర్మయ్యగారిని చూస్తూనే గుర్తుపట్టారు గాంధీజీ!

కూర్మయ్యగారి అభివాదాన్ని స్వీకరించి ఆశీర్వదించారు.

బెజవాడ కాంగ్రెస్ సభలో నువ్వు చేసిన సేవలు నాకింకా గుర్తున్నాయి.... అన్నారు గాంధీజీ... ఆనాటి వైభవోపేతమైన సభల్ని గుర్తుచేసుకొంటూ.

ధన్యవాదాలు చెప్పుకొన్నారు కూర్మయ్య.

జేబులోంచి అయ్యదేవర కాళేశ్వరరావుగారు రాసిచ్చిన ఉత్తరం మహాత్మునికి అందించారు.

"వేముల కూర్మయ్య అనే ఈ నిమ్నవర్ణముల విద్యార్థి కాంగ్రెస్ కార్యక్రమాలలో నాకు కుడిభుజంగా వ్యవహరిస్తున్నాడు. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్వగ్రామమైన యలకుర్రు గ్రామంలో ఎలిమెంటరీ చదువుపూర్తిచేసుకొని నా వద్దకు బెజవాడ రాగా మా నేషనల్ హైస్కూల్‌లో విద్యార్థిగా చేర్చుకున్నాను. మా ఇంట్లోనే వుంచుకొని మెట్రిక్యులేషన్ వరకూ చదివించాను.

అతను కాశీ విశ్వవిద్యాలయంలో ఉన్నత చదువులు అభ్యసించాలని ఆకాంక్షిస్తున్నాడు. అతనికి సాయపడవలసిందిగా ప్రార్థన"

కాళేశ్వరరావుగారు రాసిన ఉత్తరాన్ని ఆసాంతం చదివారు గాంధీజీ.

"ఏం చదువుదామనుకొంటున్నావు-?" అడిగారు గాంధీజీ కూర్మయ్యగారిని.

"న్యాయవాదిని కావాలనివుంది-" తడుంకోకుండా సమాధానం చెప్పారు కూర్మయ్యగారు.

"మంచిది-" గాంధీగారి సమాధానం. నువ్వు జీవించినంతకాలం నీవాళ్ళ కోసం. నీ సంఘీయులకోసం, నీ హరిజనులకోసం పాటుపడతానని ప్రమాణం చేస్తావా? ప్రశ్నించారు మళ్ళీ గాంధీ.

"అక్షరాలా మీ అడుగు జాడల్లో నడుస్తూ బ్రతికున్నంతకాలం గాంధేయవాదిగానే వుంటాను-" అని ఆయన పాదాలమీద వోకరిల్లారు కూర్మయ్యగారు.

ఆ దృశ్యాన్ని చూసిన అక్కడి వాళ్ళందరికళ్ళూ చెమర్చాయి.

"నువు చదివిన చదువు నిమ్నకులాల అభివృద్ధికి ఉపయోగ పడాలి. హరిజనులు. గిరిజనులు - వెనకబడిన తరగతులవారి ప్రతినిధిగా జీవితాంతం

కృషిచెయ్యి. నీ చదువుని నీ స్వార్థం కోసం ఎప్పుడూ ఉపయోగించుకోకు-" అన్నారు గాంధీజీ. తప్పకుండా అన్నట్లుగా తలూపారు కూర్మయ్యగారు.

"నిజమైన గాంధేయవాదిగా, అహింసావాదిగా సత్యవాదిగా నిన్ను నువ్వు సంస్కరించుకొనేందుకోసం ఈ ఆశ్రమంలో కొన్నాళ్ళు వుండు. ఇక్కడ నువ్వుపొందే శిక్షణ భవిష్యత్తులో నిన్ను సత్యవాదిగా చేస్తుంది-" ఆదేశించారు గాంధీ.

సరేనన్నారు కూర్మయ్యగారు.

సబర్మతి ఆశ్రమజీవితానికి క్రమేణా అలవడుతూ సత్యవాక్పాలనతో, చిత్తశుద్ధితో నిజమైన గాంధేయుడిగా పూర్తిగా రాణించారు కూర్మయ్యగారు.

రాముడు పట్టాభిషేకానికి ముందు విశ్వామిత్రుడి ఆశ్రమంలో శిక్షణ పొందినట్లు కృష్ణుడు తన విశ్వకార్యక్రమాన్ని ప్రారంభించబోయే ముందు సాందీప మహర్షి ఆశ్రమంలో విద్యను గరపినట్లు కూర్మయ్యగారు రెండు సంవత్సరాల సుదీర్ఘకాలం గాంధేయ సిద్ధాంతాల్ని ఆకళింపుచేసుకొంటూ సబర్మతి ఆశ్రమంలో శిక్షణ పూర్తి చేశారు. ఆ తర్వాత కాశీ విశ్వవిద్యాలయంలో ఒకేఒక హరిజన విద్యార్థిగా రాణించేందుకు ఈ శిక్షణ ఆయనకెంతో మనోబలాన్ని సమకూర్చింది!



బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో మొట్టమొదటిసారిగా ఒక సంచలనాత్మకమైన సంఘటన జరగబోతోంది.

బహుశా, ఈ సంఘటనే భవిష్యత్తులో లక్షలాది పంచములు విద్యావేత్తలయి ఈ దేశాన్ని ఏలే అధికారులై, నాయకులై, రాణించేందుకు ప్రేరణ కాబోంతోందేమో...

బెనారస్ హిందూ యూనివర్శిటీ ఎఫ్.ఎ. ఎంట్రెన్స్ పరీక్షలో అగ్రవర్ణాలవారితో సమానంగా మంచి మార్కులతో పాసయిన తెలుగు విద్యార్థి వేములకూర్మయ్యగారు యూనివర్శిటీలో సీటు కోసం మదనమోహన మాలవ్యాగారి కార్యాలయందగ్గర వేచివున్నాడు.

గాంధీగారి మనిషి వేముల కూర్మయ్యగారు...

యోగ్యతని పరీక్షించి, ప్రత్యేకంగా, స్వయంగా గాంధీజీ ఎంపిక చేసి పంపిన వ్యక్తి వేముల కూర్మయ్యగారు...

బెనారస్ హిందూ యూనివర్శిటీలో చదువుకోటానికి వచ్చిన మొదటి నిమ్నవర్ణాలకు చెందిన విద్యార్థి... వేముల కూర్మయ్యగారు.

కానీ, కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో కూర్మయ్యగారు చదువుకోటానికి సీటు ఇచ్చే విషయంలోనే మల్లగుల్లాలు పడ్తున్నారు పండిత మదన మోహన మాలవ్యా.

పండితమదన మోహన మాలవ్యా కాశీ విశ్వవిద్యాలయ వ్యవస్థాపకులు. గొప్ప దేశభక్తులు. పంచముల ఉన్నతికి అమితంగా కృషిచేస్తున్న సంస్కరణ వాది. ఈ కాశీ హిందూవిశ్వ విద్యాలయానికి వైస్ ఛాన్సలర్ కూడా ఆయనే!

మంచి మార్కులతో ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణుడైన ఈ పంచముల విద్యార్థికి ఎఫ్. ఎ.లో సీటు ఇచ్చి సహకరించండి" కాళేశ్వరరావుగారి నించి మాలవ్య గారిక్కూడా ఒక ఉత్తరం...

"దీన జనోద్ధారణ కార్యక్రమాల్ని దేశం అంతా చేపట్టవలసిందిగా ప్రభోధిస్తున్న మనం మన ఆధీనంలోని ఒక విశ్వవిద్యాలయంలో కనీసం ఒక పంచముడినైనా చదివించకపోతే మనం చెప్పేదానికీ, చేసేదానికి పొంతన లేనట్టే"అన్నారు గాంధీగారు మాలవ్యాగారికి రాసిన ఉత్తరంలో!

గాంధీగారి దగ్గర రెండు సంవత్సరాలు శిక్షణ పొంది, అసలైన గాంధేయుడిగ యూనివర్శిటీలో అడుగుపెట్టిన కూర్మయ్యగారిని ఆయన ఇంకా విశ్వవిద్యాలయంల చేరకమునుపే చాలామంది విద్యార్థులు వచ్చి పరిచయంచేసుకు వెళ్ళారు.

విద్యార్థులలో ఇతనికి సీటు ఇస్తారేమోనని భయపడ్డవారు కూడా కొంతమంది లేకపోలేదు సీటు ఇస్తే సృష్టించవలసిన అలజడి గురించి ఆలోచించిన మత భావావే పరులూ కొందరున్నారు.

అన్నింటినీ గమనిస్తున్నారు మాలవ్యాగారు. కూర్మయ్య గారిని తన గదిలోపలి పిలిపించి మాట్లాడారాయన. తెల్లని పంచె, పైనలాల్చి, పైకండువాతో మూర్తీభవించిన తెలుగుబిడ్డలా వున్నారు కూర్మయ్యగారు. స్వచ్ఛమైన ఆ ముఖ కవళికలు ..... నిర్మలమైన ఆ చూపులు, ఏదో సాధించాలనే దృక్పథంతో వున్న ఆ కళ్ళు, పదిమందినీ ఆకర్షించే వర్చస్సు, నిజమైన గాంధేయవాదిగా నిలిచే వ్యక్తిత్వం..., మాలవ్యాగారి సబర్మతి నుంచి వచ్చిన సత్యవాదిగా కన్పించారు కూర్మయ్యగారు.

అంతే! కాశీవిశ్వవిద్యాలయంలో అవలీలగానే సీటు దొరికింది కూర్మయ్య గారికి! ఫీజులేకుండా చదువుకునే ఏర్పాటు చేశారు. స్టయిఫండ్ ఏర్పాటుకూడా చేశారు. కష్టించి చదువుకోవటమే కూర్మయ్యగారి వంతయ్యింది...

కూర్మయ్యగారి చేరికతో బెనారస్ హిందూయూనివర్శిటీ వార్తల్లోకెక్కింది.

దేశవ్యాప్తంగా అనేక నిమ్నవర్ణాల వారికి చదువు కోవాలనే ఆశ తీరేందుక ఈ విశ్వవిద్యాలయం గొప్ప ఆదర్శసంస్థగా కన్పించింది.

బెజవాడలో మరీ సంచలనం కల్గింది.

అయ్యదేవర కాళేశ్వరరావుగారు సంతోషంతో ఉప్పొంగిపోయారు.

"హిందువుల పుణ్యక్షేత్రమయిన కాశీనగరంలో హిందూ విశ్వవిద్యాలయంలో మొట్టమొదటి హరిజన విద్యార్థిని చేర్పించిన గౌరవ ప్రతిష్ఠలు ఆంధ్రదేశానికి దక్కాయి - ఆంధ్రులు ఉదార స్వభావులనీ, తీవ్ర సంస్కారపరులనీ మనకి మంచిపేరు వచ్చింది..." అంటూ తనసంతోషాన్ని ప్రకటించారు కాళేశ్వరరావుగారు.

అంతలోనే ఆయనకు విచారం కమ్ముకొచ్చింది.

"అంతమంది అగ్రవర్ణాల వారిమధ్య ఈ కుర్రవాడు నెగ్గుకు రాగలడా..." అని! కానీ, కూర్మయ్యగారి శక్తియుక్తులమీద అపారమైన నమ్మకంతో సమాధాన పడ్డారు.



పొంగిన సముద్రజలాల మధ్య వంటరి పడవలా వుంది బెనారస్ హిందూ యూనివర్సిటీలో కూర్మయ్యగారి పరిస్థితి...

"మనిషి ఎదురైతే 'మాలదర్శనం' అనేవాడొకడు; 'సచేల స్నానం' చెయ్యాలనే వాడింకొకడు... మైలపడ్డానని వాగేవాడు మరొకడు...

కూర్మయ్యగారికి సీటు ఇచ్చేప్పుడు మాలవ్యాగారు సంకోచించింది అందుకే...

యూనివర్సిటీలో ఎక్కువ మోతాదులోనే ర్యాగింగ్‌కు కూర్మయ్యగారు బలయి పోయే ప్రమాదం వుంది. ఆయన దాన్ని తట్టుకొని నిలబడగలరా లేదా అనేది ప్రశ్న!

అట్టడుగుపొరల్ని పైకి తేవాల్సిన వచ్చినప్పుడు పైపొరలు కిందకి పోవాల్సి వస్తుందని భయపడి మొరాయిస్తాయి. అవి కల్గించే వత్తడిని తట్టుకొనే శక్తి కింది పొరలకుండాలి.

రెండు సంవత్సరాల పాటు సబర్మతి ఆశ్రమంలో కూర్మయ్యగారికి గాంధీజీ ఇచ్చిన శిక్షణ ఇదే! అది బెనారస్ విశ్వ విద్యాలయ స్వభావాన్నే మార్చివేసింది!

ఎందుకైనా మంచిది... యూనివర్సిటీలో ఘర్షణ వాతావరణం లేకుండా ప్రశాంతంగా వుండాలి... కొంత కాలం దూరంగా విడిగా కూర్చోమన్నారు కూర్మయ్య గారిని యూనివర్సిటీ అధికారులు.

మాలవ్యాగారి గుర్రపు బగ్గీని నడిపే సులేమాను ఇంటిదగ్గర స్వంతంగా వండుకొని భోజనంచేసి ఆరుమైళ్ళ దూరం రోజూ యూనివర్సిటీకి నడిచివస్తున్నారు కూర్మయ్యగారు.

"ఈ పరిస్థితి ఎల్లకాలం వుండనవసరంలేదు. మనోనిబ్బరంతో వ్యతిరేక వాతావరణాన్ని కూడా అనుకూలంగా మలచుకోవాలి..." అనుకొన్నారాయన.

అగ్రవర్ణాల విద్యార్థులతో సమానమైన జ్ఞానం వుంది. తెలివితేటలున్నాయి. మేథాశక్తివుంది. కులం ఒక్కటే లేదు... అసాధారణమైన తన నాయకత్వ ప్రతిభకు 'కులం' అనే కుంటిసాకు అడ్డుకాకూడదని నిర్ణయించు కున్నారు.

ఎదుటివ్యక్తికి తనతో అవసరం వుంటేగానీ, ఎవరూ తనదగ్గరకు రారు...

వాళ్ళ దగ్గర లేనిదీ... తన దగ్గర మాత్రమే వున్నదీ... ఏదో వుంటేనేగాని, అవతలి వ్యక్తికి తనతో అవసరం పడదు...

వాళ్ళ దగ్గర లేనిది...., తన దగ్గర మాత్రమే వున్నది... ఏమిటీ...

నాయకత్వపు లక్షణం!! లీడర్‌షిప్ క్వాలిటీ... అది ప్రత్యేకంగా ప్రయోగించే అస్త్రం కాదు. దానికదే ఉపయోగించబడ్తుంది... అదే కూర్మయ్యగారిని లీడర్‌ని చేసింది.

విద్యార్థి నాయకుడిగా కూర్మయ్యగారు తన మకాంని అనతి కాలంలోనే యూనివర్శిటీ హాస్టల్‌కు మార్చేయగలిగారు.

అందరు స్టూడెంట్లతో కలసి హాస్టల్లోనే భోజనం చెయ్యగలుగుతున్నారు. ఆయనతో కలిసి తినడానికి ఎవరూ అభ్యంతరం పెట్టడం లేదిప్పుడు...

ఇదంతా ఎలా సాధ్యం అయ్యింది... మాలవ్యాగారిక్కూడా అంతుపట్టలేదు.

ఒక సంవత్సరం తర్వాత...

కూర్మయ్యగారు చేరిన రెండోసంవత్సరంలో హిందూవిశ్వ విద్యాలయంలో విద్యార్థిగా జగజ్జీవనరాంగారు కూడా చేరారు. ఆయన చేరేనాటికే దాదాపుగా పంచముల వ్యతిరేక వాతావరణం యూనివర్శిటీలోంచి తొలగిపోయేలా చేయగలిగారు కూర్మయ్యగారు.

"అదీ ఒక దీనజనోద్ధారకుడి ప్రతిభ! గాంధీగారు సెలెక్ట్‌చేసి పంపించారంటే మాటలా? మట్టిలో మాణిక్యాల్ని వెదకడం ఆయనకే తెలుసు!! అదే సాదాసీదా వ్యక్తులైతే ఈ పాటికి రైలెక్కి బెజవాడ పారిపోయేవారు..." అని చెప్పుకున్నారు యూనివర్శిటీలో విద్యార్థులు కూర్మయ్యగారి గురించి!

"మోహన్ దాస్ కరంచంద్ గాంధీ, మదనమోహన్ మాలవ్యా...ఈ ఇద్దరు మోహన్‌ల మోహనరాగం వేములకూర్మయ్య..." అనుకున్నారంతా!!

మంచు తెరలు విడిపోయిన తర్వాత పావన గంగా తరంగాలు వెల్లువై పరుగులుతీస్తున్నాయి. పండగరోజు కొత్తబట్టలు కట్టుకొని ఆడుకొంటున్న పిల్లల్లా కాశీనగరం వీధులు కోలాహలంగా వున్నాయి. అన్నిదారులూ ఆ కాశీ విశ్వేశ్వరుని వైపే దారితీస్తున్నాయి.

గుడిదాక వెళ్ళారు కూర్మయ్యగారు. కానీ. ఆ విశ్వేశ్వరుడు ఆయన భార్య విశాలాక్షిదేవి ఎలావుంటారో కూర్మయ్యగారికి తెలీదు! గుడిలోకి ఏనాడూ ఆయన వెళ్ళలేదు! వెళ్ళే అవకాశం ఆనాటికి ఆయనకు లేదు-



# 3

1929

బెజవాడలో ఆది ఆంధ్ర మహాసభ 7వ వార్షికోత్సవాలు జరుగుతున్నాయి.

బెనారస్ హిందూయూనివర్శిటీలో న్యాయశాస్త్రం చదువుతున్న విద్యార్థి వేములకూర్మయ్యగారు ఈ మహాసభలకు ఆహ్వానసంఘం అధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు.

పన్నెండేళ్ళక్రితం, 1917లో మొదటిసారిగా బెజవాడలో కాళేశ్వరరావుగారూ, నాగేశ్వరరావు పంతులుగారూ నిర్వహింపచేసిన ప్రథమ ఆది ఆంధ్రుల మహాసభ స్ఫూర్తితో ప్రతిఏడాదీ ఇంచుమించుగా ఆది ఆంధ్రుల మహాసభలు జరుగుతూనే వున్నాయి.

పత్తిపాటి ఆదినారాయణగారు సభాధ్యక్ష స్థానంలో వున్నారు.

వేముల కూర్మయ్యగారు తన స్వాగతవచనాలలో ఆ మహా సభ ధ్యేయాన్ని వివరించారు. సభలో ముఖ్యంగా తీసుకో దగిన నిర్ణయాలను వాటి ఆవశ్యకతని సభ్యులందరికీ అర్థం అయ్యే భాషలో తెలియజెశారు.

"రామిగాడు, సుబ్బిగాడు అని పిలిపించుకునే స్థితినుంచి మనం చాలా ఎదిగాం. ఒరేయ్ ఒసేయ్ వంటి పదాలతో మనల్ని అవమానించడం పాపం అనీ అంటరానితనం పాటించకూడదనీ ఇప్పుడు చాలా మంది గ్రహించారు. అగ్రవర్ణాలవారిలో క్రమేణా కొద్దికొద్దిగా మార్పువస్తోంది. అయితే, గ్రామీణ ప్రాంతాలలో ఈ మార్పు అంతగా లేదు... అందుకే సంస్కరణలు వేగిరంగా జరగాలని మనం అందరం డిమాండు చేయాలి.

మన వాళ్ళలో చాలామంది కనీసం హైస్కూలు వరకూ అయినా చదువుకోవాలనే ఆసక్తి కనపరుస్తూన్నారు. వాళ్ళని మనం ప్రోత్సహించాలి.

ఎవరో వచ్చి ఏదో మేలు చేస్తారని మనం ఇలా ఎంతకాలం ఎదురుచూస్తాం...? మనకోసం మనం ఏదైనా చేసుకోగలగాలి. మనలో మనం ఐకమత్యంగావుండి కలిసి పనిచేస్తే ఏదీ అసాధ్యంకాదు..." అన్నారు కూర్మయ్యగారు తన ప్రసంగంలో!

26 సంవత్సరాల యువకుడు కూర్మయ్యగారు గంభీరమైన తనమాటలతో, ఆకర్షణీయమైన తన ముఖవర్చస్సుతో అక్కడ అందరినీ ఆకట్టుకొన్నారు.

అధ్యక్షులు పత్తిపాటి ఆదినారాయణగారు ఆదిఆంధ్రులకోసం... ముఖ్యంగా ఆడపిల్లలకోసం ఒక హాస్టలును పెట్టి నడిపించాలని సూచించారు.

ఆది ఆంధ్రుల సంఘం పక్షాన, హాస్టల్ పెట్టే విషయమై కొంతచర్చజరిగింది.

యువకుడు, చదువుకొన్నవాడు, వ్యవహార దక్షుడు ప్రస్తుతం ఆది ఆంధ్రుల్లో నలుగురికి తెలిసిన వ్యక్తి కూర్మయ్యగారే కాబట్టి, ఆ బాధ్యతని ఆయన్నే తీసుకోమని కోరారు సభలో పాల్గొన్న ఇతర వక్తలు.

"స్వంత ఆదాయ మార్గాలేవీ లేని నిరుపేదని... పైగా స్టయిఫండ్ మీద చదువుకొంటున్న విద్యార్థిని....బెజవాడలో ఉండేది తక్కువ" అన్నారు కూర్మయ్యగారు.

"ప్రజాసేవ ధనికులు మాత్రమే చేయవలసిన విషయం అని మీ అభిప్రాయమా?" అడిగారు సభలోనే పత్తిపాటి ఆదినారాయణగారు.

కూర్మయ్యగారు మాట్లాడలేదు.

"చేపపిల్లకు ఈత నేర్పాలనుకోవడం ఎంత అవివేకమో... నాయకుడిగా ఎదిగిన వ్యక్తికి నాయకత్వం నేర్పాలనుకోవడం కూడా అంతే అవివేకం..." అన్నారాయన. ఇంక కూర్మయ్యగారు అంగీకరించినట్టే అయ్యింది. చెయ్యబోయే పనిలో కష్టాలకన్నా, దానివల్ల పదిమందికీ కలిగే ప్రయోజనం గురించి ఆలోచించటం మంచిదని నిర్ణయించుకొన్నారాయన. ఆది ఆంధ్ర బాలికల వసతి గృహం స్థాపనకు కూర్మయ్యగారి నేతృత్వంలో జరపాలని ఏకగ్రీవంగా తీర్మానం ఆమోదం పొందింది.

శ్రీరామదూత ఆంజనేయుడి తల్లి... అంజనాదేవి ఆది ఆంధ్రజాతికి చెందిన స్త్రీ! ఆది ఆంధ్రులకందరికీ గర్వకారణమైన మాతృమూర్తి మానవాళి గర్వించదగ్గ కొడుకుని కన్నదామె! ఆమె పేరుతో "అంజనాదేవి ఆది ఆంధ్ర బాలికల వసతి గృహం-" అని పేరుపెడితే బావుంటుంది అన్నారు కూర్మయ్యగారు. అందరూ కరతాళ ధ్వనులతో ఆమోదించారు.

సభముగిసింది. కానీ, తాహతుకు మించిన పెనుభారం కూర్మయ్యగారిపైన పడింది!

ఆంజనేయుడికి గురువూ దైవమూ అన్నీ రాముడే అయినట్లే కూర్మయ్య గారికి అయ్యదేవర కాళేశ్వరరావుగారే సర్వస్వం.

కాళేశ్వరరావుగారిని కలిసి - ఆది ఆంధ్రుల మహాసభ చేసిన తీర్మానాల గురించి పూసగుచ్చినట్లు వివరించారు."అంజనాదేవి ఆది ఆంధ్ర బాలికల హాస్టల్ పెట్టాలి మనం ఇప్పుడు - " అన్నారు.

"సంతోషం" అన్నారు కాళేశ్వరరావుగారు ఆయన జీవితంలో 'లేదు' అనడం ఏనాడూ లేదు. పేద ప్రజలకు, ముఖ్యంగా పంచములకు మేలుజరిగే ఏ పనైనా ప్రోత్సహించడం ఆయన అలవాటు.

"మీరే అధ్యక్షులుగా వుండాలి ఈ హాస్టల్‌కి" కూర్మయ్యగారు ప్రాథేయపడ్తూ అడిగారు.

"సరే! నువ్ కార్యదర్శిగా వుండు-" ఆజ్ఞాపించినట్లే అన్నారు కాళేశ్వరరావుగారు. ఇంతచిన్న విషయంగురించి అంత ఆలోచించేదేమీలేదన్నట్లు అభయం ఇచ్చారాయన! కాళేశ్వరరావుగారి మాటలు కూర్మయ్యగారికి శిరోధార్యం. ఆయన జీవితంలో ఇద్దరే ప్రముఖులు. ఒకరు కాళేశ్వరరావుగారు, రెండు గాంధీగారు అంతే!

అనుకొన్నట్లుగానే-అంజనాదేవి ఆది ఆంధ్ర బాలికల వసతిగృహాన్ని అయ్యదేవర కాళేశ్వరరావుగారి నేతృత్వంలో ప్రారంభించారు కూర్మయ్యగారు.

"నిమ్న వర్ణాల బాలికలు ఆరుగురు చదువుకోవటానికి ముందుకొచ్చారు. ఇది ఆరంభం మాత్రమే ఒక ఏడాది కాలంలో ఈ సంఖ్యని మనం పదిరెట్లయినా పెంచగలగాలి" అన్నారు కాళేశ్వరరావుగారు.

"ఒకమంచి కార్యక్రమాన్ని తలపెట్టినప్పుడు చేయూత నందించేందుకు దాతలకు కొరత వుండదు. ఆంధ్రదేశమంటే అన్నపూర్ణ. దేశభక్తిలో ఆంధ్రులు ఎవరికీ తీసిపోరు. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు పూనుకొంటే నిధులు కొరత వుండదు. చల్లపల్లి జమీందారు రాజా శివరామ ప్రసాద్ బహద్దూర్ గారు కూడా మన హాస్టల్ అభివృద్ధికి తనచేయూతనందిస్తానని వాగ్దానం చేశారు. మా గురుదేవులు కాళేశ్వరరావుగారు ఉండగా ఈ హాస్టల్ నిర్వహణ గురించి నాకు ఏ చింతా లేదు-" అన్నారు కూర్మయ్యగారు.

న్యాయశాస్త్రం ఒకవైపు చదూతూనే, శలవులకు బెజవాడవచ్చి, ఇక్కడ రాజకీయ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొంటూనే, అంజనాదేవి హాస్టల్‌ని నిర్వహించసాగారాయన!

సబర్మతి ఆశ్రమంలో కూర్మయ్యగారు గాంధీగారి శిష్యరికంలో పొందిన శిక్షణ వాస్తవ రూపు దాలుస్తోందని ఎంతగానో సంతోషించారు అయ్యదేవర కాళేశ్వరరావుగారు. పువ్వుపుట్టీ. పరిమళించీ, ఫలిస్తోందన్నదే ఆయన సంతోషం. ఈ ఫలాలు లోకానికంతా చెందాలి!

మొదట్లో ఈదా వెంకయ్యగారి నిర్వహణా సహకారంతో హాస్టలు నడిచింది.

1932లో శ్యామలాదేవి గారితో వివాహం అయ్యింది.

అప్పటినించి ఆ హాస్టలు నిర్వహణా బాధ్యతలు స్వయంగా ఆమే చేపట్టారు.

ఆమె అన్నపూర్ణ! ఒక దీనజన బాంధవుడి సహధర్మచారిణిగా బీదల సేవలో పునీతమైన స్త్రీమూర్తి ఆమె!

కూర్మయ్యగారి జీవితంలోకి ప్రవేశించిన నాటినుంచి ఆమె అలుపెరుగని సేవా పరాయణత్వంతో బాధ్యతలు నిర్వహించసాగారు.

ఆమెకూ అంతే! కులమతాలు లేవు. హాస్టలు నిర్వహణలో బీద విద్యార్థినులు ఏకులం వ్యక్తైనా సరే ఏ మతం వారైనా సరే ఆమె ఆదరించారు. కన్న బిడ్డల్లా పోషించారు.

వేలాది బీద విద్యార్థినులకు ఉచిత విద్యాదానం, అన్నదానం చేసిన మహనీయురాలు ఆమె!



1930 మార్చి 12

కన్జర్వేటివ్ పక్షనాయకుడు లార్డ్ విన్‌స్టన్ చర్చిల్‌గారు తన అద్భుతమైన వాగ్ధాటితో బ్రిటిష్ ప్రభుత్వాన్ని, అధికారుల్ని, ప్రజల్ని కూడా సమ్మోహితుల్ని చేస్తున్నాడు.

ప్రస్తుతం ఆయన ఉపన్యాసాలన్నీ భారతదేశానికి స్వాతంత్రం ఇచ్చే అంశం మీదే సాగుతున్నాయి.

"లేడీస్ అండ్ జెంటిల్‌మన్!" అంటూ ప్రసంగించడానికి ఉద్యమించేసరికి చర్చిల్‌గారిని వింటున్న జనం ఉత్తేజపూరితులౌతున్నారు.

"మన బ్రిటిష్ రాజ్యాన్ని ఇండియాలో గాంధీ రాజ్యంగా మార్చే ప్రయత్నాలు పరమ భయంకరంగా జరుగుతున్నాయి. దయచేసి గమనించండి నా ప్రియమైన ప్రజలారా! అన్నాడు చర్చిల్! ఆయన ప్రసంగిస్తున్న సభలో ఆయన మాటలు వింటున్న ఇంగ్లీషు జనానికి మతులు పోతున్నాయి.

"హిందూమతం ఆధిపత్యానికి ఇండియాలో క్రైస్తవుల్నీ, అస్పృశ్యుల్నీ అప్పగించేస్తే వారిగతి ఏమౌతుందో ఒక్కసారి ఆలోచించండి! భారతీయ సమాజంలో 30 శాతం మంది అస్పృశ్యులు ఉన్నారని అంచనా! అలాగే ఇండియాలో కనీసం 5 మిలియన్లమంది క్రైస్తవులున్నారు. మనం ఇండియాని గాంధీ అనే వ్యక్తికి అప్పగించేస్తే వాళ్ళంతా అనాధలుగా మిగిలిపోతారు! ప్రజలారా! దయచేసి అంతఘోరం జరగనీకుండా ఈ ప్రభుత్వాన్ని నిరోధించండి - అన్నాడు చర్చిల్.

చర్చిల్ ఉపన్యాసాల్ని బ్రిటిష్ పత్రికలు పతాక శీర్షికల్లో ప్రచురించసాగాయి. గాంధీ వ్యతిరేకతను అనవసరంగా నూరిపోసి భారతీయుల పట్ల ద్వేషభావాన్ని బ్రిటిష్ ప్రజల్లో రెచ్చగొడ్తున్నాడని కొన్ని పత్రికలు చర్చిల్‌ని విమర్శించాయి కూడా! "చర్చిల్ ఉపన్యాసాలు ఎంతగొప్పగా వుంటాయంటే, వినే వారికి ఇదంతా నిజమేననిపిస్తుంది-" అని వ్యాఖ్యానించాయి.

"1929 డిసెంబర్‌లో లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ సభల్లో బ్రిటిష్ జాక్‌ని తగలపెట్టారు. దానికి కారకుడుగాంధీ గారని చర్చిల్‌గారికి ఆయనపైన అంత ద్వేషం!!" అని వ్యాఖ్యానించాడొక ఇంగ్లీషు విలేఖరి!

"లాహోర్ కాంగ్రెస్‌లోనే సంపూర్ణ స్వరాజ్యం కావాలని తీర్మానించారు. కాంగ్రెస్ వారూ బ్రిటిష్‌వారూ శత్రువులుగా మారింది ఈ సంఘటన తర్వాతే!!" అన్నాడా విలేకరి!

"చర్చిల్ గారు రెండు ప్రధాన సూచనలు చేశాడు. రెండంచెలుగా ఈ ప్రతిపాదనలున్నాయి - భారతదేశంలో రాష్ట్ర ప్రభుత్వాలు (ప్రావిన్షియల్ ప్రభుత్వాలు) స్వేచ్ఛగా పరిపాలించుకోవచ్చు. కానీ, కేంద్రప్రభుత్వం బ్రిటిష్‌వారి అధికారంలో వుండాలి. రెండవది గాంధీగారు వ్యక్తి సత్యాగ్రహం వదిలేయాలి-" అని ఇండియాలో వార్తలొచ్చాయి.

"కానీ, ఆయన వాస్తవంగా కోరుతోంది 'గాంధీ-ఇజం' నాశనాన్నే -" కోపంగా అన్నారు నెహ్రూగారు. "పెద్దపులికి పిల్లి మాంసం పెడితే సంతృప్తి చెందుతుందా? ఈ గాంధీకూడా అంతే -" అని చర్చిల్‌గారు నోటికొచ్చినట్లు లండన్‌లో మాట్లాడుతున్నాడని తెలిసి గాంధీగారు కూడా చాలా బాధపడ్డారు. "భారతీయులకు స్వాతంత్రం ఇస్తే అస్పృశ్యులు బానిసలుగా మారిపోతారు-" అంటూ చర్చిల్ నోరుపారేసుకొన్నాడని భారతీయ పత్రికలు కూడా రాశాయి. చర్చిల్ మాటలు ములుకుల్లా భారతీయుల్ని బాధించసాగాయి.

"భారతదేశంలో అహింసామార్గాన అస్పృశ్యుల అభివృద్ధికి కాంగ్రెస్ చేస్తున్న కృషి ఏమిటో ప్రపంచానికి చాటి చెప్తాను-" ప్రతిజ్ఞగా అన్నారు గాంధీ!

"అస్పృశ్యులకు హరిజనులు గా నామకరణం చేస్తున్నాను" ప్రకటించారు గాంధీ!



గాంధీ మహాత్మా గాంధీమహాత్మా!
కాచి రక్షించు గాంధీ మహాత్మ!
డబ్బుగలోరు - దరికి రానీరు
ఈ గోరమేమి - మా నేరమేమి
గాంధీమహాత్మ - గాంధీ మహాత్మ
మాలమాదిగలం - మనుసులంగామా...
కుక్కలకన్నా తక్కువయ్యామా
గాంధీ మహాత్మా - గాంధీ మహాత్మా
మా మొరాలించ సామోరెదిక్కు

ఆ స్వాములోరి ఔతారమైన
గాంధీమహాత్మా - గాంధీ మహాత్మా
కాచి రక్షించు గాంధీ మహాత్మా"

బసవరాజు అప్పారావు గార్ల గొంతెత్తి పాడిన పాటలు తెలుగువారిని ఉర్రూతలూగిస్తున్నాయి.

గాంధీగారు పంచముల్ని "హరిజను"లుగా వ్యవహరించి హరిజన సేవని కాంగ్రెస్ ఉద్యమంలో ఓ భాగంగా ప్రకటించారు.

అంటరానితనాన్ని పాటించొద్దని, హరిజనుల సంక్షేమంకోసం పాటుపడమనీ కాంగ్రెస్ వారు ఊరూరా ప్రచారం చేస్తున్నారు...

అది -సెప్టెంబర్ 1932

రాంసే మెకడోనాల్డ్ అధికార మత నివేదిక దేశంలో కొత్త కల్లోలాన్ని రగిల్చింది.

ఆంగ్లో ఇండియన్లకు, యూరోపియన్లకు, క్రైస్తవులకు ముస్లింలకు, ట్రేడర్లకు, అస్పృశ్యులకు, సవర్ణహిందువులకు... వేర్వేరు నియోజక వర్గాలను కేటాయించటం ఈ నివేదికలో ప్రధాన అంశం.

"భారతీయుల్ని ఇలా వర్గాలుగా విడగొడతారా...?" అని ఆగ్రహం ప్రకటించారు గాంధీ. హరిజనుల్ని హిందువుల్లోంచి విడదీసి వారిని వేరే జాతీయులుగా ఎలా గుర్తిస్తారు...?" అని నిలదీశారాయన.

" హిందూమతంలో అంటరానితనాన్ని ముందు నిషేధించండి. పంచములకు హిందువునని అనిపించుకోవటం అప్పుడు గర్వకారణం-" అన్నారు. డా॥బాబాసాహెబ్ అంబేద్కర్. ఈ విషయంలో గాంధీజీతో పూర్తిగా వ్యతిరేకించి పంచముల ప్రత్యేక హక్కులకోసం పోరాడాలనే దృఢ సంకల్పంతో నిల్చున్నారు డా॥ అంబేద్కర్.

యమ్.సి.రాజా వంటి సంస్కరణవాదులు గాంధీగార్ని బలపరిచారు.

"హరిజనుల్ని హిందువులలోంచి విడదీసి. బ్రిటిష్ అనుకూలురుగా మార్చాలనేదే ఈ ప్రతిపాదనలోని ఆంతర్యం" అని గాంధీజీ విస్పష్టంగా ప్రకటించారు. బ్రిటిష్ వారి కుయుక్తుల్ని అంబేద్కర్గారు గ్రహించలేకపోతున్నారని కాంగ్రెస్ వాదులు భావించసాగారు.

"హరిజనులకు ప్రత్యేక సీట్లను కేటాయించటానికి నేను వ్యతిరేకం కాదు. కానీ. అది ఉమ్మడి నియోజకవర్గాలలో జరగాలి-" అన్నారు గాంధీ.

యరవాడ సెంట్రల్ జైల్లో గాంధీజీ...

జైలులోపలే గాంధీగారితో చర్చలు జరుపుతున్న వివిధ వర్గాల నాయకులు.

వచ్చే పోయే వారితో యరవాడ సెంట్రల్ జైలుకూడా కోలాహలంగా వుంది.

త్వరగా మెకడోనాల్డ్ నివేదికను ఆమోదించమని బ్రిటిష్‌వారి వత్తిడి... వైస్రాయ్ ఈ విషయంలో అత్యుత్సాహం ప్రదర్శిస్తున్నాడనీ దేశాన్ని కులాలుగా, వర్గాలుగా విడగొడ్తున్నాడని గాంధీగారి ఆరోపణ.

అఖిలభారత అస్పృశ్యత లీగ్, అంటరాని సేవకుల సంఘం వంటి హరిజన సంఘాలు గాంధీగారిని బలపరిచాయి.

కానీ, అందరికి ఆమోదయోగ్యమైన ఒక ఒడంబడిక లాంటిది ఏదీ కుదరలేదు.

"మెకడోనాల్డ్ కేటాయించదలచిన సీట్లకన్నా ఎక్కువసీట్లు హరిజనులకు కావాలి! అదీ ఉమ్మడి నియోజక వర్గాల్లో మాత్రమే!" అని గాంధీగారు మళ్ళీ డిమాండ్‌చేశారు.

"మెకడోనాల్డ్ ప్రత్యేకనియోజక వర్గాలు కేటాయించదలచిన ఆంగ్లో ఇండియన్లుకానీండి, యూరోపియన్లు కానీండి, క్రైస్తవులు కానీండి, ముస్లింలు కానీండి, వ్యాపారులు కానీండి సవర్ణహిందువులు కానీండి... వీరంతా ధనవంతుల జాబితాలోకి వచ్చేవారు. దేశంలో అదృష్టవంతులంటే ఇంకా బావుంటుంది. కానీ, ప్రత్యేక నియోజక వర్గాలను కేటాయించి, హిందువుల్లోంచి హరిజనుల్ని విడదీస్తే హరిజనులు ఈ అదృష్టవంతుల జాబితాలోకి రాగలుగుతారా...? ఉమ్మడి నియోజక వర్గాల్లో ప్యానెల్ అభ్యర్థులుగా హరిజనుల్నికూడా కలుపుకొని, రాజకీయ పక్షాలు హరిజన అభ్యున్నతిని సాధించాలి. వారిని అదృష్టవంతులుగా తీర్చిదిద్దాలి..." అని కాంగ్రెస్ వారి వాదన.

కానీ, ఏకగ్రీవ ఒప్పందాలు ఏవీ జరగలేదు...

చేసేదిలేక నిరాశతో మళ్ళీ నిరశన దీక్ష ప్రారంభించారుగాంధీ!

గాంధీగారు నిరవధిక నిరాహారదీక్ష ప్రారంభించారనే సరికి సహజంగానే దేశ ప్రజలందరూ ఆందోళనచెందారు. మెకడోనాల్డ్ నివేదిక అమలు జరగాలని కోరేవారు చికాకు పడ్డారు.

గాంధీగారి దీక్ష నిరవధికంగానే సాగుతోంది.

ఇదంతా అనవసర గందరగోళానికి దారితీస్తోందని భయపడ్డ బ్రిటిష్ ప్రభుత్వం యరవాడ జైలునుంచి గాంధీగారిని విడుదల చేసింది.

అయినా సరే, పూనేలోనే వుండి నిరాహారదీక్ష కొనసాగించసాగారు గాంధీ!

డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ గారుకూడా ఇతర హరిజన నాయకులతో ఎంతో లోతుగా ఈ విషయమై చర్చలు జరిపారు.

చర్చలు సాగుతూనే వున్నాయి.

గాంధీగారి నిరాహారదీక్ష కొనసాగుతూనే వుంది...

కానీ... ఇదంతా తమ కోసమేనని, తమ ఉద్ధరణ కోసమే దేశంలో ఇంత తర్జన భర్జనలు సాగుతున్నాయనీ... దేశంలో మూలమూలల్లోవుండే మాలపల్లెల్లోనూ, మాదిగ గూడెంలలోనూ ఎవరికీ తెలీదు.

వారు ఎప్పటిలాగానే అగ్రహారం వీధుల్లో నడవకుండా పక్కనుంచే పోతున్నారు ఊరి దేవాలయాలకూ, ఊరుమ్మడి బావులకూ దూరంగా...!!

చట్టసభల్లో సీట్లు తెచ్చుకొని ఊళ్ళేలవచ్చనే ఊహే వారికిలేదు...



"హరిజనుల్ని హిందువుల్లోంచి విడదీసే ఏ చర్యనైనా ప్రాణాలొడ్డి ప్రతిఘటిస్తా-" గాంధీగారి తీవ్రప్రకటనతో అవాక్కయ్యాడు వైస్రాయి.

"కథ అడ్డం తిరిగింది!" అనుకున్నాడు.

"బ్రిటిష్ ప్రభుత్వం కన్నా గాంధీగారి నిర్ణయానికి బాధపడ్డ కాంగ్రెస్ వారే ఎక్కువమంది వున్నారనిపిస్తోంది! స్వాతంత్ర్యం తెచ్చుకోవటం లాంటి పెద్ద ఘనకార్యాన్ని వదిలేసి ఈ ప్రత్యేక నియోజక వర్గాల వంటి చిన్నచిన్న విషయాల కోసం ప్రాణం తీసుకోవడం ఏమిటీ... ఈ గాంధీజీ... అని కాంగ్రెస్ పెద్దలే చాలామంది విసుక్కొంటున్నారు. నిజానికి గాంధీగారి ఆలోచనల్లోని లోతు వారికి అంతుపట్టటం లేదు. తన ప్రతిపాదనని అంగీకరించేవరకూ దీక్షని విరమించేది లేదని స్పష్టం చేస్తున్నారు. ఏం చెయ్యాలో పాల్పోవటం లేదు" అన్నారు మౌలానా ఆజాద్ గారు బాధగా!

కానీ, రోజులు గడిచేకొద్దీ సమస్యలోని ప్రాముఖ్యత అట్టడుగు ప్రజల్లోకి చేరిపోతోందని భయపడసాగింది బ్రిటిష్ ప్రభుత్వం!

ఏ అస్పృశుల్ని హిందువుల్లోంచి విడగొట్టాలని పథకం పన్నారో ఆ అస్పృశ్యులు హిందువులకి, ముఖ్యంగా కాంగ్రెస్ వారికి మరింత దగ్గరయ్యే ప్రమాదం ముంచుకొచ్చింది-

మెకడోనాల్డ్ నివేదికను కాంగ్రెస్‌వారు పూర్తిగా తిరస్కరిస్తే బావుణ్ణని కోరుకోసాగాడు వైస్రాయి. యథా పూర్వస్థితే మేలు... అనుకున్నాడాయన.

ఎంతగట్టిగా దాన్ని ఆమోదించమని వత్తిడి చేస్తే,అంత ఎక్కువగా కాంగ్రెస్‌వారు మెకడోనాల్డ్ నివేదికను తిరస్కరిస్తారని భావించాడు వైస్రాయి. ఆ మేరకు వత్తిడి తీవ్రతరం చెయ్యసాగాడు.

ఉమ్మడి నియోజకవర్గాల్లో హరిజనులుపోటీ చేసే సీట్ల సంఖ్య పెంచితీరాలని తన డిమాండ్‌ని పునరుద్ఘాటించారు గాంధీజీ.

ఆయన నిరాహారదీక్ష కొనసాగుతూనే వుంది.

రోజులు అనవసరంగా గడిచిపోతున్నాయని చర్చలపేరుతో కాలయాపన చేసి, గాంధీగారి ప్రాణాలు బలితీసుకుంటున్నారనీ భావించుకోసాగారు దేశప్రజలు.

అందరి దృష్టి పూనే నగరం మీదే వుంది. ఆఖరికి ఆశాజనకమైన ఒప్పందం కుదిరింది!

"డా॥ అంబేద్కర్‌గారి నాయకత్వంలో హరిజన నాయకులంతా కలిసి ఏకాభిప్రాయంతో ఒక ప్రణాళికను రూపొందించాం" వివరించారు యమ్.సి.రాజా గాంధీగారికి.

నిరశనవ్రతంలో వున్న గాంధీగారు నీరసంగా ఒకవైపుకి తిరిగి ఒత్తిగిలి పడుకున్నారు. ఆ మాట వినగానే కొండంత ఉత్సాహంగా లేచికూర్చున్నారు.

"ఈ ప్రణాళిక ప్రకారం హరిజనులకు ఉమ్మడి నియోజక వర్గాలలోనే ప్రత్యేకంగా పోటీ చేసే అవకాశం కల్పించటం... హరిజనులు పోటీచేసే సీట్లసంఖ్యను పెంచటం.. ఈరెండు కోర్కెలను డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ తదితర హరిజన నాయకులంతా బలపరిచారు-" అన్నారాయన.

గాంధీ గారి నేత్రాలు ప్రకాశవంతంగా వెలిగాయి. తల్లినుంచి లాక్కుపోతున్న బిడ్డల్ని తల్లికే అప్పగించినంత సంబరపడిపోయారు గాంధీ!

ఎంతో ఆనందంగా నిరశన దీక్ష విరమించారు.

"పూనే నగరంలో కుదిరిన ఒడంబడిక కాబట్టి దీన్ని పూనే ఒడంబడిక అందాం..." అన్నారు గాంధీ.

మెకడోనాల్డ్ అవార్డుకు ఈ పూనాపాక్ట్ ఒక సవరణంగా వైస్రాయి కూడా అంగీకరించాడు."హరిజనుల్ని కాంగ్రెస్‌వాళ్ళు గ్రద్దల్లా తన్నుకుపోతున్నారు - అనేది ఆయనబాధ" -అని వ్యాఖ్యానించాయి పత్రికలు.

"హరిజనోద్యమానికి ఈ పూనా ఒడంబడిక ఊపిరి పోస్తుందని ఆశిస్తున్నాను-" అన్నారు గాంధీజీ.

పూనా ఒడంబడిక జరగటంతోనే దేశంలో మారుమూల ప్రాంతాల్లో నివసించే హరిజనుల్లోకూడా ఒకవిధమైన కదలిక ప్రారంభం అయ్యింది. ఆత్మగౌరవం, ఆత్మాభిమానం వంటివి తమకూ వున్నాయన్న సంగతిని వారూ గుర్తించటం ప్రారంభించారు.

హరిజనుల్ని అవమానించటం, ఇకపై మంచిదికాదని, అది అమానుషమనీ అగ్రవర్ణాల వారుకూడా గట్టిగా గుర్తించేందుకు ఈ ఒడంబడిక కొంత వరకూ దోహదపడిందనే చెప్పాలి.

ముఖ్యంగా మధ్య భారతదేశం,దక్షిణ బీహార్, ఒరిస్సాకొండ ప్రాంతాలలోని వెనుకబడిన తెగలలో "జాతీయతాభావం" గురించిన అవగాహన ఏర్పడింది.

ఇందుకు ప్రధాన కారకుడు గాంధీ...

అప్పటిదాకా మధ్యతరగతి మేధావులకే పరిమితమైన గాంధీగారి పేరుప్రతిష్టలు అత్యంత మారుమూలప్రాంతాల్లోకి కూడా విస్తరించాయి. ఈ సంఘటనతో సంస్కరణలను అందిపుచ్చుకొంటూ, బ్రిటిష్‌వారిని వ్యతిరేకిస్తూ, జాతీయ ఉద్యమంలో పాల్గొంచుకొంటూ ముందుకురావాలని హరిజనులు గ్రహించేందుకూ అవకాశం కల్గింది.

క్రైస్తవమతాధిపతులు వెరియర్ ఎవెలిన్, షాంరావు హివలె... వంటివారు కూడా గాంధీమార్గాన నడవటంతో కాంగ్రెస్ ఉద్యమానికి కొత్త ఊపువచ్చింది.

బ్రిటన్‌లో భారతీయ వ్యవహారాలకు సంబంధించిన సెక్రటరీగారు ఇదంతా పరిశీలించి ప్రభుత్వానికి ఒక నివేదిక అందించాడుట - "భారతదేశంలో కాంగ్రెస్‌వారు స్వాతంత్రం సంగతి వదిలేసి గాంధీగారి హరిజన సేవా కార్యక్రమాలకు అధిక ప్రాధాన్యత ఇస్తున్నారు"-అని!



1932 అక్టోబర్ 16.

'ఆంధ్రరాష్ట్ర హరిజనోద్ధరణ సంఘం' పనిచేయటం ప్రారంభించింది.

"కాంగ్రెస్ హరిజన విభాగంగా ఈ మహా సంస్థను మనందరం తీర్చిదిద్దాలి... కులమతాలతో నిమిత్తంలేకుండా, హరిజనుల ఉద్ధరణ కోసం పాటుపడదలచిన వారందరినీ మనం ఇందులో చేర్చుకోవాలి. ప్రత్యేకించి హరిజనులకు ఈ సంఘంలో ప్రముఖస్థానాన్ని కల్పించాలి..." అన్నారు ఆంధ్రరాష్ట్ర హరిజనోద్ధరణ సంఘం అధ్యక్షులు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు "హరిజన సేవ చేయటానికి అందరికన్నా ముందువరసలో నిలబడి శక్తివంచనలేకుండా పాడుపడ్తాం" అన్నారు రాష్ట్ర కార్యదర్శి మాగంటి బాపినీడుగారు.

సంయుక్త కార్యదర్శిగా వేములకూర్మయ్యగారు ఎన్నికైనారు. మరో సంయుక్త కార్యదర్శిగా నరాలశెట్టి దేవేంద్రుడుగారు పనిచేస్తున్నారు.

"పరుసవేది తాకితే ఇనుముకూడా బంగారం అవుతుంది. గాంధీగారి పిలుపుసోకితే శతాబ్దాల పెనునిద్ర ఒక్కసారి విదుల్చుకొంటుంది ..." అన్నారు కూర్మయ్యగారు.

బెనారస్ విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రం చదువుతూనే హరిజనోద్ధారణ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనసాగారు కూర్మయ్యగారు.

"హరిజనులు దేవాలయాలలోకి ప్రవేశించాలి. తమ ఇష్టదైవాన్ని స్వయంగా అర్చించుకోవాలి. అంటరానివాళ్ళంటూ హరిజనుల్ని ఎవ్వరూ ఎక్కడా నిరోధించడానికి

వీల్లేదు. అలాంటి సమాజాన్ని సృష్టించటం మనధ్యేయం. అందుకోసం మన హరిజనోద్ధరణ సంఘం కాంగ్రెస్ మద్దతుతో ఎంతటి త్యాగానికైనా వెనుదీయకుండా ముందుకు నడవాలి..." అన్నారు కూర్మయ్యగారు.

కమతం షణ్ముగంగారి నందనారు చరిత్ర, మంగిపూడి వెంకటేశ్వర శర్మగారి నిరుద్ధభారతం గ్రంథాలను అధికంగా ముద్రింపచేసి అందరికీ పంచాలని నిర్ణయించారు.

గంగాధర శివ, కుసుమ ధర్మన్న పోలుకొండ భద్రయ్య, గొల్లచంద్రయ్య కుసుమ సుబ్బారాయుడు, సుంద్రు వెంకన్న... వంటి హరిజన మేథావులు హరిజనోద్ధరణ సంఘానికి బాసటగా నిలబడ్డారు.

హరిజన దేవాలయ ప్రవేశాన్ని మెట్టమొదటి కార్యక్రమంగా చేపట్టవలసిందిగా కూర్మయ్యగారు సభాధ్యక్షులు నాగేశ్వరరావు గార్ని కోరారు.

అందుకు సంబంధించిన బాధ్యతలు కూర్మయ్యగారికే అప్పగించారు. ఊరూరా హరిజన సంఘాలేర్పరచి దేవాలయాలపాలక వర్గాలతో చర్చలు జరిపి హరిజనుల్ని దేవాలయాలలో ప్రవేశింపచేయటం, హరిజనులుకూడా నిర్భయంగా నిలబడి, ఐకమత్యంగా వ్యవహరిస్తూ దేవాలయ ప్రవేశ ఉద్యమానికి సహకరించేలా చూడాలని కూడా కూర్మయ్యగారిని కోరారు.

చిన్నవయసులోనే పెద్దబాధ్యతలు నెత్తినవేసుకొంటూ 'సరే'నన్నారాయన.

గాంధీమార్గాన హరిజన సేవ చేయటమే ఆయన ఏకైక లక్ష్యం... ఈ మార్గాన ఆయనకు అలసట అనేదే లేదు.

"హరిజన దేవాలయ ప్రవేశ ఉద్యమం నీ జీవితానికి గొప్ప మలుపుగా భావించు కూర్మయ్యా! ఇంతకన్నా మహత్తరమైన అవకాశం ఇంకొకటి రాదు. పూనా ఒడంబడికని దృష్టిలో పెట్టుకొంటే, హరిజన నాయకుడిగా రాజకీయాల్లో రాణించే అవకాశం నీలాంటిహరిజన యువకులకే వుంది. ఈ ఉద్యమం ద్వారా ఇప్పటినించే ప్రజల్లోకి వెళ్ళి పనిచేయడం వలన ప్రతివ్యక్తితోనూ వ్యక్తిగత పరిచయాలు, స్నేహాలూ నీకు లభిస్తాయి. నీ భవిష్యత్తుకు ఇదే పునాది. గాంధీసందేశాన్ని చిట్టచివరి పూరిగుడిసె వరకూ తీసుకు వెళ్ళు. వచ్చేప్పుడు వారి అభిమానాన్ని ఆప్యాయతనీ కొనితెచ్చుకో..." ఎంతో అనునయంగా వివరించిచెప్పారు కాశీనాధుని నాగేశ్వరరావుగారు కూర్మయ్యగారికి!

ఆనాటి నించీ, చివరి ఊపిరివరకూ కూర్మయ్యగారు ఏనాడూ వెనుదిరిగి చూడలేదు అభిప్రాయాలను మార్చుకోలేదు. సిద్ధాంతాలను వదులుకోలేదు.

గాంధీజీతో ముడిపడ్డ ఆయన రాజకీయ జీవితం చివరిదాక గాంధేయుడిగానే నడిచింది!!



1932 సుబ్రహ్మణ్య షష్ఠి

కృష్ణాజిల్లా ఘంటశాల సుబ్రహ్మణ్యేశ్వర స్వామి దేవాలయంలో భక్తుల ఎద్దడి ఎక్కువగా వుంది.

గుడిలోపలంతా భక్తులే! గుడిబయటా భక్తులే! అస్పృశ్యులు బైటనుంచే దేముడికి దణ్ణం పెట్టుకొని కొబ్బరికాయలు కొట్టి వెళ్ళిపోతున్నారు.

"హరిజన దేవాలయప్రవేశం దేశంలోనే ముందుగా కృష్ణాజిల్లాలో ప్రారంభం అయ్యింది. ఇతర ప్రాంతాల్లో కన్నా మన జిల్లాలోనే ఎక్కువ దేవాలయాల్లోకి హరిజనుల్ని అనుమతించారు. త్యాగధనుల పుట్టినిల్లు... బుద్ధుడి ప్రవచనాలను ఆచరించిన పుణ్యభూమి... ఘంటసాల... ఈ విషయంలో అందరికి ఆదర్శ ప్రాయంగా వుండాలి ఈ సుబ్రహ్మణ్యేశ్వర షష్ఠి పర్వదినం రోజున హరిజనుల్ని గుడిలోపలికి వెళ్ళేలాగా అనుమతించండి..." ప్రాధేయపడ్తూ అడిగారు వేముల కూర్మయ్యగారు.

ఆంధ్రప్రాంత హరిజన సేవాసంఘం సహకార్యదర్శి, హరిజన నాయకుడు, గాంధేయవాదిగా పేరుబడిన యువనేత వేముల కూర్మయ్యగారు హరిజన దేవాలయ ప్రవేశ కార్యక్రమాన్ని మొదటి ప్రాధాన్యతగా తీసుకుని కృషి చేస్తున్నారనీ, ఆయనే స్వయంగా దేవాలయప్రవేశం చేస్తున్నారని వార్తా పత్రికలు కూడా రాసి, ఉద్యమాన్ని ప్రోత్సాహిస్తున్నాయి.

ప్రజల్లో మిశ్రమ స్పందన కన్పిస్తోంది. అంగీకరించే వాళ్ళసంఖ్య బాగానే వుంది. కానీ, హరిజనుల్ని దేవాలయంలో చూడటం అనే అంశాన్ని జీర్ణించుకోలేని వారిసంఖ్య కూడా గణనీయంగానే వుంది.

కాశీనాధుని వంశంలో, పరమనైష్ఠిక కుటుంబంలో పుట్టిన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు కూడా హరిజన సేవాసంఘం అధ్యక్ష బాధ్యతలు చేపట్టి, ఊర్మూరా హరిజనుల్ని దేవాలయాల్లోకి అనుమతించాల్సిందిగా ప్రచారం చేయటం, ఆయన ప్రచురిస్తున్న ఆంధ్ర పత్రిక దినపత్రికలో కూడా ఇందుకు తగిన ప్రచారం కల్పించటం... ఇవన్ని సంస్కరణవాదులకు ఆనందం, సనాతనులకు ఆగ్రహం కల్గిస్తున్న అంశాలు...

"మానవుని వెలిబెట్టిన
దేముని వెలిబెట్టినట్టే" అని నినాదం ఇచ్చారు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

ఘంటసాల సుబ్రహ్మణ్యేశ్వర స్వామి దేవాలయ ధర్మకర్త గొర్రెపాటి వెంకయ్యగారు అందరుచెప్పేదీవింటున్నారు. కానీ, సాంప్రదాయ విరుద్ధ నిర్ణయాలు తీసుకోవటానికి ఆయనకున్న ఇబ్బందులు ఆయన కున్నాయి.

"ఈ రోజు షష్ఠి" సుబ్రహ్మణ్యేశ్వర స్వామికి చాలా ప్రీతిపాత్రమైన రోజు. ఘంటశాల గ్రామంలో సగంమంది మనుషుల్ని అంటరాని వాళ్ళనే నెపంతో గుడిలోకి రానివ్వక పోవటం అన్యాయం. మేంకూడా ఈ రోజున గుడిలోకి రాకుండా, గుడిబైటనుంచే హరిజన్నులతో కలిసి కొబ్బరికాయకొట్టి దేముణ్ణి ప్రార్థించుకొంటాం..." అన్నారు పురప్రముఖులు ఘంటసాల లక్ష్మీనరసింహం పంతులుగారు.

"సంస్కరణలనేవి ప్రతిఘటన లేకుండా సర్వజనామోదంగా వుండాలి-" వాదించారు ధర్మకర్త గొర్రెపాటి వెంకయ్యగారు.

"నిజమే! మేంకూడా ప్రజల్లోంచే వస్తున్నాం... హరిజన దేవాలయ ప్రవేశం అనే ఉద్యమం దేశవ్యాప్తంగా నడుస్తోంది. దేశంలోని దేవాలయాలు చాలాభాగం ఈ ఉద్యమానికి తోడ్పడుతూ హరిజనుల్ని అంగీకరిస్తున్నాయి" కూర్మయ్యగారు వివరించారు.

"కానీ, మా వూరి ప్రజలు అంగీకరించాలి గదా...?" ఎదురు ప్రశ్నించారు వెంకయ్యగారు. "నేను ఈ దేవాలయానికి ధర్మకర్త మాత్రమే. ప్రజలే దీని పోషకులు- దీని పోషకులను కాదని వ్యక్తిగతంగా నేనేనిర్ణయమూ తీసుకోలేను-" తన అశక్తతను వెల్లడించారు వెంకయ్యగారు.

"గాంధీ మహాత్ముడి పిలుపుని మీరు అర్థం చేసుకోండి. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు చెబ్తున్నదాన్ని మీరెందుకు కాదంటున్నారో తెలియటంలేదు-" కూర్మయ్యగారు నిరాశగా అన్నారు.

"ఒక పనిచేయండి! ఘంటసాల గ్రామంలో జలధీశ్వరాలయం ఊరుమ్మడి దేవాలయంగా వుంది. మీరు మొదట ఆ దేవాలయంలో హరిజన ప్రవేశం చేయించండి- ఎటువంటివివాదమూ లేకుండా నా దేవాలయాన్ని నేను హరిజనులకు తెరిచేవుంచుతాను. వ్యక్తిగతంగా నేను మీ ఉద్యమానికి మద్దతునిస్తున్నాను. కానీ ధర్మకర్తగా నా పరిమితులు వేరు-". వెంకయ్యగారు స్పష్టంగా తేల్చిచెప్పారు.

కూర్మయ్యగారు విషయాన్ని ప్రజల్లోతేల్చుకోవటానికే నిర్ణయించారు.

ఘంటసాలలో ప్రముఖులు, గాంధేయవాది, కాంగ్రెస్ నాయకులు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు జైలులో ఉన్నారు. వారు వచ్చేలోగా కొంత ప్రజాచైతన్యాన్ని తీసుకురావాలని నిర్ణయించారు.

"మళ్ళీ వచ్చే షష్ఠినాటికి హరిజనులు ఘంటసాల గ్రామంలో దేవాలయ ప్రవేశం చేయలేకపోతే ఆమరణ నిరాహారదీక్ష చేస్తానుఅని ప్రముఖ కవి, గాంధేయవాది గొర్రెపాటి వెంకట సుబ్బయ్య గారు ఆవేశంగా ప్రకటించారు.

ఆరోజు షష్ఠినాడు ఘంటసాలలోని సంస్కరణ వాదులు ముందే తీసుకున్న నిర్ణయం ప్రకారం గుడిబైట హరిజనులతో కలిసి కొబ్బరికాయలు కొట్టారు.

ఇలా గుడిబైటే హరిజనులతో కలిసి కొబ్బరికాయలు కొట్టిన సంగతిని ఊళ్ళో అందరూ గమనిస్తూనే వున్నారు. మొత్తంమీద ఒక సంచలనం కల్గించగలిగామనుకొన్నారంతా!

చెరుకువాడ వెంకట నరసింహారావుగారు, మాగంటి బాపినీడుగారు కొడాలి ఆంజనేయులుగారు, యెర్నేని సుబ్రహ్మణ్యంగారు...మొదలైన నాయకులంతా ఘంటసాల వచ్చి ప్రజల్ని కలుసుకోవటం, బహిరంగసభల్లో పాల్గొనటం చేస్తున్నారు. కరపత్రాలు అచ్చువేయించి ప్రజల్ని హరిజన దేవాలయ ప్రవేశానికి అంగీకరించవలసిందిగా కోర్తున్నారు.

కృష్ణాజిల్లాలో అంగలూరులో ప్రారంభమైన హరిజన దేవాలయప్రవేశం... క్రమేణా చాలా దేవాలయాలకు విస్తరించసాగింది.

అవనిగడ్డలో మండలి వెంకటకృష్ణారావుగారు కూడా తమదేవాలయంలో హరిజనుల ప్రవేశాన్ని చేయించారనీ, ఒక హరిజనులపిల్లని చేరదీసి పెళ్ళి చేసి పంపించారని ప్రజలకు తెలియచేస్తున్నారు.

రోజులు గడుస్తున్నాయి. గొట్టిపాటి బ్రహ్మయ్యగారు కూడా జైలునించి విడుదలై వచ్చాక ప్రజాచైతన్యం కల్గించే ప్రయత్నాలు మరింత ముమ్మరం అయ్యాయి.

షష్ఠికి ఇంకా నెలరోజులే సమయంవుంది.

"ఆరునూరైనా, నూరు ఆరైనా - షష్ఠికి మీరు అనుకొన్నది సాధించలేకపోతే, నేను ఘంటసాల జలధీశ్వరాలయం ఎదుట అమరణ దీక్ష చేసి తీర్తాను" అని మళ్ళీ ప్రకటించారు గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు.

సుబ్రహ్మణ్యేశ్వర స్వామి దేవాలయ ధర్మకర్త గొర్రెపాటి వారు "మీరు సంతకాల సేకరణ చెయ్యండి. మెజారిటీ ప్రజలు అంగీకరించేట్లయితే, ఒక్క సుబ్రహ్మణ్యేశ్వర దేవాలయం ఏమిటీ - ఘంటసాలలో వున్న అన్ని దేవాలయాల తలుపులూ బార్లా తెరిపించేద్దాం... అన్నారు.

యలకుర్రు అగ్రహారంనుంచి కాశీనాథుని వీరమల్లయ్య అయ్యవార్లు గారిని ఘంటసాల పిలిపించి ఆయనచేత పురాణ ప్రవచనం చేయించారు.

"హరిజన దేవాలయ ప్రవేశం న్యాయ సమ్మతము, ధర్మ సమ్మతము, శాస్త్రసమ్మతము -" అని ప్రకటించారు వీరమల్లయ్య అయ్యవారు.

"మత పెద్దలు కూడా దీన్ని సమ్మతమేనని చెప్తున్నారు... చాలా సంతోషించవలసిన విషయం! దేశమాన కాలపరిస్థితుల్లో చాలా మార్పు వచ్చింది... ఈ మార్పుకి అనుగుణంగా సనాతనులైన పెద్దలు ముందుగా మారితే జనసామాన్యం కూడా వారిని అనుసరిస్తారు - అన్నారు కూర్మయ్యగారు. గొట్టిపాటి బ్రహ్మయ్యగారు వీరమల్లయ్యగారికి ధన్యవాదాలు తెలిపి, హరిజనోద్యమానికి సహకరించవలసిందిగా కోరారు.

ఆరోజునుంచి సంతకాల సేకరణ ఉద్యమం ప్రారంభం అయ్యింది. రాత్రనక పగలనకా తిరిగి ఇంటింటికి వెళ్ళి ప్రతిఒక్కరినీ కలిసి సంతకాలు పెట్టించారు.

బ్రాహ్మల ఇళ్లకు వెళ్లారు. వైశ్యులు ఇళ్ళకూవెళ్ళారు. విశ్వబ్రాహ్మల ఇళ్ళకూ వెళ్ళారు. అన్నికులాలవారినీ కలిశారు.

కులాల పెద్దల్లో చాలామంది ఉద్యమ అనుకూలురే కావటంతో సంతకాల సేకరణ కార్యక్రమం ముమ్మరంగానే సాగుతోంది...

షష్ఠికి ఇంకా ఒక్కరోజే సమయం వుంది-

ఊళ్ళో అందరూ సంతకాలు చేసినట్టేనని దేవాలయాల ధర్మకర్తలందరినీ పిలిచి చూపించారు! బ్రహ్మయ్యగారు, వెంకటసుబ్బయ్యగారు సంతకాలు లెక్కపెట్టారు.

నూటికి 85మంది అనుకూలంగా సంతకాలు చేశారని, కేవలం 15శాతం మంది మాత్రమే వ్యతిరేకించారని ప్రకటించారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు.

"రేపు సుబ్రహ్మణ్య షష్ఠినాడు హరిజనులు కూడా దేవాలయ ప్రవేశం చేయవచ్చుని ఘనంగా ప్రకటించారు ధర్మకర్త గొర్రెపాటి వెంకయ్యగారు.

ఉద్యమనాయకుల సంబరానికి అంతేలేదు.

"ముఖ్యంగా బ్రాహ్మణ, వైశ్య, విశ్వబ్రాహ్మణ కుటుంబాలు ఎక్కువమంది అనుకూలంగా సంతకాలు చేయటం నాకెంతో సంతోషంగా వుంది" అన్నారు కూర్మయ్యగారు.

1933 నవంబర్ 2 - మార్గశిరషష్ఠి. సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి ఉత్సవం కాశీనాథుని వీరమల్లయ్యగారు దగ్గరుండి జరిపిస్తున్నారు.

చాలామందికి అదో పుణ్య దినం... ఎంతో కాలంగా సాటిమనుషుల్ని అంటరాని వాళ్ళుగా ముద్రవేసి. కనీసం దేముడికి దణ్ణంపెట్టుకోకుండా కూడ చేసిన అమానుషత్వానికి ఆ ఊళ్ళో ఆరోజు తెరబడ్తోంది. దేవుడు మైలపడిపోతాడని కొంతమందికి అదొక పీడ కల!

"కొన్ని శతాబ్దాలుగా సంప్రదాయంగా వస్తున్న సనాతన ఆచారాల్ని కొందరు బొంట్లు - తమకు కీర్తిప్రతిష్టలు దక్కాలని, పేపర్లలో ప్రచారం రావాలని ఈ వర్ణసాంకర్యానికి పాల్పడి, మతద్రోహంచేస్తున్నారు" అనిగొణిగారు జలధీశ్వరాలయం పురోహితులు ఘంటసాల సుబ్బయ్యగారు.

సుబ్బయ్యగారు ఆ మాటలంటున్నప్పుడు చాలామంది సనాతనులకు నిజమేననిపించింది.

కలికాలం అనుకున్నారంతా!

తెల్లవారితే షష్ఠి!

కూర్మయ్యగారి నాయకత్వాన హరిజనులు సుబ్రహ్మణ్యేశ్వర దేవాలయ ప్రాంగణంలో ప్రవేశించి, స్వామి సన్నిధిలో స్వయంగా ప్రార్థన చేసుకొనే అవకాశం కోసం సన్నద్ధంగా నిలబడ్డారు.

ప్రతిఘటన వస్తుందేమోనని జాగ్రత్తగ్గా అన్నివైపులా సంస్కరణ వాదులు మోహరించారు.

తెలతెలవారుతూండగానే డిప్యూటీ కలెక్టర్ రాజరత్నం నాయుడుగారు కొందరు పోలీసు బృందాన్ని వెంట పెట్టుకొని ఊళ్ళోకి వచ్చారు.

"కూర్మయ్య గారంటే ఎవరు?" అడిగారు-

'నేనే' నన్నారు కూర్మయ్యగారు.

"మీరు హరిజనుల్ని రెచ్చిగొట్టి హిందూమత ధర్మాలకు వ్యతిరేకంగా వారిని ప్రోత్సహిస్తున్నారని మీమీద కంప్లెయింట్ వచ్చింది -" అన్నారు కొంచెం కఠిన స్వరంతో!

నిజానికి డిప్యూటీ కలెక్టర్ రాజారత్నంనాయుడు గారు సహృదయుడూ, సంస్కరణాభిలాషికూడా! కానీ, ఆయన వృత్తిధర్మం నెరవేరుస్తున్నారు.

గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు కూడా హుటాహుటిన అక్కడకుచేరుకున్నారు.

"హరిజన దేవాలయ ప్రవేశం అనేది మహాత్మాగాంధీ పిలుపు ననుసరించి జరుగుతోంది. హరిజనోద్ధరణ చేయమని దేశంలో అత్యంత ఉన్నతమైన శాసన సభ కూడా బిల్లు ఆమోదించింది. దేశవ్యాప్తంగా సాగుతున్న ఉద్యమం ఇది-" వివరించారు కూర్మయ్యగారు.

"ఇక్కడ ఘర్షణ జరిగేందుకు అవకాశం వుందని మాకు వర్తమానం వచ్చింది- 144వ సెక్షన్ అమలుచేయబోతున్నాం... మీరు వెంటనే ఇక్కడినించి వెళ్ళిపోవడం మంచిది-" రాజారత్నంనాయుడుగారు కఠినంగానే అన్నారు. "ఇది నా ఉద్యోగ విధి - తప్పదు-" అని మళ్ళీ వివరణకూడా ఇచ్చారు.

బ్రహ్మయ్యగారు వెంటనే గ్రామప్రజలు సంతకాలు చేసి ఇచ్చిన కాయితాలు చూపించారు. 'కేవలం 10-15 శాతం మంది చెప్పిన విషయాలు నమ్మి మెజారిటీ ప్రజల అభిప్రాయాన్ని మీరు మన్నించకపోవటం అన్యాయం..." అని వాదించారు.

"నిజమే!" అన్నారు డిప్యూటీ కలెక్టర్‌గారు ఆ కాయితాలు పరిశీలిస్తూ. ఆయనకు జరిగిందంతా పూర్తిగా అర్థం అయ్యింది. సనాతన వాదులు తనని పక్కదారిపట్టించారని తెలుసుకున్నారు. మీరు శాంతిభద్రతల పరిస్థితి సృష్టించకుండా వుంటే మీకు నా సహాయం వుంటుంది" అని అభయం ఇచ్చారాయన.

'సంతోషం' అన్నారు కూర్మయ్యగారు.

"ఒకవేళ మీరు కావాలనుకొంటే అదనపు పోలీసుబలగాన్ని ఏర్పాటు చేస్తాను - డిప్యూటీ కలెక్టర్‌గారు చాలా ఉత్సాహంగా అన్నారు.

"వద్దుసారు. మీ సహాయానికి కృతజ్ఞులం. సనాతనవాదులు కోరినట్లు మీరు 144వ సెక్షన్ విధించకుండా వుంటే మేం విజయంసాధించినట్లే" అన్నారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు.

కూర్మయ్యగారు ముందునడవగా, వెనక వందలాది హరిజనులు సుబ్రహ్మణ్య స్వామి దేవాలయ ప్రవేశం చేశారు.

మంచుతెరలు చీల్చుకొంటూ, చీకటి రేఖల్ని చిదుముకొంటూ ఉదయ భాస్కరుడు ఈ చారిత్రాత్మక సంఘటనకు సాక్షీభూతంగా ఉండాలని ఉత్సాహంగా ఎదిగొచ్చి తేజోవిరాజితుడై దీక్షగా వీక్షించసాగాడు.

భళ్ళున తెల్లవారేసరికి హరిజనులు సుబ్రహ్మణ్యేశ్వరుని అర్చించుకోవడం పూర్తయిపోయింది!

మహాత్ముడు కన్నకలలు ఘంటసాలలో కూడా నిజమైనాయని ఊరిలో అత్యధికులు సంతోషించారు.

1933 నవంబర్ 19

ఊళ్ళో కొందరు పెద్దలు మత ద్రోహానికి పాల్పడి దేవాలయాల్ని అపవిత్రం చేస్తున్నందుకు నిరసనగా ఘంటసాల జలధీశ్వారాలయం పూజారిగారు ఘంటసాల సుబ్బయ్యగారు తన అర్చకత్వాన్ని వదులుకొన్నారని, మరింక ఆ దేవాలయంలోకి అడుగు పెట్టకూడదని నిర్ణయించుకున్నారని ఊరంతా చెప్పుకొన్నారు.

దేముడు లేని దేవాలయం అయినా వుంటుందిగానీ, పురోహితుడులేని దేవాలయాన్ని ఊహించుకోలేరు ప్రజలు.

ఊళ్ళో మళ్ళీ అలజడి.

కాశీనాథుని వీరమల్లయ్యగారికి జరిగిందంతా వివరించారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు.

ఆయన వెంటనే తనకుమారుణ్ణి వెంటపెట్టుకొని ఘంటసాల గ్రామంవచ్చారు.

"ఇక్కడ మరో పురోహితులు కుదిరే వరకూ ఆలయ పూజాదికాలన్నీ నువ్వే నిర్వర్తించు" ఆదేశిస్తున్నట్లు చెప్పారాయన తన కుమారుడికి.

సమస్య ఇంతతేలికగా పరిష్కారం అవుతుందని ఎవ్వరూ ఊహించలేదు.

తన నిరసనని ఎవ్వరూ పట్టించుకోలేదని అవతల పురోహితులవారు అగ్గిమీద గుగ్గిలం అయ్యారు.

అదేరోజు ఘంటసాలలో మరోప్రముఖులు ఘంటశాల లక్ష్మీ నరసింహం పంతులుగారి ఇంట్లో వారి తండ్రి ఉద్దండ నరసింహంగారి ఆబ్దికం వచ్చింది.

"నాన్నగారి ఆబ్దికం జరిపించండి స్వామీ...." ప్రాథేయపడ్తూ అడిగారు లక్ష్మీనరసింహంగారు పురోహితుల వారిని.

పురోహితులు సుబ్బయ్యగారు ఉగ్రరూపం ఎత్తి వున్నారు ఆసమయంలో!

"హరిజనుల దేవాలయ ప్రవేశానికి అనుకూలంగా నువు సంతకం చేశావు కదూ..." తీక్షణంగా చూస్తూ రౌద్రంగా అడిగారు.

"కానీ, నాన్నగారు మీకు ఆప్తులు, స్నేహితులుకదా..." ప్రాథేయపడ్తున్నట్లు అడిగారు లక్ష్మీనరసింహంగారు.

"నువు లక్ష చెప్పు. ఆఖరికి ఆ పరమశివుడు దిగివచ్చినా వర్ణసాంకర్యం చేసిన వారింటికి నేనురాను-" ఖరాఖండిగా చెప్పేశారు సుబ్బయ్య పురోహితులుగారు.

సంగతి బ్రహ్మయ్యగారికి తెల్సింది.

హుటాహుటిన పురోహితులవారింటికి వెళ్ళారు. "మీరీవిధంగా లక్ష్మినరసింహంగారిని వెలివేయడం బాగుండలేదు. ఇది న్యాయంకాదు కూడా! మీరు దూరదృష్టితో చూడాలి" అని బ్రతిమాలారు.

భీష్మించుకు కూర్చున్నారు పురోహితులు.

'అయితే, మా యిళ్ళలో పౌరోహిత్యాన్ని కూడా మీరు మానుకోవాల్సి వస్తుంది-" కొంచెం హెచ్చరికగా అన్నారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు.

"మీ ఊరు ఊరంతా ఏకం అయినా నాకు లెక్కలేదు - నేనెవరింటికీ వచ్చేదిలేదు. నాకు మతధర్మము ముఖ్యం...." తేల్చి చెప్పారాయన.

"త్రిపురనేని రామస్వామిచౌదరి గారిని కలిసి ఘంటసాలలో స్వకుల పౌరోహిత్యం కోసం వేదం నేర్చిన కమ్మవారిని తీసుకువస్తాను" అంటూ కోపంగా బయల్దేరారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు!

"ఘంటసాలలో బ్రాహ్మణేతరులు వేదం నేర్చుకోవడానికి వేదపాఠశాల పెట్టిస్తాను-" శపథంచేశారాయన.



1933 డిసెంబర్: మహాత్మాగాంధీ ఆంధ్రప్రాంత పర్యటనని ఆంధ్ర హరిజన సంఘం అధ్యక్షులు దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు, ప్రధానకార్యదర్శి మాగంటి బాపినీడుగారు సహాయకార్యదర్శి వేములకూర్మయ్యగారు గాంధీగారిని వెంటపెట్టుకొని ఆంధ్ర ప్రాంతంలో అనేక గ్రామాల్ని పట్టణాల్ని సందర్శింపచేస్తున్నారు.

"ప్రతిజిల్లాలోనూ హరిజన సంఘం అధ్యక్ష కార్యదర్శులు, తమతమజిల్లాల్లో గాంధీగారి పర్యటనకు ఏర్పాట్లు చేయాలి-" అని ఆదేశించారు దేశోద్ధారక నాగేశ్వరరావుగారు.

కృష్ణాజిల్లా ముదునూరులో గాంధీగారిరాక సందర్భంగా అన్నె అంజయ్యగారు చేసిన ఏర్పాట్లతో గాంధీగారు హరిజనుల్ని వెంటపెట్టుకుని దేవాలయ ప్రవేశం చేయించారు.

వేములకూర్మయ్యగారు హరిజన నాయకుడిగా గాంధీని అనుసరించారు:

కూర్మయ్యగారు స్వయంగా వ్యవస్థాపించిన అంజనాదేవి ఆది ఆంధ్ర బాలికల వసతి గృహం గురించి విని గాంధీగారు చాలా సంతోషించారు.

బందరుతోపాటుగా, ఘంటసాల, చల్లపల్లి గ్రామాల్నికూడా గాంధీగారు సందర్శించారు.

"ఇక్కడిదాకా వచ్చారు. మా సొంత గ్రామానికి కూడా దయచేయండి-" అని అహ్వానించారు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

గాంధీజీ సంతోషంగా అంగీకరించారు.

యలకుర్రులో కూర్మయ్యగారు చిన్నప్పుడు చదువుకున్న "శ్యామలా ధర్మ ప్రాథమికోన్నత పాఠశాల" ని సందర్శించారు.

"తమ రాక సందర్భంగా నాగేశ్వరరావు పంతులుగారు ఒక ఎకరం పొలంకొని, అందులో నాలుగు దూలాల ఇళ్ళు నలభై ఐదింటిని కట్టించి హరిజనులకు పంచి పెడ్తున్నారు. అది తమ చేతుల మీదుగా జరగాలని వారికోరిక. తదుపరికార్యక్రమం అది..." వివరించారు గాంధీజీకి కూర్మయ్యగారు.

ఆంధ్ర ప్రాంతంలో ఇంత హరిజన సేవ జరుగుతోందని స్వయంగా చూసి తెలుసుకొన్నాక గాంధీజీ చాలా ఆశ్చర్యపోయారు.

హరిజన సంఘం అధ్యక్షులు కాశీనాథుని నాగేశ్వరరావు గారిని ఆయన ప్రశంసలలో ముంచెత్తారు.

"నేను ఏ సంకల్పంతో ఈ హరిజన ఉద్యమం ప్రారంభించానో, అదే సంకల్పంతో నా కంటే ముందుగానే మీరు ఇటువంటి హరిజన సేవా కార్యక్రమాలు చేపట్టడం చాలా ఆశ్చర్యంగానూ, ఆనందంగా కూడా వుంది-" అన్నారు గాంధీజీ.

"విశ్వదాతా" అని నాగేశ్వరరావు పంతులుగార్ని సంబోధించారు గాంధీజీ.

"మహాత్మా!" అన్నారు నాగేశ్వరరావుగారు ఎంతో ఆత్మీయంగా!

"ఆంధ్రులు ఎంతో పుష్టిగా వుంటారు. చాలా శక్తిమంతులు... మంచి ఉదార స్వభావులు. ఇతరుల పట్ల ప్రేమాదరాభిమానాలను చూపిస్తారు. ఆంధ్రుల్లో మగవారు కూడా నగలు పెట్టుకొంటూ వుండటం గమనించాను. అవి నాకంట పడితే చాలు... నేను వాటిని తిలక్ స్వరాజ్యనిధి కోసం స్వాహా చేస్తూవచ్చాను. నాకు నగలు కావాలంటే ఆంధ్రులు స్త్రీపురుషులంతా వాటిని సంతోషంగా ఇచ్చేస్తున్నారు. కొన్నిచోట్ల ఒకచేతి గాజులు తీసిఇచ్చి రెండోచేతి గాజులు తీసేలోపు నేనే గమనించకుండా ముందుకు వచ్చేస్తున్నానట... మన మిత్రులు చెప్తున్నారు. అంతటి ఉదారులు మీ ఆంధ్రులు. ఇంకా కావాలన్నా ఇస్తామని వాగ్దానాలు చేస్తున్నారు.

ఆంధ్రదేశం నన్ను సమ్మోహితం చేసింది. ఆంధ్రుల్లో మంచి ప్రజానాయకులున్నారు తగిన సాధన సంపత్తి వుంది. దేశం పట్ల భక్తి విశ్వాసాలున్నాయి. స్వార్థంలేని త్యాగనిరతి వుంది..." అంటూ ఆంధ్రుల పట్ల ప్రశంసల వర్షం కురిపించారు గాంధీజీ!

1921 లో ఆయన ఆంధ్ర పర్యటనకు వచ్చినప్పుడు చూపిన ఆదరాభిమానాలకన్నా ఎక్కువ భక్తి విశ్వాసాలను ప్రదర్శించడాన్ని గమనించిన గాంధీగారు ముగ్ధులయ్యారు.

అదేమని అడిగితే 'క్రైస్తవుడైవుండీ, క్రైస్తవమత ప్రభుత్వానికి వ్యతిరేకంగా కాంగ్రెస్‌లో పనిచేయటం, క్రైస్తవమతానికి ద్రోహం చేయటంగా భావిస్తున్నాం-" అన్నారట! క్రైస్తవుల్లో ఈ అభిప్రాయాన్ని తొలగించి, వాళ్ళని కూడా కాంగ్రెస్‌లోకి తీసుకువచ్చే ఉపాయం ఆలోచించండి!" అన్నారు ప్రకాశంగారితో కూర్మయ్యగారు.

కూర్మయ్యగారి విశ్లేషణ కరెక్టేనని గ్రహించారు ప్రకాశంగారు.

తూర్పుకృష్ణాజిల్లాలో చల్లపల్లి రాజాగారి బలం ముందు కాంగ్రెస్ వారి బలం చాలా తక్కువగా కన్పిస్తోంది. కాళేశ్వరరావుగారు బెజవాడ మున్సిపాల్టీకి పోటీచేస్తున్నారు. రూరల్ ప్రాంతం నుంచి పోటీ చేసేందుకు కాంగ్రెస్ పెద్దలు ఎవరూ ముందుకు రావటం లేదు. పట్టాభిగారు జాతీయనాయకులు కాబట్టి, జిల్లాబోర్డు సభ్యత్వం లాంటి చిన్న విషయాల్ని ఆయన పట్టించుకోలేదు.

"మేమంతా పట్టాభిగారి సహచరులమే! కానీ, ఈ జమీందారీ జస్టిస్ పార్టీ వారి బలాన్ని ఎదిరించగల శక్తి సంపన్నతల్ని మేమింకా పెంచుకోలేదు" అన్నారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు.

కాంగ్రెస్‌వారు భయంభయంగానే ఎన్నికల్లో నామినేషన్ వేశారు. కూర్మయ్యగారు గాంధీగారి అండవుండగా తనకు ఏ పరాజయం వుండదని కొండంత నమ్మకంతో నామినేషన్ వేశారు. ఆయన ధైర్యం చూస్తే ప్రతిఒక్కరికి ఆశ్చర్యమే!

"నిండా ముప్పై మూడేళ్ళ యువకుడు. నిన్నటిదాకా స్టూడెంటు... హరిజనుడు... వెనకాల సిరిసంపదలు, ఆస్తిపాస్తులూ ఏమీలేనివాడు... అయినా వీర సైనికుడిలా పోరాటం చేస్తున్నాడు..." అని పత్రికలు కూడా కూర్మయ్యగారి గురించి ప్రత్యేకంగా వార్తలు రాయడం మొదలుపెట్టాయి.

"చల్లపల్లి రాజా అర్థబలం, కూర్మయ్యగారి అంగబలం... ఏది గెలుస్తుందో" ఆసక్తిగాఎదురు చూస్తున్నారంతా!! ప్రకాశంగారు ఆంధ్ర ప్రాంతం అంతా సుడిగాలి పర్యటనలు చేపి తిరిగి కాంగ్రెస్ అభ్యర్థుల గెలుపు కోసం కృషి చేస్తున్నారు.

తూర్పు కృష్ణాలో కూర్మయ్యగారిదే వంటరి పోరాటం అయ్యింది. హరిజనోద్యమ నాయకుడిగా వెనుకబడిన వర్గాల్లో కూర్మయ్యగారు అప్పటికే ప్రాచుర్యం పొందారు. దేవాలయ ప్రవేశం ఉద్యమంతో మధ్యతరగతి ప్రజలక్కూడా ఆయన సుపరిచితులు. ఈ పరిచయాలు కూర్మయ్యగారికి ఓట్లుగా ఎంతవరకూ పరిణమిస్తాయో... చూడాలి!! పురోగమించడం ఒక్కటే ఆయనకు తెలుసు...!!

మొత్తం 52 స్థానాల్లో కాంగ్రెస్ అభ్యర్థులు తూర్పు కృష్ణానుంచి పోటీచేస్తున్నారు. ఎన్నికలు జరిగాయి. వాడిగా, వేడిగా ఉత్కంఠ భరితంగా జరిగాయి.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఆంధ్రప్రాంతం అంతా కాంగ్రెస్ విజయభేరి మ్రోగించింది!

ఒక్క కృష్ణా జిల్లాలోనే కథ అడ్డం తిరిగింది. పోటీ చేసిన 52 స్థానాల్లోనూ 50 స్థానాల్లో కాంగ్రెస్‌వారు ఓడిపోయారు. ఇద్దరు మాత్రమే గెలుపొందారు...

ఒకరు వేముల కూర్మయ్యగారు. రెండవవారు తుర్లపాటి వెంకటేశ్వరరావుగారు.

ప్రకాశంగారి కృషి ఫలించింది.

తూర్పుగోదావరిజిల్లాలో పళ్ళంరాజుగారు, నడింపల్లి సుబ్బరాజుగారు, పశ్చిమ గోదావరిజిల్లాలో దండు నారాయణరాజుగారు, గుంటూరులో పాతూరి సుబ్బయ్య చౌదరి గారు, ఒంగోలులో కాసు బ్రహ్మానందరెడ్డిగారు, కర్నూలులో ఎన్.శంకరరెడ్డిగారు, చిత్తూరులో టి.యస్.రామకృష్ణారెడ్డిగారు, అనంతపురంలో ఓబులు రెడ్డిగారు, నెల్లూరులో కోదండరామిరెడ్డిగారు జిల్లాబోర్డు ఛైర్మన్‌లుగా గెలుపొందారు.

పశ్చిమ కృష్ణాలో మీర్జాపురం రాజా, తూర్పు కృష్ణాకు చల్లపల్లిరాజా జస్టిస్‌పార్టీ పక్షాన అత్యధికంగా సభ్యులు గెలుపొందడంతో సహజంగానే బోర్డు ఛైర్మన్‌లుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

బెజవాడ మున్సిపాలిటీకి అయ్యదేవర కాళేశ్వరరావుగారు కాంగ్రెస్ పక్షాన ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. బందరు మున్సిపాలిటీ మాత్రం జస్టిస్ పార్టీ వారికే ధారాదత్తం అయ్యింది.

ఇంత ప్రతికూలవాతావరణంలో చల్లపల్లివారి ప్రాబల్యాన్ని తట్టుకొని గెలుపొందిన ఏకైక హరిజన నాయకుడు వేముల కూర్మయ్యగారిని అందరూ ప్రశంసించారు.

ఇది ఆరంభం మాత్రమే! అత్యున్నత శిఖరాలు అధిరోహించడానికి ఈ విజయం ఒక శుభసూచకం..... అంతే!!



చూస్తూండగానే, అప్పుడే 1937 ఉమ్మడి మద్రాసురాష్ట్ర అసెంబ్లీకి ఎన్నికలు వచ్చాయి....

కాంగ్రెస్ వారు గెలుపు ఉత్సాహంతో, అభ్యర్థుల్ని రంగంలోకి దించుతున్నారు.

పాత జస్టిస్ పార్టీ అభ్యర్థులందరికీ ఈసారి గట్టిపోటీనివ్వగలిగిన కాంగ్రెస్ అభ్యర్థుల్ని ఎంపిక చేయటం కోసం ప్రకాశంగారు కసరత్తు చేస్తున్నారు.

తూర్పుకృష్ణా జిల్లాలో బందరుతాలూకా దివితాలుకా, గుడివాడ తాలూకా, కైకలూరు తాలూకా... ఈ నాల్గింటినీ కలిపి ఒకే అసెంబ్లీ నియోజక వర్గం అన్నారు. ఇందులో రెండు సీట్లున్నాయి. ఒకటి జనరల్ - ఒకటి రిజర్వుడు.

బందరు, బెజవాడ ఈ రెండు పట్టణాలు కలిపి ఒక అసెంబ్లీ నియోజక వర్గం చేశారు.

బందరు బెజవాడ కలిసిన నియోజక వర్గంనుంచి అయ్యదేవర కాళేశ్వరరావు గారు పోటీ చేస్తున్నారు. బహుశా ఆయనకు తిరుగలేని ఆధిక్యత వస్తుందని అందరూ ముందుగానే అంచనాలు వేస్తున్నారు.

గ్రామీణ ప్రాంతాలతో కూడిన రెండో నియోజకవర్గంనుంచి అందరూ ఊహించినట్లుగానే జస్టిస్ పార్టీ తరఫున చల్లపల్లిరాజా జెనరల్‌సీటు నుంచి పోటీచేస్తున్నట్లు ప్రకటించారు. ఆయనకు వ్యతిరేకంగా జనరల్ సీటునుంచి కాంగ్రెస్ పక్షాన పోటీచేసేందుకు అభ్యర్థి దొరకలేదు.

రిజర్వుడు నియోజక వర్గంనుంచి వేముల కూర్మయ్యగారిని నిలబెడ్తారనీ అందరూ అనుకొంటున్నారు. జనరల్ సీటునుంచి ఎవ్వరు పోటీ చేసేదీ తెలీలేదు.

ప్రకాశంగారితో చనువుగా మాట్లాడే వారు చాలా తక్కువమంది వుండేవారు. గాంధీగారి కన్నా ప్రకాశంగారితో దగ్గరగా చనువుగా మాట్లాడడానికి చాలామంది జంకేవారు.

"తూర్పుకృష్ణా గ్రామీణ నియోజకవర్గాలలో జెనరల్ సీటుకు కాంగ్రెస్ అభ్యర్థిగా ఎవరూ నిలబడతానని ముందుకురావటం లేదు" జిల్లాకాంగ్రెస్ అధ్యక్షులు గొట్టిపాటి బ్రహ్మయ్యగారిని పిలిపించి చెప్పారు ప్రకాశంగారు.

"చల్లపల్లిరాజా ధనబలం ముందు సరితూగగల ధనికకాంగ్రెస్ వాదులు కృష్ణా జిల్లాలో ఎవరూ లేరు-" అన్నారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు!

"అవును పరిస్థితులు నాకు తెలుసు. చల్లపల్లి ధనం, చల్లపల్లి మనుషులు ఇతర జిల్లాల మీద, ఇతర నియోజక వర్గాల మీద పడకుండా, ముఖ్యంగా పశ్చిమకృష్ణా పశ్చిమ గోదావరి, గుంటూరుజిల్లాల మీదకు వెళ్ళకుండా మనం అతన్ని ఇక్కడే కట్టడి చెయ్యాలి. చల్లపల్లి రాజా డబ్బంతా ఇక్కడే ఖర్చుపెట్టించాలి అతని మనుషులంతా ఇక్కడే పనిచేసేలా చూడాలి..." ప్రకాశంగారు చాలా ఆవేశంగా అన్నారు.

"అవును! కానీ, అదెలాసాధ్యం...? చిన్నగా అడిగారు బ్రహ్మయ్యగారు.

"జిల్లాకాంగ్రెస్ అధ్యక్షులై వుండి మీరిలా నీళ్ళునముల్తుంటే...ఎలా?" కొంచెం గద్దించి అడిగారు ప్రకాశంగారు.

గొట్టిపాటి బ్రహ్మయ్యగారు మౌనంగా వుండిపోయారు.

"రిజర్వుడు సీటుకు కూర్మయ్యగారిని ఎంపికచేశాం..." ప్రకాశంగారు చెప్పారు.

"చాలా సంతోషం! ఆయన అయితేనే ఈ పరిస్థితిలో నెగ్గుకు రాగలడు." తన అభిప్రాయాన్ని ఆనందాన్ని ప్రకటించారు బ్రహ్మయ్యగారు.

ఆయన మీద సుంద్రు వెంకయ్యగారిని నిలబెడ్తున్నారట! చిన్నప్పుడు కూర్మయ్యగారిని ఆదరించిన వ్యక్తి సుంద్రు వెంకయ్యగారు. సీనియర్ హరిజననాయకుడు. సంస్కర్త. గొప్పదేశ భక్తుడు. ఆయన చల్లపల్లి ప్రాపకం కోసం లొంగిపోవడం ఆశ్చర్యంగా వుంది-" ప్రకాశంగారు తన బాధను వ్యక్తపరిచారు. "మీరు కొంచెం జాగ్రత్తగా వుండండి! కూర్మయ్యగారు మనసుమార్చుకొని సుంద్రు వెంకయ్యగారి మీద గౌరవంతో పోటీనించి విరమించుకోకుండా చూడండి-" అన్నారు.

"మీకు అనుమానం అక్కరలేదు. కూర్మయ్యగారితో కలిసి ఈ మధ్య నేను చాలా కార్యక్రమాల్లో పనిచేశాను. ఆయన వజ్ర సంకల్పుడు. హరిజనులకోసం. ఎన్ని కష్టాలయిన ఎదుర్కోగల దిట్ట! ఘడియకొక అభిప్రాయాన్ని మార్చుకొనే మనిషికాదు. మీరు పూర్తిగా అతనిపైన ఆధారపడవచ్చు. పైగా గెలుస్తాడన్న నమ్మకం కూడా నాకుంది..." అని చక్కని కితాబునిస్తూ కూర్మయ్యగారి గురించి ప్రకాశంగారికి ఒక మంచి అభిప్రాయం కల్గించారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు.

"అంతా బాగానేవుంది... మరి మీ సంగతేమిటీ..." సూటిగా అడిగారు ప్రకాశంగారు. గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఏమీ మాట్లాడలేదు.

"మిమ్మల్ని సైంధవుణ్ణి బలిఇచ్చినట్లు బలి యివ్వదల్చుకున్నాను. నా మనిషి కాబట్టి మీమీద నాకా అధికారం వుందని భావిస్తున్నాను. కృష్ణాజిల్లాలో చల్లపల్లి రాజాని ఎదిరించి నిలబడాలి మీరు-"

ప్రకాశంగారు ఈ మాటలు అంటున్నంత సేపూ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు అవాక్కయి వింటున్నారు.

"జెనరల్ సీటునించి మీ పేరు, రిజర్వ్‌డు సీటు నుంచి వేముల కూర్మయ్యగారి పేరూ ఖరారు చేస్తున్నాను..." తేల్చి చెప్పారు ప్రకాశంగారు.

గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ప్రకాశంగారి మాటని శిరోధార్యంగా భావించి, మౌనమే అంగీకారంగా బైటకు వచ్చారు. వెనక్కి పిలిచి చెప్పారు ప్రకాశంగారు. "డబ్బు లేదని ఖంగారు పడకండి - డబ్బు సంగతి పట్టాభిగారు చూసుకొంటారు. అభ్యర్థిత్వానికి దరఖాస్తుఫారం మీద సంతకం చేసి యివ్వండి-" అన్నారు.

డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ప్రత్యక్షంగా ఈ ఎన్నికల్లో పాల్గొనకపోయినా కృష్ణాజిల్లా అంతా పర్యటించి కాంగ్రెస్ అభ్యర్థులకోసం ప్రచారం చేశారు. ధనసేకరణ చేసి ఎన్నికల ఖర్చునడిపించారు. కృష్ణారావుగారు, కొల్లిపర సూరయ్యగారు కూడా ధనసేకరణకు సహాయంఅందించారు.

శ్రీమతి సరోజినీ నాయుడుగారు, గోగినేని రంగనాయకులు (ఆచార్య రంగగారు, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు ... వీరంతా కూర్మయ్యగారిని. బ్రహ్మయ్యగారినీ బలపరుస్తూ అన్ని ఊళ్ళు తిరిగారు. మంచి వాతావరణం వచ్చింది. ఊరూరా కాంగ్రెస్ శంఖారావం మోగింది.

కరపత్రాలూ, ఇతర ప్రింటింగ్ మెటీరియల్ అంతా ఆంధ్ర పత్రిక ప్రెస్సులో ప్రింట్ చేయించి పంపించారు కాశీనాధుని నాగేశ్వరరావుగారు.

"ఈ జమీందార్లనూ. భూస్వాముల్ని బూర్జువాల కూటమినీ - ఈ జస్టిస్ పార్టీని ఓడించడానికి మా సోషలిస్ట్ పార్టీ కూడా కాంగ్రెస్‌కు సహకరిస్తుంది..." అని ప్రకటించారు పుచ్చలపల్లి సుందరయ్యగారు! క్రొవ్విడి లింగరాజుగారు, బసవరాజు శ్రీరంగసాయిగారు ఈ ఎన్నికల్లో జస్టిస్‌పార్టీ అభ్యర్థి చల్లపల్లిరాజాగారికి వ్యతిరేకంగా పనిచేశారు.

ఎన్నికలు జరిగాయి.

కౌంటింగ్ సాగుతోంది.

ఎప్పటికప్పుడు వార్తాహరులు సమాచారం బైటకు చేరవేస్తున్నారు.

"గుడివాడ, కైకలూరు, దివితాలూకాలకు చెందిన పెట్టెల్లో కాంగ్రెస్ ఓట్లు అధికంగా పడ్డాయి..." అని ఒక వార్త!

"చల్లపల్లి రాజాగారి స్వంత జమీందారీ గ్రామాల్లో ఓట్లు ఏకపక్షంగా జమీందారుగారికే పడ్డాయి-" ఇంకో వార్త.

ఫలితాలు పూర్తిగా ప్రకటించడానికి చాలా జాప్యం జరుగుతోంది.

రాజాగారి ఏజెంట్లు అభ్యంతరాలు పెడుతూ ఓట్ల లెక్కింపు సాగనీయడం లేదని, ఎన్నికల అధికారుల్ని తికమకపెట్టి ప్రయోజనం పొందాలని చూస్తున్నారనీ వార్తలు వస్తున్నాయి.

ఆంధ్రపత్రిక కార్యాలయంలో కూర్చుని కాశీనాథుని నాగేశ్వర రావుగారు ఎన్నికల ఫలితాల విశ్లేషణ చేస్తున్నారు.

జస్టిస్ పార్టీ అభ్యర్థులు రాష్ట్ర వ్యాప్తంగా గల్లంతయి పోతున్నట్లు వార్తలందుతున్నాయి.

తూర్పు కృష్ణా గ్రామీణ నియోజక వర్గం పరిస్థితే అర్థం కాకుండా వుంది!

"జమీందారు లెవ్వరూ గెలిచేలా లేరుసార్-" అన్నాడు ఎన్నికల విశ్లేషకుడైన విలేకరి నాగేశ్వరరావు గారితో.

"చల్లపల్లి గెలుస్తాడు-" గట్టిగా చెప్పారాయన!" చల్లపల్లి సంస్థానంలో ఏం జరగబోతోందో ముందే అంచనా వేయడంలో మనవాళ్ళు బోల్తా పడ్డారు. అక్కడ హరిజన ఓటుని నచ్చిన హరిజన అభ్యర్థికే వేసేలా ప్రచారం చేయవలసి వుంది. కాని, ప్రచారం అంతా చల్లపల్లి మీదే కేంద్రీకరించి అసలు సంగతి మర్చిపోయారు-" పోస్ట్ మార్టం రిపోర్ట్ ఇచ్చిన వైద్యుడిలా వివరించి చెప్పారు నాగేశ్వరరావుగారు. ఆఖరికి తూర్పుకృష్ణా ఎన్నికల ఫలితం వచ్చింది.

వేముల కూర్మయ్యగారు పదివేల మూడువందల ముప్ఫయిమూడు ఓట్ల మెజార్టీతో గెలుపొందారన్నది మొదటి వార్త. 10, 543 ఓట్లు కూర్మయ్యగారికి పోలయితే, కేవలం 210 ఓట్లు మాత్రమే సుంద్రు వెంకయ్యగారికి పోలయ్యాయి.

జెనరల్ సీట్‌నుంచి రాజాగారికి 60,963 ఓట్లు పోలవగా, వారి మీద పోటీచేసిన కాంగ్రెస్ అభ్యర్థి గొట్టి పాటి బ్రహ్మయ్యగారికి 52. 186 ఓట్లు మాత్రమే వచ్చాయి. అంటే 8, 797 ఓట్ల తేడాతో బ్రహ్మయ్యగారిపైన చల్లపల్లి రాజాగారు గెలిచారు.

"క్యుములేటివ్ పద్ధతిలో హరిజన ఓట్లుకూడా హరిజన అభ్యర్థికి వేయకుండా జెనరల్ అభ్యర్థికి వేసుకునే అవకాశం వుండడం వలన చల్లపల్లి రాజాగారు తాను నిలబెట్టిన హరిజన అభ్యర్థి ఓట్లు మింగేశాడు-" అని మరోవార్త!

హరిజనులు రాజాగారి చేతిలో మరోసారి మోసపోయా రన్నమాట...! అనుకొన్నారు ఆవార్త విన్న వారంత.

"నాగేశ్వరరావు పంతులుగారి విశ్లేషణ కరెక్టయ్యింది. చల్లపల్లి రాజాగారు తాను నిలబెట్టిన హరిజన అభ్యర్థి ఓట్లను స్వాహాచేసి గెలుపొందాడు" అన్నాడు విలేకరి.

శ్రీకాకుళంలో జమీందారు, అప్పటి విద్యాశాఖమంత్రి ఎ.పి. పాత్రోమీద పుల్లెం శ్యామసుందరరావు గెలుపొందారు. ముఖ్యమంత్రి- బొబ్బిలి రాజాగారిమీద వి.వి.గిరిగారు గెలిచారు. విశాఖపట్నంలో భానోజీరావుగారి మీద తెన్నేటి విశ్వనాథంగారు గెలిచారు. పిఠాపురం రాజామీద కళావెంకట్రావుగారు, సర్‌కూర్మ వెంకటరెడ్డి నాయుడి గారిమీద కొప్పలి గోపాలరావుగారు గుంటూరుజిల్లాలో కుప్పుస్వామి చౌదరి గారి మీద కాసు వెంకటరెడ్డిగారు, నెల్లూరులో బెజవాడ రామచంద్రరెడ్డి గారిమీద బెజవాడ గోపాలరెడ్డిగారూ, వెంకటగిరి రాజామీద బద్దెపూడి వెంకట నారాయణరెడ్డిగారు... ఇలా కాంగ్రెస్ అభ్యర్థులు అనూహ్య విజయాలు సాధించారు. దాదాపుగా జస్టిస్ పార్టీ ఈ ఎన్నికల ఫలితాలతో అంతరించినట్లేనని భావించారంతా!

ఒకే ఒక్కరు... ఆంధ్ర ప్రాంతంలో జస్టిస్ పార్టి అవశేషంగా గెలిచారు... ఆయనే చల్లపల్లి రాజా!

తోటి అభ్యర్థి కూర్మయ్యగారిని గెలిపించుకొని బ్రహ్మయ్యగారు ఓడారు. తోటి అభ్యర్థి సుంద్రు వెంకయ్యగారిని ఓడించి చల్లపల్లి రాజా గెలిచారు. పాము తనగుడ్లు తానే తినడం అంటే ఇదే..." అన్నది ఆనాటి జనవాక్యం!!

"ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో జస్టిస్ పార్టీ ఆంధ్రప్రాంతంలో తుడిచిపెట్టుకు పోయిందిగానీ మిగతా తమిళనాడు,కర్నాటక, కేరళ, ఒరిస్సా ప్రాంతాలలో కొన్నిసీట్లు జమీందారులు దక్కించుకోగలిగారు. మనం ప్రయత్నం చేసినా ముఖ్యమంత్రి పదవి దక్కే అవకాశం లేదనిపిస్తోంది. ఎందుకంటే, అరవవారి ఆధిపత్యంలో కాంగ్రెస్ వుంది. ఢిల్లీ పెద్దలు అరవ వారికిచ్చిన మన్నన ఆంధ్రులకిస్తున్నట్లు కన్పించదు-" అన్నారు ప్రకాశంగారు.

"ప్రజలకోరికమాత్రం ప్రకాశంగారే ముఖ్యమంత్రి కావాలని వుంది. మీరు మౌనం వహించకండి! అరవవారి పెత్తనం ఎంతకాలం భరిస్తాం..." బులుసు సాంబమూర్తిగారు ప్రకాశంగారిని హెచ్చరించారు.

"గాంధీగారికి రాజగోపాలచారిగారికీ వున్న సంబంధబాంధవ్యాలు అందరికి తెల్సినవేకదా! గాంధీజీ మహాత్ముడే గానీ, రాగద్వేషాలకి అతీతులేమీకాదు. ఆయన రాజాజీ పేరునే సూచిస్తారు. మనందరం చచ్చినట్టు ఆమోదించాలి-" ప్రకాశంగారు చాలా నిరాశగా అన్నారు.

"ముందుగానే మనం ముఖ్యమంత్రి పదివికి పోటీలో వున్నట్లు తెలియజేద్దాం. గాంధీజీ మీ పేరుకూడా పరిశీలించే అవకాశం వుంది కదా..." అన్నారు బులుసు సాంబమూర్తిగారు - ఆంధ్ర ప్రాంత కాంగ్రెస్ కార్యదర్శి!

"నేను విచారణ చేశాను. మెజారిటీ సభ్యులు మనకే మొగ్గు చూపుతున్నారు. కానీ, అధిష్టానం ఆలోచనలు వేరేవిధంగా వున్నాయి. ఇంకా స్వాతంత్ర్యం రాకమునుపే అప్పుడే కొట్టుకొంటున్నారు... అని మనల్ని బ్రిటిష్‌వారు వేలెత్తి చూపించే ప్రమాదం వుంది... అందుకే ఎదురు తిరిగి పోటీచేయటానికి సంకోచిస్తున్నాను-" అన్నారు ప్రకాశంగారు. జస్టిస్‌పార్టీని ఆంధ్రలో సమూలంగా పెకలించివేసిన ఘనత ఆయనదే!! కానీ ఫలితం దక్కలేదు.

"పోటీ చేయడం అంటే పోట్లాడటమే నంటరా?" ప్రశ్నించారు సాంబమూర్తిగారు.

"ఈ సందర్భం మాత్రం అదే అవుతుంది. నేను పోటీకి దిగితే, రాజాజీ ఓటమి నా ఓటమి- అని గాంధీగారు ప్రకటిస్తారు అప్పుడు పరిస్థితి ఎలావుంటుందో ఊహించుకొని చూడండీ...?" అన్నారు ప్రకాశంగారి దూరదృష్టిని చూసి ఆశ్చర్యపోయారు సాంబమూర్తిగారు.

ఈలోగా రాజాజీగారు పంపించిన వ్యక్తి రాయబారానికి వచ్చినట్లు కబురందింది. "చూశారా! నేను చెప్పినట్లే జరుగుతోంది!" అన్నారు నవ్వుతూ ప్రకాశంగారు.



రాష్ట్రంలో ఎన్నికలు జరిగి కాంగ్రెస్ మెజారిటీ సాధించినా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయటంలో విపరీతమైన జాప్యం జరుగుతుండటంతో గవర్నర్ తన అసహనాన్ని ప్రకటించాడు.

"గవర్నర్‌గా నాకు కొన్ని అధికారాలున్నాయి. వాటిని అత్యవసర స్థితిలో తప్ప ఉపయోగించబోమని బ్రిటిష్ ప్రభుత్వం హామీ ఇచ్చింది. కానీ, మెజారిటీ పొందిన పార్టీ తన ముఖ్యమంత్రిని ప్రకటించి మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేయలేకపోయినప్పుడు... గవర్నర్‌గా అధికారాలు వినియోగించడం తప్పని సరి అని భావిస్తున్నాను. జస్టిస్ పార్టీ సభ్యులు కె.వి.రెడ్డినాయుడు గారిని ముఖ్యమంత్రి పదవి స్వీకరించి మంత్రి వర్గం ఏర్పాటు చేయవలసిందిగా కోర్తున్నాను. శాసన సభలో నెలరోజులలోగా మెజారిటీ నిరూపించుకోమని కూడా ఆదేశిస్తున్నాను" - సుదీర్ఘ ప్రకటనని విడుదల చేశారు గవర్నర్‌గారు.

గవర్నర్ గారి ప్రకటనతో ఆంధ్ర ప్రాంతంలో తీవ్ర ఆగ్రహావేశాలు వ్యక్తమైనాయి. హర్తాళ్ళు. బంద్‌లు జరగటం మొదలు పెట్టాయి. ప్రభుత్వ ఆస్తులు విధ్వంసానికి గురయ్యాయి. ఆంధ్రప్రాంతం అల్లకల్లోలం అయ్యింది.

"రెడ్డి నాయుడుగారు పరిస్థితి గమనించారు. స్వయంగా ప్రకాశంగారు వచ్చి చెబితే తప్ప ఈ మంటలు చల్లారవు..." అనుకున్నారాయన.

"ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో ఆంధ్రుల్ని కాదని కేవలం అరవ వారు సాధించగల్గిందేమీ లేదు.

ఆంధ్రుల్లోంచి జస్టిస్ పార్టీ సభ్యులు చల్లపల్లిరాజా ఒక్కరే గెలిచారు. మెజారిటీ లేదుకాబట్టి, మర్యాదగా తప్పుకుంటేనే మంచిది-" అని తలపోశారు రెడ్డినాయుడుగారు.

నేరుగా గవర్నర్ భవన్‌కు వెళ్ళారు.

"మీ ఆదేశానుసారం ప్రభుత్వం ఏర్పాటు చేయలేకపోతున్నాను. నన్ను మన్నించండి..." అన్నారు.



దేశశ్రేయస్సుకోరి కాంగ్రెస్ ఉద్యమంలో కలహాలు నివారించటం కోసం ప్రకాశంగారు ముఖ్యమంత్రి పదివిక్కి పోటీ చేయకూడదని నిర్ణయించారనీ, రాజాజీ నాయకత్వాన్ని అంగీకరిస్తూ ఆయన మంత్రి వర్గంలో రెండవ స్థానంలో రెవెన్యూ మంత్రిగా పనిచేయడానికి ప్రకాశంగారు అంగీకరించారనీ మర్నాడు వార్తాపత్రికలు పతాకశీర్షికలో ప్రచురించాయి.

మంత్రివర్గంలో మొదటిస్థానం ముఖ్యమంత్రి రాజాజీదైతే, రెండోస్థానంలో ప్రకాశంగారు వుండాలి. ఆ ఇద్దరిమధ్య కుదిరిన ఒప్పందం అదే... ప్రకాశంగారు ఉపనాయకుడని!!

కానీ ప్రమాణ స్వీకారం తర్వాత ఉపనాయకుడి హోదాకు నల్గురి పేర్లు సూచించారు రాజాజీ!

ప్రకాశంగారితో సహా అందరూ ఈ ప్రకటనతో ఖంగుతిన్నారు.

రాజాజీ గారిని మీరు నమ్మటం ఏమిటండీ...?" వెనకనుంచి అరిచారెవరో... అరిచిందెవరో తెలియదు.

"రాజాజీగారు మనకు మేలు చేస్తారని నేను ఏనాడూ కలలో కూడా అనుకోలేదు. గాంధీ గారు రాజాజీ చెప్పిన దానికి ఇచ్చేవిలువ ఆంధ్రులు ఎవరు చెప్పినా ఇవ్వరు. అదంతే!" ప్రకాశంగారు విశ్లేషించి చెప్పారు.

రాజాజీ ప్రకాశంగారిని కించపరిచాడని ఆంధ్రులంతా భావించారు.

"అయినా ఆ నలుగురిలో ఒకడిగానే నా ప్రతిభను చాటుకొంటాను-" అనునయించారు ఆంధ్రుల్ని ప్రకాశంగారు.

"రాజాజీ తన మంత్రి వర్గంలోకి బెజవాడ గోపాలరెడ్డిగారినీ, వి.వి.గిరి గారినీ తీసుకున్నారు. గోపాలరెడ్డిగారికి అప్పుడు కేవలం 30 ఏళ్ళేవయసు.

వేములకూర్మయ్యగారికి 34 సంవత్సరాలు. గోపాలరెడ్డిగారు విశ్వకవి రవీంద్రుని వద్ద శిక్షణపొంది వచ్చారు. శాంతినికేతన్ విద్యార్థి. కూర్మయ్యగారు సబర్మతి ఆశ్రమంలో శిక్షణ పొందారు. బెనారస్ హిందూ యూనివర్శిటీ విద్యార్థి!

"రాజాజీ మంత్రి వర్గంలో హరిజనులకు అన్యాయంజరిగింది" అని గాంధీగారికి స్వయంగా తెలియజేశారు కూర్మయ్యగారు.

"చీఫ్ పార్లమెంటరీ సెక్రటరీ పదవిని అయ్యదేవర కాళేశ్వరరావు గారికిచ్చారు. మీరూ, బియేస్ మూర్తి గారూ పార్లమెంటరి సెక్రటరీ పదవులు నిర్వహించండి! నరనారాయణుల్లా మీ ఇద్దరూ మంచి హరిజన నాయకులుగా రాణించండి-" అన్నారు రాజాజీ.

కూర్మయ్యగారికి రాజాజీ భాషలో వ్యంగ్యంవుందనిపించింది.

"హరిజనులు సమాజంలో రాణించడానికి గాంధేయ పద్ధతిలో అనేక ఉపాయాలున్నాయి. మీరు ఇవ్వజూపిన పార్లమెంటరీ సెక్రటరీ పదవి ద్వారా నేను హరిజనులకు చేయగల్గిన సేవ ఏమిటో చెప్పండి-" కొంచెం కటువుగానే అన్నారు కూర్మయ్యగారు.

రాజాజీ గారు సమాధానం చెప్పలేదు. అంతకన్నా హరిజనులకు ఇచ్చేదేమీ లేదనే అభిప్రాయంలో రాజాజీ వున్నట్లు అర్థం అయ్యింది కూర్మయ్యగారికి! నమస్కారం చెప్పి బైటకు వచ్చేశారు.

మంత్రి పదవి లేకపోయినా, అసెంబ్లీ సభ్యత్వాన్ని సద్వినియోగంచేసుకొని హరిజనులకు ఉపయోగించే చట్టాలు చేయటానికి పూనుకోవాలని నిర్ణయించుకొన్నారాయన.



"హరిజనోద్ధరణ కోసం మీ సహకారాన్ని అర్థించడానికి వచ్చాను---" వస్తూనే నమస్కరిస్తూ అన్నారు కూర్మయ్యగారు.

కూర్చోమని గౌరవంగా ఆహ్వానించారు ప్రకాశంగారు.

"ఆరోజు మీరు పోటీ చేయమని కోరితేనే పోటీకి దిగాను. కానీ, గెలిచి సాధించేదేమిటో నాకు అంతుబట్టడం లేదు..." బాధగా అన్నారు కూర్మయ్యగారు.

రెవెన్యూమంత్రి ప్రకాశంగారి ఛాంబర్‌లో కూర్మయ్యగారు ప్రకాశంగారిని కలుసుకొన్నారు.

"మీరు సరిగ్గా సమయానికి వచ్చారు. నేనే మిమ్మల్ని కలుసుకోవాలనుకొన్నాను. రాష్ట్రంలో రైతాంగ సమస్యలను పరిష్కరించటం కోసం ఒక నివేదికను తయారు చేస్తున్నాను. హరిజనుల్లో అధికులు రైతుకూలీలుగా వున్నారు...కదా..! ఆ విషయంపై మీతో చర్చించాలనుకున్నాను", అన్నారు ప్రకాశంగారు.

"మీరు నివేదికను తయారుచేసి సభలో చర్చకు పెడతారని తెలిసే వచ్చాను- హరిజనులు తమ జీవన స్థితి గతుల్ని మెరుగుపరుచుకునే అవకాశాలు కల్పించండి. అంటరానితనాన్ని అధికారికంగా నిర్మూలించండి. హరిజన దేవాలయ ప్రవేశాన్ని చట్టబద్ధం చేయించండి." మూడంటే మూడే కోర్కెలు కోరారు కూర్మయ్యగారు.

"ప్రభుత్వం తక్షణం పూనుకుంటే, ఒక ఏడాది కాలంలో కనీసం 25 లక్షలమంది హరిజన గిరిజన బాలబాలికలకు లబ్ధి చేకూరుతుందది! ఇవిగో ఈ గణాంకవివరాలు పరిశీలించండి... మీకు ఇంకా ఏ వివరాలు కావాల్సినా నేను అందించగల్గుతాను!" ప్రాధేయపడ్డారు కూర్మయ్యగారు.

రైతాంగ చరిత్రలో చిరస్మరణీయంగా నిలిచి పోయే నివేదికను రూపొందించాలని నా ఆశ! రాష్ట్రంలో జమీందారీ స్థితిగతుల్ని విచారించి రైతుల శిస్తు భారాన్ని తగ్గించేందుకు సమగ్ర నివేదికను తయారు చేయమని నా అధ్యక్షతన మంత్రివర్గ ఉపసంఘాన్ని వేశారు. ఈ నివేదికలో మీరు అందించిన వివరాలన్ని పొందు పరుస్తాను. రైతు ఋణ విమోచనం, మద్యపాన నిషేధం, అంటరానితన నిర్మూలన, దున్నే రైతులకు భూమి హక్కు కల్పించటం, దళారులను తొలగించటం ఇవన్ని కాంగ్రెస్ విధానాలు... ప్రజలకు ఈ మేరకు మనం వాగ్దానం చేశాం. నా నివేదికలో ఈ అంశాలన్నీ ప్రస్తావిస్తాను-" హామీ ఇచ్చారు ప్రకాశంగారు.

అనుకున్నట్లుగానే అనతికాలంలోనే "ప్రకాశంగారి నివేదిక"ని అసెంబ్లీకి సమర్పించారు. కూర్మయ్యగారు ఆని వేదికపై తన అభిప్రాయాన్ని అసెంబ్లీలో తెలియజేస్తున్నారు.

"అధ్యక్షా! జమీందారీల రద్దు, దున్నేవాడిదే భూమి, మద్యపాననిషేధం, హరిజన దేవాలయ ప్రవేశం, అంటరానితనం నిర్మూలన... కార్యక్రమాలను ప్రకాశంగారు ప్రతిపాదించారు. ఇది చాలా సంతోషించవలసిన విషయం.

ముఖ్యంగా హరిజన సమస్యలగురించి మాత్రమే ఇప్పుడు నేను ప్రస్తావిస్తున్నాను.

అధ్యక్షా! గత అనేక సంవత్సరాలుగా అంటరానితనం నిర్మూలన గురించి, హరిజన దేవాలయ ప్రవేశం గురించీ కాంగ్రెస్ వారు అనేక ఉద్యమాలను నిర్వహించారు. ప్రజల్లో ఎంతో చైతన్యాన్ని తీసుకురాగలిగారు. కానీ చట్టబద్ధత లేకపోవటం వలన అంటరానితనాన్ని ఆపలేకపోతున్నాం. హరిజన దేవాలయ ప్రవేశాన్ని నిరవధికంగా కొనసాగింపచేయలేకపోతున్నాం.

కాబట్టి, హరిజనులకు విడిగా ప్రత్యేకమైన చట్టపరమైన రక్షణ కల్పించవలసిందిగా నేను తమ మాధ్యమం ద్వారా ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను.

"సివిల్ డిజెబిలిటీ"ని నిరోధిస్తూ ఒక చట్టాన్ని చేయవలసిందిగా నేను ప్రతిపాదిస్తున్నాను. అలాగే హరిజనుల దేవాలయప్రవేశాన్ని అడ్డుకునే అధికారం ఎవరికీ లేకుండా నిరోధిస్తూ కూడా చట్టం చేయవలసిందిగా ప్రతిపాదిస్తున్నాను.

మహాత్మునికి అత్యంత ప్రియులైన మన గౌరవ ముఖ్యమంత్రిరాజాజీగారు మహాత్ముని కార్యక్రమాలైన ఈ రెండింటినీ శ్రద్ధగా పరిశీలించి తక్షణం ఆమోదించి చట్టంచేయవలసిందిగా వారిని తమ మాధ్యమం ద్వారా మరొక్కసారి ప్రార్థిస్తున్నాను.

ఏ దేవాలయంలో హరిజనుల్ని రానివ్వరో ఆదేవాలయాధికారుల మీద కఠిన చర్య తీసుకోవాలి. ఏ కులస్థులైనా సరే... హరిజనుల పట్ల అంటరాని తనాన్ని పాటిస్తే తక్షణం జరిమానా జైలుశిక్షలు విధించేలా చట్టాలు రూపొందాలి.

సామాజిక విచక్షతని నిరోధించే చట్టంలో హరిజనులకు నదులు, కాలువలు, చెరువులు, తటాకాలు, నూతుల్లో నీళ్ళని వాడుకొనే అవకాశం కల్పిస్తున్నట్లు స్పష్టంగా పేర్కొనాలని నేను కోర్తున్నాను.

అగ్రహారాల్లోనూ, ప్రధాన వీధుల్లోనూ, స్కూళ్ళలోనూ, మార్కెట్లలోనూ, బహిరంగ స్థలాల్లోనూ హరిజనులు స్వేచ్ఛగా తిరగటాన్ని అనుమతించాలని కూడా నేను ప్రతిపాదిస్తున్నాను.

సంతల్లో గాని, మార్కెట్లలోగాని, షాపుల్లోగాని హరిజనులు స్వేచ్ఛగా వస్తువులు కొనుగోలుచేసే అవకాశాన్ని కల్పించాలి. ఈనాటికీ హరిజనులకు ఈ స్వేచ్ఛలేదని, ఈ చట్టం ద్వారా మాత్రమే వారికి ఆ హక్కు ఏర్పడుతుందని గౌరవనీయులైన ముఖ్యమంత్రిగారికి తమద్వారా నేను మనవిచేస్తున్నాను.

అధ్యక్షా! వస్తువులు కొనుగోలు చేసేప్పుడు వ్యాపారులు చాలామంది హరిజనులకు అమ్మటానికి నిరాకరిస్తూ వారిని హేళన చేసి అవతలకు తరిమేసిన సంఘటనలు కొల్లలుగా నేనెరుగుదును.

ఇకపై అలాంటి అగ్రవర్ణాల దౌష్ట్యం హరిజనులపై సాగనివ్వరాదని నేను ప్రభుత్వాన్ని పదేపదే కోర్తున్నాను.

అలాగే, హరిజనులను దేవాలయాల్లోకి రానివ్వకుండా ప్రతిఘటించే సనాతన వాదులపై చట్టబద్ధంగా చర్యతీసుకునే అవకాశాన్ని ప్రభుత్వ అధికారులకు దేవాలయ పాలక వర్గానికి కల్పించే విధంగా చట్టాన్ని రూపొందించవలసిందిగా కూడా కోర్తున్నాను.-"

అనర్గళంగా ఉపన్యసించసాగారు కూర్మయ్యగారు ఆనాటి ఆయన ప్రసంగధాటి... ప్రతి హరిజనుడి ఆర్తినీ ప్రతిబింబించింది.

ఊపిరి బిగపట్టి వింటున్నారు అసెంబ్లీలో కూర్మయ్యగారి ప్రసంగాన్ని తోటి సభ్యులంతా!

స్పీకర్ బులుసుసాంబమూర్తిగారు కూర్మయ్యగారి ఆలోచన విధానాన్ని ఆమోదిస్తూ మెచ్చుకోలుగా చూశారు.

"అధ్యక్షా! చివరిగా ఒక మనవి! స్థానిక సంస్థల్లో హరిజనుల్ని కూడా సభ్యులుగా నామినేట్ చేస్తే, హరిజనుల సమస్యల గురించి ప్రభుత్వ పరంగా చర్యలు తీసుకోవటానికి ఎక్కువ అవకాశం వుంటుందని భావిస్తున్నాను.-" అంటూ తన ప్రసంగాన్ని ముగించారు. చప్పట్లతో అసెంబ్లీ హాలు దద్దరిల్లింది.

ఆసాంతం ఆయన ఉపన్యాసం శ్రద్ధగా విన్న ముఖ్యమంత్రి రాజాజీ లేచి నిలబడి కూర్మయ్యగారిని ప్రశంసించారు.

"కూర్మయ్యగారి ప్రతి పాదనలన్నీ చిరకాలంగా కాంగ్రెస్ డిమాండ్ చేస్తున్న అతిముఖ్య విషయాలు! మహాత్మాగాంధీ కలలుగన్న స్వరాజ్యాన్ని మనం నిర్మించుకోవాలంటే, ఈ మద్రాసు రాష్ట్రంలో హరిజనుల పట్ల అన్నిరకాల వివక్షతల్ని తొలగించి తీరాలని నేను కూడా భావిస్తున్నాను. తక్షణం వాటిని చట్ట రూపేణా ఇదే సభలో ప్రవేశ పెట్టానని హామీ ఇస్తున్నాను-" కొత్తచట్టాన్ని రూపొందించేందుకు ఎం.సి. రాజా అధ్యక్షతన సెలెక్ట్ కమిటీని వేస్తున్నాను. అందులో వేముల కూర్మయ్యగారిని కూడా సభ్యుడిగా వుండమని కోర్తున్నాను-" అన్నారు.

ఇది కూర్మయ్యగారి విజయం!

ఇది కాంగ్రెస్ వారందరి విజయం!!

ఇది మహాత్ముడి కార్యాచరణకు విజయం!!!



1939 సెప్టెంబర్ 3వ తేదీ

రెండో ప్రపంచ యుద్ధం ముంచుకొస్తోంది.

యూరప్‌లో చెలరేగిన యుద్ధం క్రమంగా ఒక్కొక్కదేశాన్ని రగులుకొంటూ, రాజుకొంటూ ప్రపంచయుద్ధంగా మారిపోతోంది...

"భారతీయులకు ఈ యుద్ధంతో ఎటువంటి సంబంధంలేదు. అయినా ఏ సంబంధంలేకపోయినా మనల్ని ఈ యుద్ధంలోకి లాగింది బ్రిటిష్ ప్రభుత్వం. మనతో సంప్రదించకుండా, మన అంగీకారం లేకుండా మననెత్తిన రుద్దిన ఈ యుద్ధాన్ని వ్యతిరేకిద్దాం! బ్రిటిష్ వారి ఈ చర్యకు నిరశనగా దేశంలోని అన్ని కాంగ్రెస్ ప్రభుత్వాల్ని రాజీనామా చేయాల్సిందిగా కోరడమైనది,.. " అని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీర్మానించింది.

దేశంలో కాంగ్రెస్ ఆధ్వర్యంలోని ఆరు రాష్ట్ర ప్రభుత్వాలూ రాజీనామా చేశాయి.

27నెలల పాలనతోనే ఉమ్మడి మద్రాసు రాష్ట్ర పాలననుంచి రాజాజీ ప్రభుత్వం రాజీనామాచేసి నిష్క్రమించింది. కాంగ్రెస్ శాసన సభ్యులంతా రాజీనామా చేశారు.

"ఈ పదవులు హరిజనోద్ధరణకు ప్రత్యేకంగా ఉపయోగ పడేదేమీలేదు... ఏ ఉద్యమం అయినా ప్రజాచైతన్యం వలనే సాధ్యపడ్తుంది గానీ... ప్రభుత్వాలు నడపటం వలన కాదు-" అన్నారు బెజవాడకు మాజీ శాసన సభ్యుడిగా తిరిగివచ్చిన వేములకూర్మయ్యగారు.

1940 అక్టోబర్ 17...

యుద్ధం తీవ్రాతితీవ్రంగా సాగుతోంది. రోజుకొక్క దేశం యుద్ధవార్తల్లె కెక్కుతోంది.

"ఆసియా ఆఫ్రికా బడుగు దేశాలమీద తమ ఆధిపత్యాన్ని కాపాడుకోవడానికి సామ్రాజ్యవాద దేశాలు, ఫాసిస్ట్ దేశాలూ ముఠా కట్టి ఈ యుద్ధానికి తలపడ్డాయి. ఇందులో భారతీయులు ఎందుకు తలదూర్చవలసి వస్తోందో నాకర్థం కావటంలేదు...' ' మహాత్మాగాంధీ కూడా ఇదేవిషయం చెప్తున్నారు-" అన్నారు కూర్మయ్యగారు.

"జర్మనీ వంటి దేశాలను బ్రిటిష్ ప్రభుత్వం ఫాసిస్ట్ ప్రభుత్వాలుగా ముద్రవేసి వాటితో యుద్ధానికి తలపడుతోంది. కానీ, అంతకన్నా ముందు భారత దేశానికి స్వాతంత్ర్యాన్ని ప్రకటించి ఆ తర్వాత ఇతరుల్ని నియంతలుగా చిత్రిస్తే బావుండేది. గురివిందగింజ తంతులా వుంది బ్రిటిష్‌వారి వాదన. వారికి ఇతరదేశాల నియంతృత్వమే కన్పిస్తోంది. తన నియంతృత్వం గురించి మాత్రం పెదవి విప్పడంలేదు-" అని ఎద్దేవా చేశారాయన!

ఈలోగా వైస్రాయి గాంధీజీని కలిసేందుకు ప్రయత్నించారు.

"ఈ పరిస్థితులో గ్రేట్‌బ్రిటన్‌కు ఎటువంటి అండనూ ఇవ్వటం భారతీయులకు సాధ్యం కాదు-" అని విస్పష్టంగా ప్రకటించారు గాంధీజీ.

'నాజీల' నియంతృత్వానికీ, మీ బ్రిటిష్‌వారి పాలనకూ తేడా వుందని మా భారతీయులెవరూ భావించడంలేదు. ఈ యుద్ధంలో భారతీయుల మద్దతు కోరటం కన్నా బ్రిటన్‌కు సిగ్గుచేటైన అంశం ఇంకొకటి ఉండదు-" అని వైస్రాయికి సమాధానం పంపారాయన.

ఆ వెంటనే వ్యక్తి సత్యాగ్రహానికి పిలుపునిచ్చారు.

బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా నిలబడి దేశంలో ప్రతిఒక్కరూ అరెస్టు కావాలనేది ఈ సత్యాగ్రహం ఉద్దేశం.

గాంధీగారి వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమాన్ని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఆమోదించటంతోనే సత్యాగ్రహ కార్యక్రమం ప్రారంభం అయ్యింది.

"ప్రప్రథమ సత్యాగ్రహిగా ఆచార్య వినోబా భావేని నేను ప్రకటిస్తున్నాను. ఆయనను అరెస్టు కావలసిందిగా కోర్తున్నాను-" అన్నారు గాంధీ!

అంతవరకూ వినోబా భావేగారి పేరు దేశంలో దాదాపుగా ఎవరికీ తెలియదు. అంతా ఆశ్చర్యపోయారు.

"గాంధీగారు దేశానికి పనికివచ్చే వ్యక్తులను ఎన్నికచేసే విధానం ప్రత్యేకంగా వుంటుంది. ఆయన దృష్టికోణానికి ఇతరుల దృష్టికోణానికీ చాలా తేడావుంది. మన ఆంధ్రాలో ఎక్కడో కృష్ణాజిల్లా పల్లెటూరులో వున్న వేములకూర్మయ్యగారిని బెనారస్ విశ్వవిద్యాలయంలో మొదటి హరిజన విద్యార్థిగా ఎంపిక చేసి పంపించారు.

ఈ రోజున ఆయన శాసనసభ్యుడి స్థాయికి ఎదిగారు. దక్షిణభారతదేశంలోనే ప్రముఖ హరిజన నాయకుడిగా రాణించారు. అదీ గాంధీ గారంటే! బహుశా ఈ వినోబా భావేగారు కూడా అలాగే రేపు తనదైన ప్రత్యేకతతో గొప్ప దేశభక్తుడిగా రాణించగలడనే నా నమ్మకం!!" అని చాలామందితో తన అభిప్రాయాన్ని ప్రకటించారు పట్టాభిగారు.

ఆంధ్రప్రాంతానికి వచ్చేసరికి మొట్టమొదటి సత్యాగ్రహిగా ప్రకాశంగారు అరెస్టయ్యారు.

పట్టాభిగారు ప్రకాశంగారి స్థానంలో ఆంధ్ర కాంగ్రెస్ బాధ్యతలు స్వీకరించారు. కళా వెంకట్రావుగారు కార్యదర్శి. వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొనమని వారిద్దరూ ప్రజల్ని ప్రోత్సహించే కార్యక్రమం తక్షణం చేపట్టారు.

"పట్టాభిగారు, కళావెంకట్రావు గారు కొంత కృషిచేసి 1500 మంది పేర్లతో ఆంధ్ర సత్యాగ్రహుల జాబితాను తయారు చేశారు. ఒక్కొక్కరే వరుసక్రమంలో సత్యాగ్రహం చేసి అరెస్టు అవుతారని కాంగ్రెస్ కార్యదర్శి కళా వెంకటరావు గారు ప్రకటించారు-" అని ఆంధ్ర పత్రిక, హిందూ పేపర్లలో వార్త వెలువడింది. "ఈ జాబితాను 'ఆంధ్ర సర్క్యులర్'గా వ్యవహరిస్తున్నారు-" అని కూడా ఆ వార్తలో వచ్చింది.

"తెల్లవారేసరికి ఆంధ్రా సర్క్యులర్ చాలా ప్రకంపనాలు రేపింది. బ్రిటిష్ పార్లమెంట్‌కు కూడా ఆ ప్రకంపనాలు చేరాయి. అరెస్టు కావలసిన వ్యక్తుల జాబితాని ఈ విధంగా ప్రకటించి ఆంధ్రులు సంచలనం సృష్టించారు. బ్రిటిష్ పార్లమెంట్‌లో ఈ సర్క్యులర్ పైన చర్చసాగుతోంది-" అని ఢిల్లీనుంచి వార్తా సంస్థల కథనంగా పత్రికలు రాశాయి.

"గుడివాడలో వేముల కూర్మయ్యగారు అరెస్టయ్యారు ఆయన్ని రాయవేలూరు జైలుకి తరలించారు. వారం రోజులు గడిచేసరికి 1500 జాబితాని దాటి రెండువేల మూడువందల మంది సత్యాగ్రహులు అరెస్టయ్యారు. వీరందరినీ రాయవేలూరు జైలులో వుంచారు. ప్రస్తుతం రాయవేలూరు జైలు సత్యాగ్రహుల తిరణాల లాగా వుంది..." అని వ్యాఖ్యానించింది ఆంధ్ర పత్రిక..

రోజూ అరెస్టులు సాగుతూనే వున్నాయి.

1941 నాటికి యుద్ధం పతాక స్థాయికి చేరుకొంది.

"పోలెండ్, బెల్జియం, హాలెండ్, నార్వే, ఫ్రాన్సు, తూర్పు యూరప్‌లలో అనేక ప్రాంతాల్ని జర్మనీ జయించి ప్రపంచంలో అత్యంత బలమైన దేశంగా చాటుకొంది.

జర్మన్లు ఆర్యులని, ప్రపంచానికి నాగరకత నేర్పిన దేవుడి తనయులనీ హిట్లర్ సగర్వంగా ప్రకటించాడు.

తానే దేవుణ్ణనన్నంత అతిశయంతో సోవియట్ యూనియన్ పైకి సేనల్ని నడిపించాడు. విశ్వవిజేత అలెగ్జాండర్‌ని మించిపోయిన గర్వంతో, అహంకారంతో సోవియట్ యూనియన్‌ని కాలరాస్తానని ప్రకటించాడు.

ఇతగాడి దురహంకారానికి ఈ యుద్ధంలో గుణపాఠం తప్పక కల్గుతుంది-" అని ముట్నూరి కృష్ణారావుగారు కృష్ణాపత్రికలో సంపాదకీయం రాశారు. భారతదేశంలో సనాతన వాదులు కొందరు ఈ ఆర్యుల వాదనని నమ్మి హిట్లరుకు జయం కలగాలని పూజలు చేస్తున్నట్లుకూడా ఆయన వ్యాఖ్యానించారు. అది వారి అవగాహన లోపంగా ఎత్తి చూపారు.

అప్పటిదాకా కొంత మౌనాన్ని పాటించిన జపాన్ అమెరికాలో పెరల్ హార్బర్ మీద హఠాత్తుగా దాడి చేసి యుద్ధంలో తన ఉనికిని చాటుకునే గట్టి ప్రయత్నం చేసింది.

జర్మనీ, ఇటలీ, జపాన్‌లు ఈ యుద్ధంలో అక్షాంశ కూటమిగా (AxisPowers) ముఠాకట్టి సహకరించుకున్నాయి. ఇప్పటివరకూ జరిగిన యుద్ధంలో ఈ మూడు దేశాల కూటమిదే పైచేయిగా మారింది.

హిట్లరు ఆధిపత్యంలోకి దాదాపు ఆరవైఐదు రాజ్యాలు లొంగిపోయాయని వార్తలు చెప్తున్నాయి.

పరిస్థితి గమనిస్తున్నారు గాంధీ!

భారత ఉపఖండంలో ఫిలిప్పీన్స్, ఇండోనేషియా, మలయా, సింగపూర్, బర్మాలపైన జపాన్ గెల్చింది. ఆయా దేశాల్లో వలస పాలన సాగిస్తున్న బ్రిటీష్‌వారు తమ వలస హక్కుని వదులుకొని తోకముడుచుకొని ఇవతలకు వచ్చేశారు-

"ఒక విధంగా ఇప్పటివరకూ సాగిన యుద్ధంలో గ్రేట్ బ్రిటన్ నీచాతినీచంగా జపాన్‌కు లొంగిపోయినట్లే నేను భావిస్తున్నాను-" అన్నారు గాంధీజీ.

"ఈ ఊపు ఇలానే కొనసాగితే గ్రేట్ బ్రిటన్ నిస్సిగ్గుగా వెండి పళ్ళెంలో పెట్టి భారత దేశాన్ని జపాన్‌కు అప్పగించేసేలా వుంది..." తన అనుమానాన్ని బహిరంగంగానే వ్యక్తపరిచారు గాంధీజీ!

"అమాయకులైన భారతీయులపైన కాదు ప్రతాపం చూపవలసింది! యుద్ధరంగంలో చూపండి మీ పౌరుషం, ప్రతాపం..." అని బ్రిటిష్ వారిని మరో సారి ఎద్దేవా చేశారాయన.

"భారత దేశంపైకి జపాన్ దండెత్తి వస్తే బ్రిటిష్ వారు తప్పకుండా మనల్ని మన మానాన వదిలేసి పారిపోతారని నాకూ అన్పిస్తోంది" అన్నారు పండిట్‌జీ.

గాంధీజీ, నెహ్రూ, మౌలానా ఆజాద్, సర్దార్ పటేల్... పెద్దలంతా సమాలోచనలో కూర్చున్నారు.

"ఫాసిజానికీ, ఇంపీరియలిజానికీ మధ్య జరిగే పోరాటంగానే మనం ఈ యుద్ధాన్ని భావించుకున్నాం. అందుకే ఏవైపూ మొగ్గకూడదనే నిర్ణయంతో ఇన్నాళ్ళు వున్నాం. కానీ, మారిన పరిస్థితుల్లో మనం కూడా మన పంథాని మార్చుకోవాలని భావిస్తున్నాను-" గాంధీగారు కొత్త ఆలోచన ఏదో ప్రతిపాదించబోతున్నట్లు అందరూ ఆయన వంకచూశారు.

"బ్రిటిష్ వారికి సాయపడ కూడదనేది మన నిర్ణయం. కానీ, గ్రేట్ బ్రిటన్ బలహీనతలు కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నాయి. అదిప్పుడు రెక్కలు తెగిన పక్షి! రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం ఈ యుద్ధంతో కోరలుతీసిన పాములా మిగిలిపోయింది. ఇప్పుడు భారతదేశాన్ని బ్రిటన్ రక్షించే స్థితిలో లేదు. మనదేశాన్ని మనమే రక్షించుకోవాలి...", గాంధీగారు ఒక నిర్ణయానికి వచ్చినట్లు స్పష్టీకరించారు.

"గ్రేట్ బ్రిటన్ మామూలు బ్రిటన్‌గా మారిపోయింది. కాలం ఖర్మం కలిసిరాకపోతే, ప్రపంచ పటంలోంచి అది నిష్క్రమించినా ఆశ్చర్యపోనవసరం లేదు. కానీ, ఒక నియంతని ఓడించి మరో నియంతగాని, నియంతల కూటమిగానీ భారతీయుల్ని గెల్చుకొని వేటకుక్కలు మాంసాన్ని పంచుకొన్నట్లు మనల్ని పంచుకొనే పరిస్థితి ఏర్పడకూడదు" పటేల్‌గారు చాలా ఆవేశంగా అన్నారు.

"బ్రిటన్ పునాదులు కదిలిన ఈ నేపథ్యంలో ఆత్మ సంరక్షణ చేసుకోవటం ఎలా? జపాన్‌తో ముంచుకొస్తున్న యుద్ధ ప్రమాదాన్ని నివారించేదెలా?" అడిగారు మౌలానా అజాద్ గారు.

"నిజానికి యుద్ధభయం పీడించవలసింది బ్రిటిష్‌వారినే గానీ, భారతీయుల్ని కాదు... జపాన్‌పైకి నేరుగా యుద్ధానికి పోవలసిన అవసరం భారతీయులకు లేదు. జపాన్ వారు భారత్‌పైకి దాడిచేయటానికి ముందే బ్రిటిష్ వారిని కాళ్ళబేరానికి రప్పించే ఆలోచన చేయాలి..." అన్నారు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ!

అంతలో రాజీ ప్రతిపాదనలతో లండన్‌నుంచి క్రిప్స్ దొరగారు భారతదేశానికి వస్తున్నారని, వారితో చర్చలకు రావల్సిందిగా ఆహ్వానంతో వైస్రాయి ప్రతినిధి ఢిల్లీనుంచి వచ్చారు. కథ మరో మలుపు తిరిగింది!



"ప్రస్తుతానికి స్వపరిపాలనాధికారాన్ని మీ భారతీయులకు ఇస్తాం. భవిష్యత్తులో మీ కోసం చాలా అవకాశాలు కల్పిస్తామని హామీకూడా ఇస్తున్నాం. ఈ యుద్ధంలో బ్రిటన్‌కు సహకరించండి- ఒక అడుగు మీరు పైకిరండి. ఒక అడుగు మేం క్రిందికి దిగుతాం. రాజీమార్గాన పోదాం..." ప్రాథేయ పడ్తున్నట్లుగా అన్నారు సర్ స్టాఫర్డ్ క్రిప్స్.

క్రిప్స్‌దొరగారు మంచి పండితుడు. భారతీయులంటే సానుభూతి కల్గిన వాడని పేరు. ఆయన రాయబారం కాబట్టి గాంధీజీ చర్చలకు అనుమతించారు.

రాజీముసాయిదాను పరిశీలన కోసం అందించాడు క్రిప్స్ దొర.

చదివారు పండిట్‌జీ!

"భారతీయులకు స్వపరిపాలనని అంగీకరిస్తున్నాం. భారతదేశంలో చేరకుండా పూర్తిస్వతంత్రంగా. ఏ రాష్ట్రం అయినా వుండదలిస్తే, దానికి కూడా ఇలానే స్వపరిపాలనాధికారాలు కల్పిస్తాం..." అన్న నిబంధనని పైకి చదివారు నెహ్రూ!

"ఇదెక్కడి అన్యాయం..?" కోపంగా అన్నారాయన.

"మీరు చర్చలకొచ్చారా? భారతీయుల్ని చీల్చడానికి వచ్చారా...?" అం ముసాయిదా పత్రాన్ని చింపినేలకేసి కొట్టారు.

"మీ రాజీ ప్రదిపాదనల్ని మేం వ్యతిరేకిస్తున్నాం" అంటూ కాంగ్రెస్ వాదు లేచి నిల్చున్నారు.

హిందూమహాసభ ప్రతినిధులుకూడా తమ వ్యతిరేకతని తెలిపారు.

సిక్కు ప్రతినిధులు ఆగ్రహంతో ఊగిపోయారు.

స్వంత ఇబ్బంధులుండటంతో ముస్లింలీగ్ కూడా ఈ ప్రతిపా త్రోసిపుచ్చింది.

డా॥బాబాసాహెబ్ అంబేద్కర్ ఈ ప్రతిపాదనని దుష్ట చింతనగా అభివర్ణిం

అంతా కలిసే వాకౌట్ చేశారు.

"క్రిప్స్ రాయబారం విఫలం అయ్యింది-" అని పత్రికలు ప్రకటించాయి

చేతికొచ్చిన అవకాశం నోటికందకుండా పోయిందని బాధపడ్డారు నెప్ర చింతచచ్చినా పులుపు చావనట్లు బ్రిటిష్ వారు తమ వెనకటి గుణ మార్చుకోలేకపోయినందుకు నెహ్రూగారు చాలా బాధపడ్డారు. "దేశరక్షణ భా వహించే అవకాశాన్ని దేశనాయకులు చేజార్చుకున్నట్లయ్యింది... మిత్ర దేశాలు చే ఈ ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో భారతీయుల ప్రమేయం లేకుండా పోవటం క చరిత్రలో ఒక మచ్చగానే మిగిలిపోతుంది మనకి! భారతదేశంపై బ్రిటన్ సామ్రాజ్య ఆధిపత్యాన్ని అంతం చేయటానికి పోరాటం జరపాలి. అయితే, అదే సమయ శత్రు దేశాలతో జరుపుతున్న యుద్ధంలో రష్యా చైనాలని వదిలేయటంకూడా మం కాదు..." అన్నారు పండిట్‌జీ!

ఈ విషయంపై గాంధీ- నెహ్రూల మధ్య వాడివాడిగా చర్చలు జరిగా వార్తలు వచ్చాయి.

"బ్రిటిష్ సైన్యం భారతదేశంలో వుండటానికి నాకు అభ్యంతరం లే భారతదేశానికి రాజకీయాధికారం అప్పగించినట్లయితే, ఇక్కడినించే బ్రిటిష్ సై పనిచేసేలా సైనిక స్థావరాలు ఇవ్వటానికికూడా నాకు అభ్యంతరం లేదు. ఒ ఇవేవీకాదని బ్రిటిష్ వారికి బేషరతుగా మద్దతిచ్చేందుకు మీరంతా నిర్ణయించినట్లయ ఈ కాంగ్రెస్‌ను నేను వదిలేస్తాను. ఈ దేశపు ఇసుకరేణువుల్లోంచి కూడా ఉద్యమ ఎలా సృష్టించాలో నాకు బాగా తెలుసు-" అని గాంధీగారు కటువుగా అన్నా కూడా వార్తా కథనాలను పత్రికలు రాశాయి.

గాంధీగారి ఆవేశ పూరిత ప్రసంగం విన్నాక ఎవరూ మాట్లాడలేదు. ప్ర చర్యకు పూనుకునేలా జాతీయకోర్కెను రూపొందించే నిమిత్తం ఆగస్ట్ 15 బొంబాయిలో అఖిలభారత కాంగ్రెస్ మహాసభలు జరపాలని నిర్ణయించారు అక్క ఆ చర్చలు ఆగిపోయాయి.

చైనా జనరల్ చాంగ్‌కైషేక్, అమెరికా అధ్యక్షులు రూజ్‌వెల్టు.. భారత బ్రిటన్‌ల మధ్య ఏర్పడిన ప్రతిష్టంభనను వెంటనే పరిష్కరించుకోమని బ్రిటన్‌కు సూచించాయి.

"అయినా బ్రిటన్ ప్రధాని చర్చిల్‌గారు తన మంకుపట్టు వీడలేదు- భారతదేశానికి విలువ ఇచ్చేందుకు ఆయన సుముఖంగా లేరు-" అని భారతీయ పత్రికలు వ్యాఖ్యానించాయి.

"బ్రిటిష్ సామ్రాజ్యం అంతానికి అధ్యక్షత వహించడం కోసం ఈ మహాదేశానికి నేను ప్రధాన మంత్రిగా పనిచేయటం లేదు- భారతదేశానికి తలవొంచే సమస్యే లేదు " అని ఖండితంగా ప్రకటించారట చర్చిల్.

యుద్ధం అప్రతిహతంగా సాగిపోతోంది. జర్మనీ సేనలు, సోవియట్ సేనలూ హోరాహోరీ తలపడ్తున్నాయి.

శత్రువుకు శత్రువు మిత్రుడవుతాడు. బ్రిటిష్‌వాళ్ళని ఎదిరిస్తున్న జర్మన్లకూ జపాన్‌వారికీ మనం సాయపడాలి - అన్నారు నేతాజీ. సరిగ్గా ఇదే సమయంలో ప్రత్యేక పాకిస్థాన్ కోసం డిమాండ్ చేశారు మహమ్మదాలీజిన్నాగారు! జర్మనీ సోవియట్ యూనియన్ పైన దాడిచేశాక కమ్యూనిస్టులు ఈ యుద్ధాన్ని ప్రజాయుద్ధంగా ప్రకటించారు.

యుద్ధం ఆసియా దేశాలక్కూడా క్రమేణ వ్యాపిస్తోంది. కార్చిచ్చు రగిలినట్లు సమస్త భూమండలాన్ని ఈ యుద్ధ దావానలం ఆక్రమిస్తున్నట్లే కనిపిస్తోంది.

జపాన్ కళ్ళు - ఫిరంగిగుళ్ళు... అందరూ భయపడ్డట్లుగానే భారతదేశం మీద పడ్డాయి.



తూర్పు సరిహద్దుల్లోంచి బంగాళాఖాతం మీదుగా భారతదేశంలోకి చొరబడే ప్రయత్నాలు చేయటం మొదలు పెట్టింది జపాన్.



విశాఖ పట్నంహార్బర్ మీద జపాన్ విమాన దాడులు జరిగాయి.

ఆంధ్రులు అల్లల్లాడిపోయారు.



ఏ క్షణాన ఏ విమానం మరణనాదం మోగిస్తూ ఆకాశంలోంచి నిప్పుల వర్షం కురిపిస్తుందో తెలియకుండా వుంది.

"పశ్చిమ బెంగాల్లోకి జపాన్ సేనలు దూసుకు రాకుండా నిరోధించేందుకు. బెంగాల్‌లో చేపలు పట్టుకునే వారి చిన్నిచిన్న పడవల్ని బ్రిటిష్‌వారే వేలాదిగా ధ్వంసం చేశారు-" అని పత్రికలు రాశాయి.

కోస్తా తీరం వెంబడి అప్రమత్తంగా సైనిక పహరా జరుగుతోంది.

బైట ప్రపంచంతో సంబంధబాంధవ్యాలు తెగిపోవడంతో బెంగాల్ ఒక్కసారిగా కరువు రాక్షసికి బలి అయ్యింది.

నిమ్మకు నీరెత్తినట్లు చూస్తూ నిలుచున్నారు బ్రిటిషర్లు. ఈ విషయంలో వారు నిస్సహాయులు అన్న విషయం అందరికి స్పష్టంగా తెలిసిపోయింది.

"దేశ రక్షణ అనేది బ్రిటిష్ వారికి పరిమితమైన అంశం ఇంక ఎంతమాత్రమూ కాదు- భారతీయులు తమ రక్షణని తామే చేసుకోవాలి. మన భవిష్యత్తు మన చేతుల్లోనే వుంది. మనల్ని మనమే రక్షించుకోవాలి-" అని ప్రకటించారు గాంధీ.

భారతీయులను పాలిస్తున్నా, భారతదేశానికి ఏమాత్రం రక్షణ కల్పించలేని ఈ బ్రిటిష్‌వారు ఇంక ఒక్కక్షణం కూడా ఈ దేశంలో వుండకూడదు. "క్విట్‌ఇండియా" ఇండియాను వదలిపొండి-" అని అల్టిమేటమ్ ఇచ్చారు గాంధీజీ.

1942 ఆగస్ట్ 8.

రెండు రోజులుగా అఖిల భారత కాంగ్రెస్ మహాసభలు బొంబాయిలో వాడిగా వేడిగా జరుగుతున్నాయి.

చర్చిల్ మొండివైఖరిని కాంగ్రెస్ వాదులంతా ఖండించారు.

క్విట్ ఇండియా తీర్మానం ఆమోదం పొందింది.

ఈ యుద్ధ సమయంలో ఇలాంటి ఉద్యమాలు అప్రస్తుతం, అసందర్భం అని కూడా కొందరు కాంగ్రెస్ వాదులు వాదించారు. కానీ, వారి వాదనలు వీగిపోయాయి.

క్విట్ ఇండియా తీర్మానం రాజీకిరాని కోర్కె కాదని, యుద్ధ నివారణ, భారతదేశ రక్షణ విషయంలో సహకరించటానికి భారతీయులు సిద్ధంగానే ఉన్నారనీ గాంధీజీ ప్రకటించారు.

"మొదట భారతీయులకు స్వాతంత్ర ప్రకటన జరగాలి. తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటవుతుంది. స్వతంత్ర భారతదేశం లీగ్ ఆఫ్ నేషన్స్ మిత్రదేశం అవుతుంది. ఫెడరేటింగ్ విభాగాలకు ఎక్కువ స్వపరిపాలనా ప్రతిపత్తిని కల్పిస్తాము అని ముస్లింలీగ్‌కు హామీ ఇస్తున్నాం. సామ్రాజ్యవాద బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా అహింసాత్మక పద్ధతిలో, మరింత విస్తృత ప్రాతిపదికన ఈ క్విట్ ఇండియా సమరాన్ని ప్రారంభించటానికి ఈ సభ అనుమతి ఇస్తోంది. దీని నాయకత్వ బాధ్యతల్ని మహాత్మా గాంధీ గారికి అప్పగిస్తోంది..." అన్న తీర్మానాన్ని ప్రతిపాదించింది కాంగ్రెస్ మహాసభ.

అందరూ ఏకగ్రీవంగా కరతాళ ధ్వనులతో తీర్మానంపట్ల ఆమోదాన్ని తెలియజేశారు.

గాంధీజీ ఆఖరున ప్రసంగించారు-

"వాస్తవ సమరం ఈ క్షణంనుంచే ప్రారంభం అవుతోంది! మీరు కొన్ని అధికారాలను మాత్రమే నా చేతిలో పెట్టారు. గౌరవనీయులైన వైస్రాయ్‌ని కలుసుకొని, కాంగ్రెస్ కోర్కెను మన్నించవలసిందిగా ఆయనతో గట్టిగా చెప్పటం నా ప్రథమ కర్తవ్యం! ఇందుకు రెండు మూడు వారాలు పట్టవచ్చు ఈ లోగా ప్రతి కాంగ్రెస్ వాదీ తిరిగి రాట్నం దగ్గరకు చేరవలసిందిగా నేను కోర్తున్నాను.

ఈ రోజునుంచీ ప్రతి భారతీయుడూ స్వేచ్ఛ పొందినట్టే ప్రవర్తించండి. మనకు స్వాతంత్ర్యం వచ్చినట్లే వ్యవహరించండి...'' అన్నారు.

సభలు రాత్రి 10లోపే ముగిసాయి.

కానీ, అంతలోనే, గాంధీజీ వైస్రాయిని కలుసుకొనే అవకాశం ఇవ్వకుండానే, బ్రిటిష్ పోలీసులు... మరింత వేగంతో సభా స్థలిని చుట్టుముట్టారు.

వేదిక దగ్గర ఏం జరుగుతుందో తెలుసుకునేలోపే పోలీసు బలగాలు జాతీయ నాయకులందరినీ కమ్ముకున్నాయి.

ఎక్కడివారిని అక్కడే అరెస్టు చేశారు.

మర్నాడు సాయంత్రం బొంబాయి సదస్సులో పాల్గొని తిరిగి వస్తున్న ఆంధ్రకేసరి ప్రకాశంగారిని కడప రైల్వేస్టేషన్‌లో అరెస్టుచేశారు.

కాంగ్రెస్ నాయకుల అరెస్టు వార్తలు దేశాన్ని కల్లోల సాగరంలో ముంచెత్తాయి. క్విట్ ఇండియా తీర్మానం వార్తలు, నాయకుల అరెస్ట్ వార్తలూ ఒకేసారి పత్రికల్లో వచ్చాయి.

విభ్రాంతి చెందారు జనం.

వారి ఆగ్రహం కట్టలు తెంచుకొంది. ఒక్కపూటలో దేశంయావత్తు అట్టుడికి పోయింది. జనజీవనం పూర్తిగా స్తంభించి పోయింది.

చూస్తుండగానే ప్రదర్శనలూ, ఊరేగింపులూ బహిరంగ సభలతో ప్రారంభమైన ఈ తిరుగుబాటు గృహదహనాలూ, లూఠీలూ పోలీసు కాల్పులుగా పరిణమించింది.

కన్పించిన ప్రతికాంగ్రెస్ వాదీ అరెస్టు అయ్యాడు. పోలీసు కాల్పుల్లో చాలాచోట్ల జనమరణాలు వందల సంఖ్యలో జరిగాయి.

మూడో రోజుకి గాంధీజీని పూనేలోని ఆగాఖాన్ ప్యాలెస్‌కు తరలించినట్లు వార్తలొచ్చాయి.

అహ్మద్ నగర్ కోటలో మిగిలిన జాతీయ నాయకుల్ని వుంచారట!

''ఆగస్ట్ 11,12 తేదీల్లో ఢిల్లీ నగరంలో 47 రౌండ్ల పోలీసు కాల్పులు జరిగాయి. 76మంది మరణించారు. 144 మంది గాయపడి చావుబతుకుల్లో కొట్టు మిట్టాడుతున్నారు...'' అని ఢిల్లీ రేడియో వార్తల్లో చెప్పారు.

''డూ-ఆర్-డై''

''కరో - యా - మరో-'' అన్న గాంధీగారి నినాదాలే ప్రతినోటా మార్మోగుతున్నాయి.

పరిస్థితి ప్రస్తుతం ఎవరి అదుపులోనూ లేదు. కట్టలు తెగిన జనఘోష వరదలై వెల్లువెత్తింది. అధికార యంత్రాంగం ఈ జన ప్రవాహంలో పడికొట్టుకుపోయింది.

విద్యార్థులు, కార్మికులు రెచ్చిపోయారు. పరిశ్రమలు మూతపడ్డాయి. స్కూళ్ళు, కాలేజీలు నిరవధికంగా మూసివేసారు.



బందరులోనే వుండిపోయిన పట్టాభిగారు ఈ వార్తలు విని చాలా బాధపడ్డారు.

"దేశంలో దేశభక్తుడు ఎవరూ అరెస్టుకాకుండా మిగిలినట్లు కనిపించడం లేదు. ఇది నిజంగా క్విట్ ఇండియా ఉద్యమం వలన కల్గిన ఊపు కాదు. బ్రిటిష్ వారి చేతకాని తనం మీద ప్రజలకు కల్గిన ఆగ్రహం అంతే... జనంలోంచి పుట్టిన ఉద్యమం ఇది-" అన్నారాయన.

"నాయకులు లేకుండానే ప్రజలు నడిపిన ఈ తిరుగుబాటులో రైల్వే స్టేషన్లు తగలబడి పోతున్నాయి. ప్రభుత్వ ఆస్థులన్ని ధ్వంసం అయిపోతున్నాయి. అధికారయంత్రాంగం అంతా ఛిన్నాభిన్నం అయిపోతోంది.." అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకొన్నారు పట్టాభిగారు.

కూర్మయ్యగారు పట్టాభిగారూ సాలోచనగా ఒకరినొకరు చూస్తూండి పోయారు నిస్సహాయంగా!

"హరిజన సేవకు అంకితమైన వాడివి నువ్వు. ఇలాంటి నిస్సారమైన ఉద్యమాలకోసం నీ అమూల్యమైన సమయాన్ని వృధా చేసుకోవద్దు... నీ మార్గంలోనే నవ్వునడు. పెద్దవాణ్ణి చెప్తున్నాను- హరిజన సేవే నీ పరమావధి..." అన్నారు కూర్మయ్యగారితో పట్టాభిగారు.

"సరిగ్గా ఇదే విషయం థక్కర్ బాబాజీ కూడా సూచించారు-" అంటూ జేబులోంచి ఆయన రాసిన ఉత్తరాన్ని ఇచ్చారు కూర్మయ్యగారు.

ఆసాంతం చదివారా ఉత్తరాన్ని పట్టాభిగారు.

"అఖిలభారత హరిజన సేవా సంఘం నాయకులు థక్కర్ బాబాజీకి నీ మీద ఎంత ప్రేమానురాగాలున్నాయో ఈ ఉత్తరం చదివితే తెలుస్తుంది ఆయన చెప్పినట్లే నువు అరెస్టు తప్పించుకో!

నాయకులు చాలామంది జైళ్ళలో వున్నారు కాబట్టి. కాంగ్రెస్ పనులు. హరిజనోద్యమ కార్యక్రమాలు చూసుకొంటూ వుండు. నీ బాధ్యతలు నువు నెరవేర్చు అంతే!" అని సూచించారు పట్టాభిగారు కూడా!

ఆ తర్వాత థక్కర్ బాబాజీ నుంచి మరొక లేఖ అందింది కూర్మయ్యగారికి.

"అఖిల భారత హరిజన సేవా సంఘానికి సంయుక్త కార్యదర్శిగా మిమ్మల్ని నియమిస్తున్నాను-" అని ఆ ఉత్తరం సారాంశం!

"దేశస్థాయి నాయకత్వం ఇది! ఇదొక అపూర్వ గౌరవం" అని ప్రశంసించారు కూర్మయ్యగారి మిత్రులు. ఈ అవకాశంతో దేశ వ్యాప్తంగా బడుగుజనుల సేవచేసే మహద్భాగ్యం కల్గింది..." అని అభినందించారు- ఆశీర్వదిస్తూ అయ్యదేవర కాళేశ్వరరావుగారు.

ఒకవైపు ప్రపంచ యుద్ధం సాగుతూనే వుంది. ఇటువైపు భారతదేశంలో హింసా మార్గాన క్విట్ ఇండియా ఉద్యమం కూడా సాగుతోంది. అరెస్టుల పర్వం 1945వరకూ కొనసాగుతూనే వుంది...

గాంధీగారు ఈ అల్లకల్లోలం ఉద్యమాన్ని చూసి చాలాబాధ పడ్డారు.

"I will Bend it —— otherwise I will end it" దీన్ని నా అదుపాజ్ఞలలో నేను నడపగలననే భావిస్తున్నాను. అదిసాధ్యం కాని పక్షంలో అరక్షణం కూడా ఆలస్యం చెయ్యను. వెంటనే దీన్ని ముగించేస్తాను" అని చెప్తూనే ఆ రోజునే క్విట్ ఇండియా ఉద్యమాన్ని ఉపసంహరిస్తున్నట్లు ప్రకటించారు గాంధీజీ!

దేశం అంతా గాంధీగారి ఈ నిర్ణయంతో అవాక్కయిపోయింది.

"నిజమేమరి! అహింసను ప్రవచించిన మరో గౌతమ బుద్ధుడు గాంధీజీ! ఆయన ప్రకటించిన ఉద్యమాన్ని ఇంత హింసాత్మకంగా నడపటం మన ప్రజలదే తప్పు... ఇలానే స్వాతంత్ర్యం వస్తుందనుకొంటే పాతిక సంవత్సరాల పాటు గాంధీగారు ఉపవాసాలు, సత్యాగ్రహాలూ నడపవలసిన అవసరమే వుండేదికాదు..." అన్నారు కూర్మయ్యగారు. పాశ్చాత్యీకరణం చెందిన కొందరు మేధావులు గాంధీగారి భావాల్ని వక్రీకరించి కువ్యాఖ్యలు చేస్తున్నారు. ఆయన్ని ఏదో చేసేయాలని చూస్తున్నారు గానీ, వీళ్ళు ఆయన్ని ఏమీచేయలేరు. గాంధీగారికి బ్రిటిష్ వారికన్నా సుభాస్ చంద్రబోస్‌గారూ మహమ్మదాలీజిన్నాగారూ పెద్ద శత్రువులైపోతే ఎట్లాగండీ...?" అంటూ వ్యాఖ్యానించాడు ఓ కార్యకర్త!

గాంధీగారిని వీరంతా శత్రువుగా భావిస్తున్నారు గానీ గాంధీగారికి శత్రువులే లేరు. ఆయన అజాతశత్రువు. అహింసామూర్తి!" అన్నారు కూర్మయ్యగారు!

"గాంధీజీ హరిజనోద్యమాన్ని కూడా అహింసామార్గంలోనే నడపమన్నారు అన్ని కులాలవారిలోనూ చైతన్యాన్ని తీసుకువస్తూ హరిజనుల్ని సాటి మనుషులుగా గౌరవించే స్థితిని సాధించమనే గాంధీజీ చెప్పారు. అంతేగానీ హరిజనులందరినీ అగ్రవర్ణాల వారిపైన దాడి చేసి తిరుగుబాటు చెయ్యమని ఆయన ప్రబోధించలేదు. ఒకవేళ క్విట్ ఇండియా ఉద్యమంలా హరిజనోద్యమం కూడా హింసామార్గాన పారబాటున నడిచినట్లయితే, ఈ పాటికి భారతదేశం కులాల కురుక్షేత్రంలా మారి వుండేది--" అన్నారు కూర్మయ్యగారు.

గాంధీ గారి దూరదృష్టి, కూర్యయ్యగారి సహనం అనాటి హరిజనోద్యమాన్ని ప్రజా మార్గాన నడిపించాయని అందరూ అనుకొన్నారు...!!

1945 వేసవి...

యూరప్‌లో యుద్ధం అవసాన దశకుచేరుకున్నట్టేనని చెప్పాలి.

భారతదేశంలో లిన్‌విత్‌గో తర్వాత వేవెల్ వైస్రాయ్‌గా వచ్చాడు.

అప్పటి వరకూ సాగిన అరెస్టుల పర్వం క్విట్ ఇండియా ఉద్యమ ఉపసంహరణతో ఆగింది.

నాయకులందరినీ ఒక్కొక్కరినీ విడిచిపెట్టడం మొదలుపెట్టారు...

అప్పటిదాకా దేశరాజకీయరంగంలో ఒకరకమైన స్తబ్ధత నడిచింది. అల్లర్లే తప్ప రాజకీయాలు లేవు.

నాయకులెవరూ బైటకువచ్చి ప్రజల్లో తిరిగి పనిచేసిన పాపాన పోలేదు. కాంగ్రెస్ ఉద్యమం చాలా బలహీనంగా వున్నట్లు ప్రతివారూ భావించారు.

అండమానుదీవుల్లో భారత ప్రజలను జపాను సైన్యాలు ఉచ్చకోత కోశాయని, వేలాది అండమాన్ భారతీయులు మరణించారని పత్రికల్లో వార్తలు వచ్చాయి. కానీ, ప్రతిస్పందించిన వారే లేరు.

1945 ఆగస్టు6... ఉదయం 8గం-16 నిమిషాలు-

మబ్బులు పట్టకుండా ఆకాశంలోంచి పిడుగు పడ్డట్లు జపాన్‌లోని హిరోషిమా నగరంమీద అణుబాంబు విసిరింది అమెరికా.

ఆగస్టు 9న నాగసాకీ నగరంమీద మరో అణుబాంబు విసిరారు అమెరికన్లు.

...ఆ అణువిచ్ఛేదనా ధ్వని తరంగాలు చెవులకు సోకుతూనే మరణించారు అనేకమంది...

ఆ అణు ధార్మిక వికీర్ణపు ఉష్ణతకు తాళలేక చనిపోయారు చాలామంది.

ఆ అణు ధార్మిక కిరణాల మహా కాంతిపుంజాలకు కళ్ళు కాలిపోయి నేలకూలి పోయారు కొంతమంది.... :

అణు ధూళితో చనిపోయినవారు..

అణుధార్మిక గాలి సోకి చనిపోయినవారు...

బాంబులు కురిసిన క్షణంలోనే 70 వేలమంది చనిపోయి వుంటారని... ఒక గంటలోపు ఒక లక్షా పదమూడు వేలమంది మరణించారనీ... వార్తలు విని ప్రపంచం యావత్తూ దుఃఖ భాజనం అయ్యింది...

ఎందుకీ మారణహోమం?

ఎవరీ యుద్ధంలో విజేతలు?

ఏ విజేత సాధించేది ఎంత...ఎంత... ఎంత..???

ప్రపంచం యావత్తూ అణుబాంబుని వినియోగించిన అమెరికా దుశ్చర్యను ఖండించింది.

ఈ అణుధార్మిక ధూళి కల్గించే దుష్పరిణామాలు జపాన్‌లో చాలా భాగాల్లో కనీసం మూడు తరాల వరకూ వ్యాపిస్తాయని శాస్త్రజ్ఞులు భావించారు.

హిరోషిమా, నాగసాకీ నగరాలు పీనుగుల కుంటలుగా మారాయి.

ప్రపంచాధిపత్యం సాధించాలని కలలుగన్న జపాన్, జర్మనీ ఇటలీల కూటమికి ఆఖరికి శృంగభంగం తప్పలేదు.

హిట్లరు ఆత్మహత్య చేసుకున్నాడు. ముస్సోలినీ ముందే మరణించాడు.

బెర్లిన్ దగ్గర సరిహద్దుగోడ లేచింది. జర్మనీ చీలిపోయింది.

జపాన్ పూర్తిగా మిత్రదేశాలకు లొంగిపోయింది.

రెండో ప్రపంచయుద్ధం విషాదంతో ముగిసింది.

ఎందుకంటే... ఈ యుద్ధంలో గెలిచిన వారికి దక్కిన సంతోషంకూడా మిగిలింది ఏమీలేదు కాబట్టి!

1945 జూన్ 14న బ్రిటన్ భారతదేశానికి త్వరలో స్వాతంత్ర్యం ప్రకటిస్తామన్నదన్న వార్త ఒక్కటే సంతోషించదగ్గింది!!



"భోజనానికి కూర్చోబెట్టి విస్తళ్ళు వేశారు... కానీ వడ్డన ఇంకా ప్రారంభం కానట్లుందండీ... ఈ ఆలస్యం! ఇంకా ఆలస్యం దేనికండీ... ఇచ్చేస్తాం స్వాతంత్ర్యం అంటారే గానీ ఇవ్వరేమిటండీ... మేం అంతా ముసలి వాళ్ళం అయిపోతున్నాం... ఎప్పటికి చూస్తాం... స్వతంత్ర భారతదేశాన్ని?..." విసుక్కుంటున్నారు జనంలో పెద్దలు!

యుద్ధంలో బ్రిటన్ గెలిచినా దాని ఆర్థికస్థితి పతనమై పోయింది. సైనికుల్ని చాలామందిని కోల్పోయి బలహీనంగా తయారయ్యింది.

"దేశ పునర్నిర్మాణంలో బ్రిటిషర్లు తలమునకలుగా వున్నారు. భారతదేశం గురించి ఆలోచించే తీరిక లేదు వారికి..." విమర్శించారు వేముల కూర్మయ్యగారు.

"వారికిప్పుడు వ్యవధి కావాలట... చర్చిల్‌గారి కన్జర్వేటివ్‌లు ఎన్నికల్లో ఓడిపోయి అట్లీగారి లేబర్‌పార్టీ బ్రిటన్‌లో అధికారంలోకి వచ్చింది. బ్రిటిష్ ప్రజలు, అధికారులు, సైనికులు యుద్ధంలో అలిసి పోయారట. శ్రమపడటానికి సిద్ధంగా లేరట... వస్తుంది... స్వాతంత్రం..... తప్పకుండా... కానీ, ఇదిగో ఇలాంటి కుంటి సాకులతో కాలయాపన చేస్తున్నారు" వివరించారు కూర్మయ్యగారు.

అఖిల భారత హరిజన సేవా సంఘం ప్రధాన కార్యదర్శి హోదాలో ఆయన థక్కర్ బాబాజీతో కలిసి దేశ పర్యటనలో వున్నారు..

ఎక్కడికి వెళ్ళినా ప్రజలు స్వాతంత్ర్యం గురించి ప్రశ్నిస్తున్నారు.

"నిజమైన స్వాతంత్రం హరిజనులు కూడా ఆత్మ న్యూనతాభావాన్ని వదులుకొని, అగ్రవర్గాల వారితో సమానంగా ఎదిగినప్పుడే వస్తుంది..." అన్నారు కూర్మయ్యగారు.

పల్లెపల్లెలో ప్రతిహరిజనుడి గుండె గుడిసెనీ ఆయన తట్టిలేప సాగారు.

నేరుగా లోపలికి వెళ్ళిపోయి ఎత్తిన కుక్కిమంచం వాల్చుకొని కూర్చున్నారొక గుడిసెలో.

"ఏం అత్తా.... కులాసానా...?" అని ఒక ఇంట్లో, "రావయ్యా! బావయ్యా! ఇలా నాపక్క కూర్చో.... ఎలా వున్నావు?" అని ఇంకొక ఇంట్లో!

"అన్నంపెట్టు తల్లీ... తింటాను" అని అడిగి పెట్టించు కొన్నారు మరో గుడిసెలో! "పిల్లల్ని సదివించమంటున్నావు బాబూ! నువు సెప్పేది శానాబాగుంది! కానీ పొరుగూళ్ళ పెట్టి సదివించాలంటే మా వల్ల అవుద్దాబాబూ...." అని అడిగిందో ఇల్లాలు -

"హరిజనుల పిల్లలకి కాణీఖర్చులేకుండా చదువు కొంటానికి స్కూళ్ళు, ఉంటానికి హాస్టళ్ళూ పెట్టిస్తున్నాం! కడుపునిండా అన్నంపెట్టి మరీ చదివిస్తారు - నువు దొడ్డ మనసుతో నీ బిడ్డని చదివించాలని కోరుకో! కూలిపనికి పంపించాలని చూడకు-" అని సముదాయించారా ఇల్లాల్ని కూర్మయ్యగారు!

"ఈ గుడిసెలే నాకు గుడులు" - అన్నారాయన.

ఆంధ్ర, తమిళనాడు, కర్నాటక, కేరళలతో పాటు ఆంధ్ర ప్రాంతం అంతా పర్యటించారు కూర్మయ్యగారు.

సరిగ్గా ఈ నేపథ్యంలో 1946 అసెంబ్లీ ఎన్నిక లొచ్చాయి!! సేవా కార్యక్రమం లోంచి కొద్దివిరామం తీసుకొని మళ్ళీరాజకీయాల్లోకి రాకతప్పలేదు కూర్మయ్యగారికి.



1946... ఉగాది రోజులు...

శాసన సభల ఎన్నికలు తిరిగిరావటంతో కాంగ్రెస్ వర్గాల్లో వేడిపుంజుకుంది.

అంతకుపూర్వం జస్టిస్‌పార్టీ జమీందారుల్తోనూ ఆ తర్వాత వ్యక్తి సత్యాగ్రహం, క్విట్టిండియా అరెస్టులతోనూ అవిశ్రాంతంగా శ్రమించి పోరాడిన కాంగ్రెస్ యోధాను యోధులంతా... గతరెండు సంవత్సరాలుగా ఆంధ్రప్రాంతంలో కమ్యూనిస్టుల ప్రాబల్యాన్ని నిరోధించడానికి తమ శక్తియుక్తులన్నింటినీ ధారపోస్తున్నారు.

"కమ్యూనిస్టులతో, ఒకవైపు పోరాడుతూనే మా గ్రామాభివృద్ధికి కృషి చేస్తున్నాము..." అని కాంగ్రెస్ నాయకులు ఎవరికి వారు చెప్పుకొంటున్నారు.

తూర్పు కృష్ణాలో గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, పశ్చిమకృష్ణాలో కాకాని వెంకట రత్నంగారూ కమ్యూనిస్టు వ్యతిరేకులుగా గట్టిగా ముద్రపడి కృషి చేస్తున్నారు.

"ఈ పోరాటాలలో ఎక్కువ భాగం మీ పట్టణాలకు పరిమితమైన సైద్ధాంతిక విభేదాలు కన్పిస్తాయండీ! మా గ్రామాల్లో కాంగ్రెస్‌లో కాంగ్రెస్ తత్వమూ వుండదు.

కమ్యూనిస్టుల్లో కమ్యూనిస్టు తత్వమూ వుండదు... ఏ పార్టీ నాయకుడి అనుచరులైతే ఆ పార్టీ పలుకులు చిలకల్లా పలుకుతుంటారు..." అని గొట్టిపాటి బ్రహ్మయ్యగారు విశ్లేషించారు. గ్రామాల్లో కాంగ్రెస్ పార్టీ అనబడే దానిలో వున్నవారిని ప్రత్యేకంగా పిలిపించి ఆయన ఒక సమావేశం జరిపారు" "మనం ఇంతవరకూ కమ్యూనిస్టుల వ్యతిరేక పక్షంగా ఏర్పడి సాధించింది ఏమీ లేదు. పైగా ఆ పార్టీ బలపడటం జరిగింది. గ్రామాల్లో పార్టీలు కక్షలు పెరిగాయే తప్ప జరిగింది శూన్యం.." అని బాధపడ్డారాయన "ఇంకనుంచి గ్రామరాజకీయాల్లో తలదూర్చను... మీరుకూడా కక్షలకు దూరంగా వుండండి. రాబోయే ఎన్నికలకు సమాయత్తం కండి..." అన్నారు బ్రహ్మయ్యగారు.

"కమ్యూనిస్టు వ్యతిరేక ఉద్యమంలో ప్రాణార్పణ చేయటానికైనా నేను సిద్ధమే..." అని ప్రకటించారు. కాంగ్రెస్ సిద్ధాంతాన్ని ప్రచారం చేద్దాం! మహాత్ముడి పిలుపుని జాతీయులందరికీ అందిద్దాం... అని నిర్ణయించుకొన్నారంతా!

అంతలో ఎన్నికలొచ్చాయి.

గతంలో లాగానే ఈసారీ హరిజన అభ్యర్థిగా వేముల కూర్మయ్యగారూ, జెనరల్ స్థానానికి గొట్టిపాటి బ్రహ్మయ్యగారూ అభ్యర్థులవుతారని అందరూ ఆశించారు.

బ్రహ్మయ్యగారు, కూర్మయ్యగారుకూడా టిక్కెట్‌కోసం దరఖాస్తు చేశారు.

అయితే ఎన్నడూలేని కొత్తపరిణామం... కాంగ్రెస్ తరపున జెనరల్ స్థానానికి పోటీ అభ్యర్థులు అనేకమంది దరఖాస్తు చేయటం... అందరికీ ఆశ్చర్యం కల్గించింది.

గత ఎన్నికల్లో కాంగ్రెస్‌కు అభ్యర్థి దొరకలేదు. ఈసారి ఇందరు ముందుకు రావటం వింతే!! శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మి గారు కూడా ఇలా దరఖాస్తు చేసిన వారిలో వున్నారు.

హరిజనులు పోటీచేయటానికి ప్రాథమిక అర్హత పొందాలంటే పూనా ఒడంబడిక ప్రకారం హరిజనులు హరిజన అభ్యర్థులుగా నిలిచిన వారిలో తమకు నచ్చిన వారికి ప్రథమ ఓటు వేయాలి. ఆ ఓటింగ్‌లో నాలుగోవంతు వచ్చిన వారు పోటీచేయటానికి అర్హులవుతారు.

కూర్మయ్యగారు ఈ ప్రాథమిక ఎన్నికల్లో అత్యధిక మెజారిటీ సంపాదించి పోటీచేసేందుకు అర్హత సంపాదించారు. రిజర్వుడు స్థానానికి ఆయన పేరు ఖరారయినట్లే!

"ఇదిలా ఉండగా రాబోయే ఎన్నికల్లో అభ్యర్థులను ఎంపిక చేసే కార్యక్రమం పట్టాభిగారింట్లో ఏర్పాటు చేశారు తూర్పు కృష్ణానియోజకవర్గానికి 300 మంది బ్రహ్మయ్యగారి పేరు ప్రతిపాదించారు. పదిమంది మాత్రమే సీతామహాలక్ష్మిగారి పేరుబలపరిచారు. జెనరల్ స్థానానికి బ్రహ్మయ్యగారిని ఎంపిక చేసి రాష్ట్ర కార్యవర్గం ఢిల్లీ పరిశీలనకు పంపింది..." అని పత్రికలో వార్తా కథనాలు వచ్చాయి.

"ఢిల్లీ అంగీకారం దాకా ఆగనవసరంలేదు. గెలుపు మనదే! నియోజకవర్గం నాలుగు తాలూకాలలో విస్తృత ప్రచారం చేసెయ్యండి..." అంటూ బ్రహ్మయ్యగారి మిత్రులు శ్రేయోభిలాషులూ ఆయన్ని వత్తిడి చేశారు.

"ప్రజాభిప్రాయం మనకు చాలా అనుకూలంగా ఉంది." అనుకొన్నారు సంతృప్తిగా బ్రహ్మయ్యగారు.

అంతలోనే కొంపలంటుకున్నట్లు భయంకరమైన టెలిగ్రాం వచ్చి పడింది బ్రహ్మయ్యగారి చేతుల్లోకి! 'టెలిగ్రాం ఏవిటిసార్'

ఏదోకీడు శంకిస్తూ ఖంగారుగా అడిగారు ఆత్మూరి నాగేశ్వరరావుగారు, బ్రహ్మయ్యగారి ముఖ్య అనుచరులు.

"అభ్యర్థుల్ని ఎంపిక చేసేందుకు ఢిల్లీ స్థాయిలో ముగ్గురు సభ్యుల కమిటీ సొంతనిర్ణయం తీసుకొందిట" ఆ నిర్ణయాన్ని పటేల్‌గారు టెలిగ్రాం పంపారు- అని మౌనంగా పూనుకున్నారు.

"ఏదీ ఇటివ్వండీ-" అంటూచేతిలో టెలిగ్రాం తీసుకుని చూశారు నాగేశ్వరరావుగారు.

"మహిళ అయిన సీతామహలక్ష్మి గారికి నిలబడే అవకాశం కల్పిస్తూ దయచేసి మీరు పోటీ నించి విరమించండి...పటేల్ -" అని పైకిచదివారాయన. బ్రహ్మయ్యగారు గంభీరమైన మౌనమ్ముద్ర దాల్చారు.

అక్కడవున్న అందరికీ ఈ టెలిగ్రాం చూశాక చాలా కోపం వచ్చింది! అందరూ ఆగ్రహంతో ఊగిపోయారు. ఒక్కబ్రహ్మయ్యగారు తప్ప!

"ఇంక ఈ ప్రచారం చాలు. ఎవరిళ్ళకు వాళ్ళు పోదాం రండి! ఆ కూర్మయ్య గారినీ, ఆ సీతామహలక్ష్మి గారినే ఊరేగమనండి-" కోపంగాఅన్నారు నాగేశ్వరరావుగారు. "ప్రకాశంగారి మనుషుల్ని పైకి రానివ్వరండీ"! అనుకున్నారంతా!

కానీ, బ్రహ్మయ్యగారు మాత్రం సహనం కోల్పోలేదు యార్లగడ్డలో గాంధీ విగ్రహ ప్రతిష్టాపన కార్యక్రమానికి ఆయన మౌనంగా వెళ్ళిపోయారు.

ఆ సందర్భంగా జరిగిన సభలో సీతామహలక్ష్మిగారిని అభ్యర్థిగా ఎన్నికచేసిన సంగతిని మైకులోంచి స్వయంగా తెలియజేశారు.

"మనిషి మారినా సంస్థ మారలేదు. మనం అంతా నమ్ముకొని పనిచేస్తోంది. కాంగ్రెస్ సంస్థనే! అదే సంస్థ! అదే పెట్టె!! అదే రంగు!!! మీరంతా సీతామహలక్ష్మి గారినీ, వేముల కూర్మయ్యగారినీ గెలిపించండి!" అని బ్రహ్మయ్యగారు గట్టిగా చెప్పారు తన మనుషులందరికీ!

"మిత్రమా! కూర్మయ్యా!! ఎన్నికల ప్రచారం కోసం కొత్తగా ఈ కారు కొన్నాను. ఈ కార్లోంచి నేను దిగిపోతున్నాను. ఈ కారుని ఎన్నికలయ్యే వరకూ నువ్వే ఉపయోగించుకో-"అని ఆత్మీయంగా భుజం తట్టి కారుదిగిపోయారు బ్రహ్మయ్యగారు.

"వ్యక్తులు కాదు... సంస్థ ముఖ్యం!! సంస్థ కోసం ఎవరికి అప్పచెప్పిన బాధ్యతల్ని వారు నెరవేరుస్తున్నారు. అంతే..." అనుకున్నారు కూర్మయ్యగారు.

కూర్మయ్యగారి ప్రచార రథం ముందుకు సాగి పోయింది. వెనక్కి చూసే అలవాటు ఆయనకు ఏనాడూ లేదు!!



# 4

1946 ఏప్రియల్ 30...

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో భాగంగా వున్న ఆంధ్రులకు అది చిరస్మరణీయమైన రోజు...

ప్రతి తెలుగువాడూ గర్వించే వ్యక్తిత్వం నిండిన వీర సైనికుడు ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రిగా ఎన్నికైన రోజు...అయితే ఈ ఎన్నిక అంత సులువుగా జరిగిందేమీ కాదు.

వార్తా పత్రికలకు వార్తలే వార్తలు ఆ రోజుల్లో ! రోజుకొక రాజకీయ పరిణామం! రోజుకొక నాటకం!! ఆనాటి శాసన సభ్యులు కప్పల తక్కెడసామెతని రుజువు చేసుకున్నారు.

కాంగ్రెస్‌లో ముఠా రాజకీయాలకు బీజావాపన జరిగిన సమయం అది!

గాంధీ గారి నించి, రాజగోపాలాచారి గారి వరకూ, పటేల్‌నించి కామరాజ్ నాడార్ గారి వరకూ మహామహుల్ని ఎదుర్కొని తెలుగుతేజాన్ని నిరూపించారు ప్రకాశంగారు.

"మత్తేభం మదగజాలు పోరినట్లుగా వుంది నేటి రాష్ట్ర రాజకీయం" అని వ్యాఖ్యానించింది ఆంధ్ర పత్రిక "గాంధీ గారి వియ్యంకుడైన రాజాజీని ఎదుర్కోవటం అంటే మాటలా మరీ!" అని ప్రజలు కూడా వ్యాఖ్యానించుకొన్నారు.

"ప్రకాశంగారు ముఖ్యమంత్రి పదవికి పోటీలో వున్నారనే సరికి పట్టాభిగారు తన అభ్యర్థిత్వాన్ని కూడా ప్రకటించారు. దాంతో రాజకీయాలన్నీ రసకందాయంలో పడ్డట్టే..." అని సంతోషించిన వారూ కొందరున్నారు. వారికి రాజకీయ బ్రోకరేజీ వృత్తి!

"ముఖ్యమంత్రి ఎవరైనా. ఈ తతంగం పూర్తయ్యేవరకూ మనకు చేతినిండా పనే..." అని సంబరపడ్డారు వాళ్ళు.

అందరూ ఊహించినట్లే ఆంధ్ర ప్రాంతం నుంచి గెలుపొందిన శాసన సభ్యులు పట్టాభిగారివైపు ప్రకాశంగారి వైపు రెండు వర్గాలుగా చీలిపోయారు...

కళా వెంకటరావుగారు బెజవాడ గోపాలరెడ్డిగారు పట్టాభిగారి పక్షాన నిలబడ్డారు. వేములకూర్మయ్యగారు తటస్థ వైఖరి చేపట్టారు.

"అయ్యదేవర కాళేశ్వరరావుగారు సీనియర్ నాయకులు. ఆయన నాకు గురుదేవులు. ఆయన ఇలాంటి క్షుద్ర రాజకీయాల జోలికి రారు. నేనూ ఆయన్నే అనుసరిస్తాను. ఇలాంటి వివాదాలు ఏర్పడినప్పుడు వ్యక్తిగత ప్రతిష్టలకు పోకుండా గాంధీజీకి బాధ్యత అప్పగించి, ఆయన ఎంపిక చేసిన వ్యక్తిని ముఖ్యమంత్రిని చేస్తే బావుంటుంది అని నా భావన" అన్నారు కూర్మయ్యగారు.

"అయితే మీరు తెలుగువాడు రాష్ట్ర ముఖ్యమంత్రి కావాలని కోరుకోవటంలేదా...?" రెట్టించి అడిగారు విలేకర్లు.

తెలుగువాళ్ళు ఇద్దరు పోటీపడ్తున్నారు. వీరిద్దరు రాజకియవేత్తలందరినీ నిట్టనిలువుగా చీలుస్తున్నారు. ఈ చీలిక ప్రభావం కొన్ని సంవత్సరాల పాటు రాష్ట్రరాజకీయాల మీద వుంటుంది! ఈ ఇద్దరూ పోటీపడే పద్ధతి బాగోలేదు. వారి లక్ష్యం కూడా మారాలి! రాష్ట్ర ప్రయోజనాన్ని దేశ ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొనే నేను చెప్తున్నాను-" సమాధానం చెప్పారు కూర్మయ్యగారు.

నేటి తమిళనాడు, తెలంగాణాతప్ప తక్కిన ఆంధ్ర ప్రాంతమూ, కర్నాటకలో కొద్దిభాగము, కేరళ, ఒరిస్సాలోని కొద్దిభాగమూ కలిసి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంగా వున్నాయి అప్పటిదాకా!

"కేవలం ఆంధ్రులేకాదు... ఇన్ని ప్రాంతాల ప్రజలెన్నుకున్న శాసనసభ్యులంతాకలిసి ముఖ్యమంత్రిని ఎన్నుకొంటారు- వ్యక్తులు పదవులకోసం పోటీపడితే, అది వ్యక్తిగత కక్షలుగా పరిణమించి ఆంధ్రులు. తమిళులు, కన్నడిగులు, కేరళీయులు ఒరిస్సా ఓంఢ్రులు మధ్య చిచ్చుకు దారితీసినా ఆశ్చర్యపోనవసరం లేదు. స్వాతంత్ర్యం రాకుండానే పదవులకోసం కాంగ్రెస్‌వారు కొట్టుకొంటున్నారు అనే అపకీర్తి మనకు రాకూడదు..." అని పత్రికా ప్రకటన చేశారు వేములకూర్మయ్యగారు.

కానీ, పట్టుదలలు పెరిగిపోతూనే వున్నాయి. ఎవరూ రాజీపడే సూచనలు కన్పించటంలేదు.

అరవజిల్లాల్లో రాజాజీ గారికి ఎంత పట్టువుందో కామరాజ్ నాడార్ గారికి కూడా అంతే పట్టుంది. ఇద్దరిమధ్య సయోధ్యలేదేనాడూ! అరవజిల్లాలో వారిద్దరితో పాటు ప్రకాశంగారికి చెప్పుకోదగిన పలుకుబడివుంది!

"శత్రువుకి శత్రువు మిత్రుడు కాబట్టి. రాజాజీ మీదపోటీ పడ్తున్న టంగుటూరి ప్రకాశానికి నా మద్దతు ఇస్తున్నాను-" అని ప్రకటించారు కామరాజ్ నాడార్‌గారు.

"దాంతో ప్రకాశంగారి మెజారిటీ పెరిగింది.కేరళ జిల్లాల్లోంచి మాధవమీనన్ గారు కూడా ప్రకాశంగారికే మద్దతు ప్రకటించటంతో ఆయన తిరుగులేని ఆధిక్యతతో ముఖ్యమంత్రి పదవి గెల్చుకునే పరిస్థితులు ఏర్పడ్డాయి. రాజాజీ గారు వెనకబడినట్లే కన్పిస్తున్నారు." పట్టాభిగారు పటేల్‌గారిని కలిసి పరిస్థితినంతా చక్కగా వివరించారు.

"మీరూ రాజాజీ కలిస్తే ప్రకాశం గారిబలం ఎంత తగ్గుతుంది...?" వివరాల్లోకి లోతుగా పోతూ అడిగారు సర్దార్ వల్లభాయ్ పటేల్.

"ఇదంతా తేలేది కాదు! ప్రకాశంగారిని నిరోధించడం కష్టం! మీరే ఏదో ఒకటి చెయ్యండి-" అనేసి ఊరుకున్నారు పట్టాభిసీతారామయ్యగారు.

మర్నాటి వార్త-

"కాంగ్రెస్ శాసన సభ్యులు ప్రజాస్వామ్య పద్ధతిలో తమకు నచ్చిన అభ్యర్థిని ముఖ్యమంత్రిగా ఎన్నుకునే అవకాశం కల్పిస్తున్నాం. ఢిల్లీనించి సీల్డ్ కవర్‌లో అభ్యర్థిపేరు సూచించే ప్రసక్తేలేదు-" స్పష్టీకరించారు ఆ వార్తలో సర్దార్ పటేల్‌గారు.

వెంటనే కాంగ్రెస్ శాసనసభ్యులకు వర్తమానాలు వెళ్ళాయి. తక్షణం బయల్దేరి మద్రాసులో సమావేశం కావాలని!

1945 ఏప్రియల్ 17-

వి.వి. గిరిగారి అధ్యక్షతన కాంగ్రెస్ శాసన సభా పక్ష సమావేశం జరిగింది...

సమావేశానికి వచ్చిన వారందరికీ ఆంక్షల పత్రం (విప్) అందించారు.

"సభ్యులంతా విధిగా రాజాజీగారినే ఎన్నుకోవాలి. ప్రకాశంగారికి ఓటు వెయ్యకూడదు-" అనేది ఈ విప్ (ఆంక్షల) సారాంశం!

"ఇంతకన్నా మోసం ఇంకొకటి లేదు. మీరు ఇలాంటి ఎన్ని ఆంక్షలు పెట్టినా నేను పోటీనించి విరమించే ప్రసక్తే లేదు" అని ప్రకటించారు ప్రకాశంగారు.

"నేను క్రమశిక్షణ కల్గిన కాంగ్రెస్ సైనికుణ్ణి. పార్టీ ఏది ఆదేశిస్తే దాన్నిపాటిస్తాను. పోటీనించి నేనే వైదొలగుతున్నాను. విప్‌ని అంగీకరిస్తున్నాను" అన్నారు పట్టాభిగారు.

ఓటింగ్ జరిపారు... అధిష్టానవర్గం ఆంక్షలు ఎన్ని విధించినా శాసనసభ్యులు ఎవరూ వాటిని పాటించలేదు-

ప్రకాశంగారికి అనుకూలంగా 147 మంది రాజాజీ గారికి అనుకూలంగా 32 మంది ఓటు వేశారు.

"ప్రకాశంగారు ఇంక ముఖ్య మంత్రి అయినట్లేనని పార్టీలో అత్యధిక మెజారిటీ శాసనసభ్యులు ఆయన్ని ముఖ్యమంత్రిగా ఆమోదించారని పత్రికలు పతాక శీర్షికల్లో ప్రచురించాయి.

"కానీ, శాసనసభ్యులు ఒకటి తలచిన ఢిల్లీపెద్దలు వేరొకటి తలచే పరిస్థితి ఆనాడు నడిచింది!

"విశ్వసనీయవర్గాల భోగట్టా! ఢిల్లీ అధిష్టాన వర్గం ప్రకాశంగారి పట్ల చాలా ఆగ్రహంగా వున్నారు. వారు ప్రకాశంగారిని ముఖ్యమంత్రి కానిచ్చే ఉద్దేశ్యంలో వున్నట్లు లేరు" అని ఢిల్లీ విలేకరి పంపిన వార్తని హిందూ పత్రికలో ప్రచురించారు. ఐదు రోజులు గడిచాయి.

"నన్ను తప్పించి ముత్తులింగం మొదలియార్ గారిని ముఖ్యమంత్రిని చేయండి. ప్రకాశంగారిని ముఖ్యమంత్రిని చేస్తే ఆయన ఈ ఉమ్మడి మద్రాసురాష్ట్రాన్ని విడగొట్టి ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేసుకొంటాడు" అని బాగానే బుర్రలోకెక్కేట్లు నూరి పోశారు రాజాజీగారు ఢిల్లీ అధిష్టాన వర్గానికి!

రాజాజీగారి ఆలోచనని వెంటనే అమలులో పెట్టింది అధిష్టానవర్గం.

'ఎన్నికల తతంగం జరిగి రోజులు గడిచి పోతున్నాయి. పత్రికల్లో రోజుకొక నాటకీయపరిణామం గురించి వార్తలువస్తున్నాయి. ప్రజలుకాంగ్రెస్ వారిని అసహ్యించుకుంటున్నారన్న గుర్తింపు ఎవరిలోనూ కన్పించటం లేదు... స్వాతంత్ర్యం తెచ్చుకోబోయేముందు ఈ ఖర్మం ఏమిటీ మనకీ!" అని విసుక్కున్నారు కూర్మయ్యగారు.

"మళ్ళీ ఓటింగ్ జరుపుతున్నాం. ఈసారి రాజాజీగారి స్థానంలో ముత్తుస్వామి మొదలియార్ గారిని అధిష్టానవర్గం సూచిస్తోంది..." అని క్లుప్తంగా ఒక ప్రకటనని విడుదలచేశారు పటేల్‌గారు.

ముత్తుస్వామి మొదలియార్ గారు కామరాజ్‌నాడార్ గారిని కలిశారు- మీరు రాజాజీకి వ్యతిరేకులు. అంతేగానీ నాకు కాదు కదా... నాకు మద్దత్తు ఇవ్వండి... అని ప్రాథేయపడ్డారు.

ఈ సంగతి ప్రకాశం గారికి తెలిసింది!

"అయినా మనం పోయి ఎవరినీ ప్రాథేయ పడనవసరం లేదు. గెలుపు మనదే ఎంతో ధీమాగా అన్నారు ప్రకాశంగారు.

ఓటింగ్ జరిగింది-

కామరాజ్ నాడార్ గారు మనసు మార్చుకున్న సంగతి స్పష్టమైంది. ఆయన వర్గం శాసనభ్యులు ఈసారి తటస్థ వైఖరిని అవలంభించారు- మాధవ మీనన్ గారు మొదలియార్ వైపు తిరిగి పోయారు.

ఆంధ్రుల్లో మొదట ఏర్పడిన చీలిక చీలికగానే వుంది. పట్టాభిగారి వర్గంలో వున్న కళా వెంకట్రావు గారు. బెజవాడ గోపాలరెడ్డిగారు వగైరా ప్రముఖులంతా అధిష్టాన వర్గం సూచన మేరకు మొదలియార్ గారిని బలపరచాలని నిర్ణయించుకున్నారు.

వైద్యనాథయ్యర్‌గారు. వేముల కూర్మయ్యగారు తటస్థ వైఖరినే అవలంభించారు.

ప్రకాశంగారు తన పట్టువీడలేదు.

"గెలిచినా ఓడినా వెనకడుగేసే సమస్యేలేదు" అని సగర్వంగా ప్రకటించారు.

జరుగుతున్న నాటకం అంతా ప్రజలు గమనిస్తూనే వున్నారు. ఇక్కడ ప్రజల్లో అసంతృప్తి ప్రబలుతోంది. ప్రకాశం గారిని వ్యతిరేకించేవారిపట్ల చాలా ఆగ్రహంతో వున్నారు.

మళ్ళీ ఓటింగ్ జరిపారు.

ప్రకాశంగారిది ప్రజాబలం. దాన్ని గాంధీగారు మార్చలేరని మరోసారి ఋజువైంది.

"13 ఓట్ల ఆధిక్యతతో ప్రకాశంగారు మళ్ళీ గెలిచారు. ఇది ఆంధ్రులందరికీ విజయం! ప్రకాశంగారు మనసా వాచా కర్మణా గాంధీ సిద్ధాంతాల్ని నమ్మిన వ్యక్తి. పదహారు అణాల గాంధేయవాది. అయినా ప్రకాశంగారికి గాంధీగారి ఆశీస్సులు కరువైనాయి. తెలుగువారిలో, తమిళుల్లోకూడా ప్రకాశంగారంటే ప్రజల్లో సద్భావంవుంది. అదే ఆయనకు కొండంత అండ!!" అని వ్యాఖ్యానించింది ఆంధ్ర పత్రిక.

తటస్థవైఖరి అవలంభించినా, గాంధీగారి ప్రియశిష్యుడు కూర్మయ్యగారికి మంత్రిపదవి ఖాయంచేశారు ప్రకాశంగారు!

ఆంధ్రులంతా సంతోషించారు.

"ఢిల్లీ పెద్దల్ని ఎదిరించి నిలిచే మనోనిబ్బరాన్ని ప్రకాశంగారికి ఆంధ్ర ప్రజలే ఇచ్చారు-" అని ప్రశంసించింది ఆంధ్రపత్రిక.

చివరికి పట్టాభిగారు కూడా మనసుమార్చుకున్నారు.

"గాంధీజీ ప్రకాశంనకు వ్యతిరేకముగా వర్కింగ్ కమిటీ వారిచే తీర్మానము చేయింతుననెను. కానీ ప్రకాశం జంకలేదు. పోట్లాడెను. చివరికి గెలిచాడు. ఇంత పట్టుదలతో, ఉత్సాహముతో, ఇన్ని సంవత్సరములు దేశ సేవ గావించిన వ్యక్తి చరిత్రలో లేడు. ఆయనకు చేయెత్తి నమస్కరించుట మన విధి-" అని ఆంధ్రపత్రికలో పట్టాభిగారు ఒక వ్యాసంలో వ్రాసారు.

"ఆతడనేక యుద్ధములయందారి తేరిన వృద్ధమూర్తి-" అన్నట్లు ప్రకాశంగారు గాంధీజీ ఆశీస్సులు లేకుండానే ముఖ్యమంత్రి కాగలిగారు.

గాంధీజీని ఎదిరించి భారతరాజకీయాల్లో నిలిచింది ఇద్దరే ఇద్దరు - ఒకరు నేతాజీ సుభాస్‌చంద్రబోస్ - రెండవవారు ప్రకాశంగారు.

ఆయన అయితే, ప్రకాశంగారు గాంధేయవాది-!! సుభాస్ చంద్రబోస్ గాంధేయ విధానాల్ని వ్యతిరేకించి పనిచేశారు. ప్రకాశంగారు పదహారణాల గాంధేయుడైనా అయినా, గాంధీగారికి విరోధిగానే ముద్రపడ్డారాయన.



1946 ఏప్రియల్ 30

గవర్నర్ "సర్‌ఆర్చిబాల్డ్‌నై" గారు ప్రకాశంగారిని ముఖ్యమంత్రిగా పదవీ స్వీకారం చేయవలసిందిగా ఆహ్వానించారు.

మంత్రివర్గం నిర్మాణంపై కసరత్తు ప్రారంభం అయ్యింది!

"తెలుగువారిలోంచి మంత్రుల్ని నేను ఎంపిక చేసుకున్నాను. మీ వర్గంలోంచి ఎవరికి మంత్రి పదవులు కావాలో మీరు సూచించండి..." అని కామరాజ్ నాడారుగారినీ, తటస్థ వైఖరి తీసుకున్న వైద్య నాథయ్యర్ గారినీ కోరారు ప్రకాశంగారు.

"నాకు మంత్రి పదవి అవసరం లేదు. ఫలానావారికి ఇవ్వమని నేను ఎవ్వరినీ సూచించను-" అని తెగేసి చెప్పారు వైద్యనాథయ్యర్.

ఆయనకు ఎవరిమీద ఈ అలకో ప్రకాశంగారికి అర్థం కాలేదు. రాజాజీగారికి ముఖ్యమంత్రి పదవి దక్కనివ్వలేధని ప్రకాశంగారిమీదే ఆ కోపం అన్న సంగతి ప్రజలందరికి తెలుసు.

"కానీ, ఈ పరిస్థితుల్లో ఆయున గురించి ఆలోచించి నమయుం వృథాచేసుకోనవసరం లేదు - తర్వాత చూద్దాం-" అనుకున్నారు ప్రకాశంగారు.

కామరాజ్ నాడారుగారు ప్రకాశంగారు ముఖాముఖీ మాట్లాడుకున్నారు.

"భక్తవత్సలం, అవినాశలింగం, కుమారస్వామి రాజా, డేనియల్ థామస్, మాధవమీనన్... ఈ ఐదుగురూ నా మనుషులు. వాళ్ళకి మంత్రి పదవులివ్వండి-". అని సూచించారు కామరాజ్ నాడారు.

"మీరు చెప్పిన వాళ్ళకి మంత్రి పదవులివ్వటానికి నాకు అభ్యంతరం లేదు... ఒక్క మాధవమీనన్‌కు తప్ప! ఆయన్ని నేను మంత్రిగా నా క్యాబినెట్‌లోకి తీసుకోలేను. క్షమించాలి!" గట్టిగా చెప్పారు ప్రకాశంగారు.

"పండితులు శ్రీ భాష్యంగారినీ, మద్రాస్‌నించి సంఘసేవకి శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారినీ, కర్నాటకనుంచి కారంత్‌గార్లకూడా నేను పదవులిద్దామని భావిస్తున్నాను. ఆంధ్రుల్లోంచి వి.వి. గిరిగారినీ, కడపకోటి రెడ్డిగారినీ, వేముల కూర్మయ్యగారిని మంత్రి మండలిలో తీసుకొంటున్నాను. కూర్మయ్య దేశవ్యాప్తంగా హరిజన సేవలో వున్నాడు. ఆయన నిజమైన గాంధేయవాది- ఆయనకు మంత్రి పదవినిచ్చి గౌరవించాలని భావిస్తున్నాను. న్యాయశాస్త్రం చదివాడు. విద్యావంతుడు. వివేకి..." ప్రశంసాత్మకంగా అన్నారు ప్రకాశంగారు. కామరాజ్ నాడార్‌గారు ప్రకాశంగారు చెప్తున్న పేర్లన్నీ వింటున్నారు.

"ఇందరికి మంత్రి పదవులిస్తున్నారుకదా...

ఒక్కమాధవ మీనన్ క్కూడా ఇచ్చెయ్యరాదా...?" బ్రతిమాల్తున్నట్లే అన్నారు కామరాజ్ నాడారుగారు.

ప్రకాశంగారు సమాధానం చెప్పకుండా మౌనంగా వూరుకుండిపోయారు. కాసేపాగి

"కావాలంటే, కేరళనుండి రాఘవమీనన్‌ని తీసుకొంటాను-" అన్నారు.

"కామరాజ్‌గారు కొంచెం అసంతృప్తిగానే కన్పించారు.

"ఇది నాకోసం కాదు... మీకోసమే చెప్తున్నాను. మాధవ మీనన్‌కు మానేసి తెచ్చుకొనే కష్టాలు ఒక ఎత్తయితే, రాఘవ మీనన్‌కు ఇచ్చి తెచ్చుకునే కష్టాలు ఇంకో ఎత్తవుతాయి ఆలోచించండి -" నచ్చచెప్పాలని చూశారు కామరాజ్‌గారు.

"స్వాతంత్ర్యం త్వరలోనే రాబోతోంది అని చెప్తున్నారు గాంధీజీ!

అదివచ్చే సమయానికి మేమూ మీరూ అందరం సంబరంగా వుండాలి- మీరు కష్టాల్లో వుండకూడదని నా అభిప్రాయం" అదీ కామరాజ్‌గారి హెచ్చరిక!

ప్రకాశంగారు అసహనంగా కదిలారు. తన నిర్ణయం తనదే! దాన్ని మార్చేది లేదు... అంతే!

"అయ్యేవి ఎటుతిరిగీ అవుతాయి. మంచైనా చెడైనా ఆత్మసాక్షిగా పనిచేయాలని భావిస్తున్నాను. నమస్తే! వస్తాను-" అని లేచారు ప్రకాశంగారు!

"ఈ రాజకీయ సముద్రంలో ప్రకాశంగారు ఎంచుకొన్న మార్గం కల్లోలాల మయంగా వుందేమో" అనుకున్నారు కామరాజ్ నాడార్!



హరిజననాయకుడు శివషణ్ముగం పిళ్ళైగారు స్పీకర్‌గా ఎన్నికయ్యారు.

"తెన్నేటి విశ్వనాథంగారు స్పీకర్ అవుతారని అందరూ ఊహాగానాలు చేశారు. కానీ అదిజరగలేదు. ప్రకాశంగారి ప్రియశిష్యులైన విశ్వనాథంగారికి మంత్రిపదవీ దక్కలేదు- స్పీకర్‌పదవీ దక్కలేదు" అని వ్యాఖ్యానించింది ఆంధ్రపత్రిక.

"తెలుగువాడు... శాసనసభ్యులందరినీ స్వయంగా అభ్యర్థులుగా ఎంపిక చేసి గెలిపించినవాడు... రాష్ట్రానికి తొలి తెలుగు కాంగ్రెస్ ముఖ్యమంత్రి అయితే ముగ్గురంటే ముగ్గురా మంత్రులు...?" అని విరుచుకుపడ్డారు కళావెంకటరావుగారు.

"అది మంత్రి వర్గంగానే వుండాలి. అంగారతల్పం కాకూడదు- కల్లూరి చంద్రమౌళిగారు బెజవాడ గోపాలరెడ్డిగారు. కళావెంకట్రావు గారు... ఈ ముగ్గురిలో కనీసం ఒకరికైనా మంత్రి పదవి ఇవ్వాలి" అని గట్టిగా డిమాండ్ చేశారు వైరి వర్గీయులు. "ఆచార్యరంగా గారు మీకు గుర్తురాలేదా...?" అని ఆయన వర్గీయులూ ధ్వజం ఎత్తారు.

దేన్ని పట్టించుకోలేదు ప్రకాశంగారు అప్పటికప్పుడే మరో నిర్ణయం తీసుకున్నారు.

"ఎవరి బెదిరింపులకూ లొంగడీ ప్రకాశం! ఈ రోజే తూర్పుగోదావరి జిల్లాకు చెందిన ప్రముఖులు శ్రీ బిక్కిన వీరాస్వామి గారిని మంత్రివర్గంలోకి తీసుకొంటూ నామంత్రి వర్గాన్ని విస్తరిస్తాను-" అన్నారు కొండంత స్వాతిశయంతో! ఆయన గుండెనిబ్బరాన్ని చూసి ప్రతి ఒక్కరూ ఆశ్చర్యపోయారు.

కూర్మయ్యగారికి ఇవేవీ పట్టవు."ఇదంతా రాజకీయ "చదరంగం" ఇక్కడ ఆడుతూనే వుండాలెప్పుడూ! ఆట ఆగిందా...... పదవిగోవిందా... అందుకే నేను పదవిని ఒక బాధ్యతగానే భావిస్తున్నాను. అది అలంకారభూషణం ఎంతమాత్రమూ కాకూడదు. పదవుల్ని అలంకారం అనుకునేవారు సృష్టిస్తున్న రభస ఇది-" అని మిత్రులతో వాపోయారు కూర్మయ్యగారు.

ఇంతలో ముఖ్యమంత్రి ప్రకాశంగారి కార్యాలయంనుంచి పిలుపు వచ్చింది.

రేడియో, సమాచారశాఖ, హరిజనాభివృద్ధి శాఖామాత్యులుగా పదవి బాధ్యతలు స్వీకరించిన తర్వాత మొదటిసారిగా ముఖ్యమంత్రి ప్రకాశంగారిని కలిసేందుకు బయల్దేరారు కూర్మయ్యగారు.

కూర్మయ్యగారిని సాదరంగా ఆహ్వానించార్ు ముఖ్యమంత్రి!

"రండి! కూర్మయ్యగారూ కూర్చోండి! మీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలని పిలిపించాను-"

"మీ ఆదరణకు ధన్యవాదాలు! అధికారంలోకి వస్తూనే మీరు మనపార్టీ వాగ్దానంప్రకారం ఖాదీ అభివృద్ధికోసం కోటిరూపాయల నిధిని ఏర్పాటు చేసినందుకు మరొక్కసారి ధన్యవాదాలు..."

సంతోషం! మీ భావాల్లో 'ధ్వని' ని నేను అర్థం చేసుకున్నాను. మీరిప్పటివరకూ రాసిన ఉత్తరాలన్నీ చదివాను మనం ఎన్నికల్లో చేసిన ఆ మరో వాగ్దానం గురించే మాట్లాడాలని మిమ్మల్ని రమ్మన్నాను-" అన్నారు నవ్వుతూ ప్రకాశంగారు.

ప్రకాశంగారి ముఖంలో ప్రశాంతత, చిరునవ్వు చాలాకాలం తర్వాత ఈరోజే గమనించారు కూర్మయ్యగారు. నిర్మలమైన గోదావరిలా వున్నారాయన!

"హరిజన సంక్షేమం తప్ప నేనుకోరేదింకేమీ వుండదు-" వినయంగా అన్నారు కూర్మయ్యగారు.

"నేనూ దాని గురించే మాట్లాడుతున్నాను. మీరు హరిజన మంత్రి గాబట్టి మీకు చెపుతున్నాను. హరిజన సంక్షేమం కోసం మనం వాగ్దానం చేసినట్లుగా కోటిరూపాయిల నిధిని ఏర్పరుస్తూ ఇదిగో మీముందే ఆర్డర్లమీద సంతకం చేస్తున్నాను-" అంటూ సంతకం చేశారు ప్రకాశంగారు.

కూర్మయ్యగారి సంతోషానికి అవధులులేవు. చిన్ననాటినించి కంటున్న బంగారు కలలేవో ఒక్కసారిగా నిజం అవుతున్నాయనిపించింది!

"ఈ విజయం మీదేనయ్యా! కూర్మయ్యా!! కూలినాలి చేసుకుబతికే జనానికి నిజంగానే మరో గాంధీలా కృషి చేస్తున్నావు! చాలాసంతోషం!" అన్నారు లేచి. కూర్మయ్యగారి భుజాలమీద చేతులు వేసి ఆలింగనం చేసుకొంటూ!

ప్రకాశంగారిలో పైకి కనిపించే కాఠిన్యమే కాదు... లోపల అద్భుతమైన మరో మనిషి వున్నాడనిపించిందా క్షణంలో కూర్మయ్యగారికి.

"ఈ కోటిరూపాయల హరిజన నిధిని సద్వినియోగంచేయటానికి, తగిన కార్యాచరణ ప్రణాళికను రూపొందించి వెంటనే మీ ఆమోదం కోసం పంపుతాను" అన్నారు కూర్మయ్యగారు.

"మీ మనసులో వున్న ఆలోచన ఏమిటీ? హరిజనులకు ఉచితంగా బియ్యంపంచి పెడదామనా... ఇళ్ళుకట్టిద్దామనా, అప్పులు ఇద్దామనా...?" కొంచెం రెట్టించి అడిగారు ప్రకాశంగారు.

ఎన్నాళ్ళగానో మనసులోనే దాచుకున్న తన ఆలోచనల్ని బైటపెట్టె అవకాశం ఇన్నాళ్ళకొచ్చింది కూర్మయ్యగారికి. "ప్రభుత్వధనం అంటే ప్రజాధనమే! మంత్రులుగా మనందరం ఈ ధనానికి భద్రతాదారులం. తాత్కాలిక ప్రయోజనం కల్గించే భియ్యంపంచి పెట్టటం వంటి కార్యక్రమాల వలన హరిజనుల ఉద్ధరణగానీ, వారికి శాశ్వత ప్రయోజనం గాని ఏమీ ఉండవనుకొంటాను" అన్నారు కూర్మయ్యగారు.

"మరి ఏవిధంగా ఈ ధనాన్ని వినియోగిద్దామని మీ ఆలోచన-!"

చదువులకన్నా మించిన శాశ్వత ప్రయోజనం ఇంకొకటి లేదు- హరిజనుల పిల్లలకి చదువుకునే ఏర్పాట్లు చేయాలి. వారు హైస్కూల్ వరకైనా చదవాలంటే వారికి హాస్టళ్ళ ఏర్పాటు వుండాలి. హరిజనుల పిల్లలకు ఉచిత హాస్టళ్ళు ఉచిత విద్యా సౌకర్యాలు కల్పించటానికి ఈ నిధుల్ని వినియోగించాలని నేను భావిస్తున్నాను-" వివరించారు కూర్మయ్యగారు.

"సెహభాష్!" మెచ్చుకోలుగా అన్నారు ప్రకాశంగారు. "ఈరోజునుంచి ఒక సంవత్సరకాలంలో ఐదువందల హాస్టళ్ళు మీరు ఏర్పరచాలని ఒక టార్గెట్ పెట్టుకోండి. రెండేళ్ళలోపు వెయ్యి హాస్టళ్ళు పెట్టగలగాలి! అవి కూర్మయ్య హాస్టళ్ళుగా పేరు తెచ్చుకోవాలి... మీ హాస్టళ్ళకు ఎంత మంచి పేరు వస్తే మీకు అంత ఘనత-" హితోపదేశం చేస్తున్న మహర్షిలా అభిభాషణం చేశారు ముఖ్యమంత్రి ప్రకాశంగారు.

అంతే! అప్పటినించే దీక్షగా తన కార్యక్రమంలో మునిగిపోయారు కూర్మయ్యగారు.

1946 సంవత్సరంలో 36 లక్షల ఖర్చు పెట్టినట్లు మొత్తం 800 హాస్టళ్ళ ఏర్పాటుచేసినట్లు శాసనసభలో ప్రకటించారు కూర్మయ్యగారు. ఆయన ప్రకటించారు.

ఆరోజు మంత్రిగా ఆయన ఉపన్యాసం కరతాళధ్వనులమధ్య అత్యద్భుతంగా సాగింది.

"ఈ దేశంలో దీనజనులకు ప్రభుత్వ పక్షాన మనం చేయగలిగిన ముఖ్య కార్యక్రమం వారికి విద్యాదానం చేయటం అని ప్రభుత్వం భావించింది. ఉచిత విద్యతో పాటు ఉచిత హాస్టళ్ళను ఏర్పరచి హరిజనులను విద్యావంతులను చేయటం ద్వారా సమాజంలో అగ్రవర్గాలవారితో సమానంగా వారుకూడా ఎదిగేలా చేయాలని ప్రభుత్వం సంకల్పించింది!

అగ్రవర్ణాల తాకిడి మరీ ఎక్కువగావున్న ప్రాంతాల్లోనూ హరిజనులు ఎక్కువగా నివసిస్తున్న ప్రాంతాల్లోనూ ఉచిత హరిజన పాఠశాలలు పెట్టటం ఉచిత హాస్టళ్ళను ఏర్పాటుచేయటం ద్వారా ప్రజలకిచ్చిన వాగ్దానాన్ని ప్రభుత్వం నెరవేరుస్తోందని ప్రకటిస్తున్నాను.

హరిజనులకుగానీ, సానుభూతిపరులకు గానీ హాస్టళ్ళ నిర్వహణా బాధ్యతని అప్పగిస్తున్నాము.

గ్రామాల స్థాయిలో ప్రతి ఊళ్ళోనూ ఒక పర్యవేక్షక కమిటీ - Village Vigillance Committee ని ఏర్పాటుచేయాలని ప్రతిపాదిస్తున్నాము. హరిజనుల విషయంతో అగ్రవర్ణాలతో ఏర్పడే వివాదాలను కూడా ఈ కమిటీ అక్కడికక్కడే పరిష్కరించేలా అధికారాలు కల్పిస్తున్నాము.

వీటన్నింటినీ సమన్వయం చేసుకొంటూ హాస్టళ్ళ నిర్వహణపైన అజమాయిషీ కల్గిన "హరిజన సంక్షేమశాఖ" ని ప్రత్యేకంగా ఏర్పాటుచేయటం అవసరంగా నేను భావిస్తున్నాను. రాజ్యాంగ పరంగా ఒక కొత్త డిపార్ట్‌మెంట్‌ని ఏర్పాటుచేయటానికి కావలసిన అంశాలను పరిశీలిస్తున్నాము.

హరిజనులు, గిరిజనులు, వెనకబడిన వర్గాల వారికందరికీ ఈ హాస్టళ్ళలో ప్రవేశం కల్పించవలసిందిగా ఆదేశిస్తున్నాము-

సమాజ సంక్షేమమే ధ్యేయంగా పనిచేసే మన ప్రభుత్వం అణగదొక్కబడిన వర్గాలవారినందరి అభ్యున్నతినీ కాంక్షిస్తోంది..." అని ప్రకటించారు కూర్మయ్యగారు అసెంబ్లీలో. కూర్మయ్యగారిని చప్పట్లతో ప్రోత్సహించారందరూ.

ఆంధ్ర తమిళ ప్రాంతాల్లో ఎక్కడచూసినా కూర్మయ్యగారిహాస్టళ్ళు కళ కళలాడుతున్నాయి. బెజవాడలో అంజనాదేవి ఆదిఆంధ్ర బాలికల హాస్టల్‌ని ఏర్పాటు చేసినప్పుడు తాను పడిన శ్రమ - ఆరుగురు విద్యార్థినుల్ని తీసుకురావడానికి పడిన ప్రయాస ఇప్పుడాయనకు బాగా గుర్తుకొస్తున్నాయి.

ఈ ఇరవై ఏళ్ళలో హరిజనుల్లో పెరిగిన చైతన్యం ఆయన్ని ఎంతగానో ఆశ్చర్యపరిచింది.

"ఇదంతా ఆగాంధీ మహాత్ముని ఆశయాలవలనే సాధ్యం అవుతోంది..." అన్నారు కూర్మయ్యగారు.



పాకిస్తాన్ ఏర్పాటుకు జిన్నాగారికి సంకేతాలందించి బ్రిటిష్‌ప్రధాని చర్చిల్‌గారు యుద్ధం జరుగుతున్న రోజుల్లోనే రహస్యంగా చేయవలసిందంతా చేసేశాడని పత్రికలు ఉద్ఘోషించాయి.

యుద్ధంవలన జరిగేనష్టాన్ని పూడ్చుకోవడానికీ ఎప్పటికైనా భారత ఉపఖండంలో తమ స్థానాన్ని పదిలపరచుకోవటానికీ పాకిస్థాన్ ఒక సాధనంగా ఉపయోగపడ్తుందని చర్చిల్ ఆశించినట్లుగా కూడా పత్రికలు తెలిపాయి.

బ్రిటిష్ చక్రవర్తి ఆరవ జార్జిగారు "His life and Reign" అనే పుస్తకం వ్రాశారు. అందులో ఇండియా ఇంక అనతికాలంలోనే తమ చేతుల్లోంచి జారిపోతుందనే అభిప్రాయాన్ని వెలువరించినట్లుకూడా తెలిపాయి.

సాక్షాత్తూ రాజుగారే ఆ అభిప్రాయంలో వున్నట్లు ప్రపంచం అర్థంచేసుకొంది!

బ్రిటిష్ ప్రధాని పదవినించి దిగిపోతూ విన్స్టన్ చర్చిల్ గారు పాకిస్థాన్ ఏర్పాటుకు బీజాలు వేశాడని భారతీయ మేధావులు విమర్శించారు.

ఇదిలా వుండగా -

"భారత దేశంలో ఇంకా అధికారంలో వుండటం మనకు అసాధ్యం. సాధ్యమైనంత త్వరగా మనల్ని మనం ఉపసంహరించుకొని మర్యాదగా బైటకు వచ్చేయడం మంచిది..."

బ్రిటన్ పార్లమెంట్లో లేబర్పార్టీ సభ్యులు ప్రభుత్వాన్ని ముక్తకంఠంతో కోరారు. భారత్లో బ్రిటిష్ అధికారుల వైఫల్యాలను ఎత్తి చూపిస్తూ ప్రభుత్వాన్ని నిలదీయసాగారు.

"సుభాస్చంద్రబోస్ బ్రిటన్ ప్రయోజనాలకు వ్యతిరేకంగా ఐ.ఎన్.ఎ. సైన్యాన్ని నిర్మించి విఫలం అయ్యాడు. యుద్ధానంతరం సుభాస్ చంద్రబోస్ మరణించిన తర్వాత అతని సైనికాధికారుల పైన విచారణ జరిపి శిక్షలు వేశారు. కానీ, ఆ శిక్షల్ని ఒక్కటికూడా మనం అమలు జరపలేకపోయాం! అందరినీ బేషరతుగా విడుదలచేశాం. 1946 ఫిబ్రవరిలో బొంబాయిలో నేవీ సైనికులు తిరుగుబాటు జరిపారు. మనవాళ్ళు ఏం చేయగలిగారు? మౌనంగా చూస్తుండి పోయారు. వైమానిక దళంలో కూడా తిరుగుబాటు జరగవచ్చని వార్తలు వస్తున్నాయి. కాని, దాన్ని నిరోధించటానికి మనం ఎలాంటి చర్యలూ తీసుకోలేక పోతున్నాం. జబ్బల్పూర్లో భారత సిగ్నల్కోర్ సమ్మె జరుపుతుంటే భారత్లో బ్రిటిష్ అధికారులు వినోదం చూస్తూ నిల్చున్నారు-" అని విమర్శించాడో బ్రిటన్ పార్లమెంటేరియన్.

"భారత్లో ఎక్కడ చూసినా 'గత పాతిక సంవత్సరాలుగా సత్యాగ్రహాలు. స్వచ్ఛందంగా అరెస్టులు కావటాలు మాత్రమే వుండేవి. ఇప్పుడు సమ్మెలు, ఊరేలు, గృహదహనాలు పెరిగిపోతున్నాయి. వాటిమీద మన ప్రభుత్వానికి ఎటువంటి అదుపూలేకుండా పోతోంది.

భారతీయుల్ని పోలీసులుగా నియమించి వారిచేత భారతీయుల్నే హింసింప చేయడంలో మనదే గొప్ప తెలివి... అని ఇన్నాళ్ళు బ్రిటన్‌లో రాజకీయనాయకులు సంబరపడిపోతూండేవారు.

కానీ, అనుకొన్నదొక్కటీ - అయ్యిందొక్కటీ... అయ్యింది! ఇప్పుడింక భారతీయ అధికారులు, పోలీస్ రక్షణ యంత్రాంగం ఎంత మాత్రమూ బ్రిటిష్‌కు సహకరించే పరిస్థితి లేదని స్పష్టం అవుతోంది. పోనుపోనూ ఈ పరిస్థితి మరింత పెరుగుతుందేగాని తగ్గదు. భారతజాతీయ ఉద్యమాన్ని అణచివేయటం కాంగ్రెస్ పార్టీని వంటరి దాన్ని చేయటం కోసం హిందూ ముస్లిం మతతత్త్వవాదుల్ని ప్రోత్సహించటం, జమీందారులకి 'సర్' బిరుదులు, రావు బహద్దూర్ బిరుదులు ఇచ్చి వారిని ప్రజా పీడకులుగా తయారు చేయటం... ఇవన్నీ ఇంక ఎంతో కాలం చెల్లవు.

ఆత్మ విమర్శ చేసుకోవాల్సిన సమయం బ్రిటన్‌కు ఆసన్నమైనదిగా భావిస్తున్నాం..." అంటూ బ్రిటన్ లేబర్‌పార్టీ సభ్యులు ఒక్కొక్కరే బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశం పట్లచేసిన తప్పుల్ని ఎండగట్టటం మొదలుపెట్టారు. అప్పటివరకూ అధికారంలో వున్న కన్జర్వేటర్లకు ఈ శాపనార్థాలన్నీ తగుల్తున్నాయి. కానీ, వారు మౌనంగా భరిస్తూ వుండి పోయారు. భారతదేశానికి స్వాతంత్ర్యం ఇచ్చే ముసాయిదా తీర్మానాన్ని బ్రిటన్ ప్రధాని అట్లీ చర్చకు పెట్టాడు.

హౌస్ ఆఫ్ లార్డ్స్ (బ్రిటిష్ వారి రాజ్యసభలాంటిది) లో చర్చిల్, సర్‌జాన్ యాండర్సన్ ఆర్.ఎ.బట్లర్... ప్రభుత్వనిర్ణయాన్ని పూర్తిగా వ్యతిరేకించారు.

ఇది "Unjustified Gamble" అని వ్యాఖ్యానించాడు సభలో యాండర్సన్ గారు.

"ఇండియాలో మైనారిటీల రక్షణ గురించీ, రాజులు జమీందారుల హక్కుల గురించీ ఇందులో ప్రస్తావన లేదు" అంటూ విమర్శించాడు చర్చిల్‌గారు.

ఆఖరున ఓటింగ్ జరిగింది.

331-185 ఓట్లతేడాతో కన్జర్వేటివ్‌లు ప్రతిపాదించిన సవరణలు తీర్మానాలు వీగిపోయాయి.

"భారత దేశానికి అధికారాన్ని బదలాయిస్తూ, దీర్ఘ కాలిక, స్వల్పకాలిక అంశాల్ని రూపొందించి మంత్రివర్గం ఉపసంఘాన్ని రాయబారం పంపాలని ప్రభుత్వం నిర్ణయించింది-" అని ప్రకటించాడు బ్రిటన్ ప్రధాని అట్లీ.

"అన్ని పార్టీల వారూ అన్ని రాజకీయ సంస్థల ప్రతినిధులూ సమాన ప్రాతినిధ్యం వహించేలా బృహత్తరసమావేశం నిర్వహించాలని వైస్రాయ్‌ని ఆదేశిస్తున్నాము." అన్నాడు అట్లీ.

"స్వాతంత్ర్యం ఇచ్చే విషయంమీద గతంలో రౌండ్ టేబిల్ సమావేశాలు అనేకం జరిగాయి. అయితే ఈ విడత జరిగే ఈ సమావేశం నాటికి స్వాతంత్ర్యం ఇవ్వటం

అనే అంశం ఖాయమై పోయింది. ఇంక ఇప్పుడు జరగవలసింది- అధికార్ల బదలాయింపు మాత్రమే! ఎవరు అధికారంలో కొనసాగాలనేది భారత ప్రజలు నిర్ణయిస్తారు-" అన్నారు పండిట్ నెహ్రూ!

1946 మార్చి 24

లార్డ్ పెథిక్ లారెన్స్ భారతీయ వ్యవహారాలకు సంబంధించిన బ్రిటిష్ సెక్రటరీగారితో లేబర్ పార్టీకి చెందిన మంత్రివర్గ సభ్యుల బృందం, వ్యాపార విషయాలబోర్డు అధ్యక్షులు సర్ స్టాఫర్డ్ క్రిప్స్, లార్డ్ ఎ.వి. అలెగ్జాండర్ వీళ్ళంతా లండన్‌లో సమావేశమై ఒక కార్యాచరణ పథకం రూపొందించుకొని భారత్ బయల్దేరారు.

"ఇండియాలో కాంగ్రెస్, ముస్లింలీగ్, హిందూమహాసభ, అకాలీదళ్, మొదలైన పక్షాల నాయకుల్ని కలుసుకొన్నారు. అనేక తర్జన భర్జనలు జరిగాయి మధ్యంతర ప్రభుత్వం ఏర్పాటుకు అంగీకారం కుదిరింది..." అని ప్రకటించాడు బ్రిటన్ కేబినెట్ బృందం నాయకుడు లారెన్స్.

కానీ, కాంగ్రెస్, ముస్లింలీగ్‌లు కలిసి ఒక నిర్ణయానికివస్తే తప్ప మధ్యంతర ఎన్నికలు సాధ్యంకాని పరిస్థితి ఏర్పడింది.

"భారత్‌లో కాంగ్రెస్ ముస్లింలీగ్‌లు తమ విభేదాలు పరిష్కరించుకొని త్వరగా ఇంటెరిమ్ ప్రభుత్వం ఏర్పాటుకు సహకరించవలసింది" అంటూ వైస్‌రాయ్ వేవెల్ గాంధీజీని కోరారు.

"చర్చల్లో ప్రతిష్టంభన కొనసాగుతూనేవుంది.ఎవరికి వారు అహంకారానికి పోయి మన నాయకులే స్వాతంత్ర్యాన్ని ఆలస్యం చేస్తున్నారు-" అని భారతప్రజలు ఆదుర్దాచెందడం మొదలుపెట్టారు. ఈ ఉత్కంఠని "భరించలేకపోతున్నారువాళ్ళు" మీకు పరిపాలించడం చేతకాదు-" అని బ్రిటిష్ వాళ్ళు మళ్ళీ ఎక్కడంటారోనని భయపడుతున్నారంతా!

పాకిస్తాన్ ఏర్పడే తీరాలని ముస్లింలీగ్! దేశ విభజనకు అంగీకరించేది లేదని కాంగ్రెస్......

ఇంతలో ఢిల్లీలో మధ్యంతర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి ఎన్నికలకోసం పిలుపునిచ్చాడు వైస్‌రాయ్ వేవెల్.

జనం దృష్టి స్వాతంత్ర్యావేశంతో కూడిన ఎన్నికలమీదకు మళ్ళింది!



"ఢిల్లీ కాంగ్రెస్ పెద్దల దయలేని నాడు ఎంతటి ప్రజా నాయకుడికైనా కాంగ్రెస్‌లో నూకలు చెల్లినట్లే! ఈ ముఖ్యమంత్రి పదవి శాశ్వతం అని అనుకొని ఈ పదవిని స్వీకరించలేదు. ఇవ్వాళ అసంతృప్తిని చల్లార్చడానికి నాలుగుమంత్ర పదవులు

గిరాటెయ్యడం పెద్ద సమస్యకాదు. కానీ, అంతటితో ఈ అసంతృప్తి ఆగుతుందనే హామీ లేదు." అన్నారు ముఖ్యమంత్రి ప్రకాశంగారు.

"కామరాజు నాడారుగారు మాధవమీనన్‌కు మంత్రిపదవి ఇస్తే చాలు అంటున్నారు- అవిశ్వాస తీర్మానం ఉపసంహరించు కొంటారట..." అని రాయబారం వచ్చిన తమిళకాంగ్రెస్ పెద్దల్ని సున్నితంగా తిరస్కరించి పంపారు ప్రకాశంగారు.

"ఒకహరిజనుణ్ణి మంత్రిగా తీసుకొన్నాను వేములకూర్మయ్యగారు చాకచక్యంగా హరిజన ప్రయోజనాలు సంరక్షించే కార్యక్రమాలు చేపడ్తుంటే కోటిరూపాయల నిధినిచ్చి ప్రోత్సాహించాను. మరొక హరిజన సభ్యుడు శివ షణ్ముఖంపిళ్ళేని అసెంబ్లీ స్పీకరుగా ఎన్నుకోవటానికి సహకరించాను- ఎక్కడా లేనివిధంగా ఖాదీకోసం కోటిరూపాయలు కేటాయించాను. రాష్ట్రంలో మొన్న ఏర్పడిన కరువు 1943 బెంగాల్ కరువుకన్నా పెద్దది కానీ ఆహార ధాన్యాల సరఫరా సక్రమంగా జరిపి ప్రజలు కరువు పాలిట పడకుండా కాపాడాను. కొత్త మిల్లులు, పరిశ్రమలు నెలకొల్పాను మద్యపాన నిషేధాన్ని ఎనిమిది జిల్లాల్లో అమలుచేశాను. ఇంకొక ఆరుజిల్లాల్లో అమలు చెయ్యబోతున్నాను. రాజకీయ ఖైదీలందరిని విడుదల చేయించాను. రహస్యజీవితం గడుపుతున్న వారిమీద వారెంట్ రద్దు చేయించాను. హిందూస్త్రీలకు ఆస్తిహక్కు కల్పించాను. హరిజన దేవాలయ ప్రవేశం చేయించాను." ఇంతకన్నా నా జన్మకు ఇంకేం కావాలి... ఏడాది వుంటేనేం.... ఎవ్వరూ చెయ్యలేనన్ని ఘనకార్యాలు చేశాను.- ఈ ముఖ్యమంత్రి పదవి కోసం రాజీ పడవలసిన అగత్యంనాకు లేదు. నా వెనక ప్రజలున్నారు. ప్రజలే ప్రకాశం! ప్రకాశమే ప్రజలు!" అన్నారు ప్రకాశంగారు. అమితమైన అతిశయంనిండిన ఆయన మాటలు విన్నాక హిమాలయాలంత ఎత్తున ఎదిగిన ఆయన వ్యక్తిత్వాన్ని చూసి ప్రతి ఒక్కరూ ఆశ్చర్యపోయారు.

"ప్రకాశంగారి పైన "పవిత్రయుద్ధం" ప్రకటించిన డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు, కళావెంకటరావుగారు, కల్లూరి చంద్రమౌళిగారు, పళ్ళంరాజుగారు, నీలం సంజీవరెడ్డిగారు, అల్లూరి సత్యనారాయణరాజు గారు... ఈ మహామహులు కూడా తక్కువవారేమీ కాదు..." అన్నారు బులుసుసాంబమూర్తిగారు. "రాజాజీ వర్గం ఓమాండూరునే బలపరరుస్తోంది. కామరాజ్ వర్గం ప్రకాశంమీద అలిగింది. ఎవరూ పట్టుదలలు వీడటంలేదు. నేను చేయగల్గింది ఏమీలేదు" అన్నారాయన రాజీప్రయత్నాలు విరమిస్తూ... అలసి పోయి!

"నా ప్రభుత్వం పడిపోతుందంటూ కొందరు చేస్తున్న ప్రచారం, సంతకాల సేకరణలు, అధిష్టానానికి ఫిర్యాదులు, కుట్రలు, కుతంత్రాలు" అన్ని నాకు తెలుసు-

ప్రకాశం ప్రభుత్వం పడిపోవడం అంటే ప్రజాప్రభుత్వం పడిపోవటమే-" నా బలం ప్రజల్లోవుంది. నన్ను కొద్దిమంది శాసనసభ్యులు ఓడిస్తారనే భయంలేదు. నాకు విరోధులులేరు. 10 నెలల కాలంలో నేను ఏంచేశానో సమీక్షించేందుకు ఈ అవిశ్వాస తీర్మానం నాకు అవకాశం ఇస్తోంది. ప్రజలు ఏమనుకొంటున్నారో నాకు తెలియాలి. అందుకే ఈ రోజునుంచీ ప్రజాపర్యటన ప్రారంభిస్తున్నాను-" అని ప్రకటించారాయన!

"మద్రాస్ కు నువ్వు ముఖ్యమంత్రిగాగాని, సాధారణమంత్రిగా కూడా వుండకూడదని నా నిశ్చితాభిప్రాయం. శాసన సభలో నువ్వు వెనక సీటులో కూర్చోవలసిందే..." అని ఆగ్రహంగా ఆజ్ఞాపించారు గాంధీజీ! నేను ఆయన్ని లెక్కచేయలేదు. ఈ విషయం పచ్చినిజం! కానీ, ఆరు నెలలు తిరగకుండానే, "అఖిల భారతావనికి ఆదర్శ ప్రాయుడవైన ముఖ్యమంత్రివి - ప్రకాశం! సెహభాష్-" అని ప్రశంసించారు స్వయంగా గాంధీగారు. మళ్ళీ ఇంతలో ఈ అవిశ్వాస తీర్మానం గోల ఏమిటీ..." అని చిరాకు పడ్డారాయన!

114 మంది కాంగ్రెస్ శాసనసభ్యుల్లో 40 మంది శాసనసభ్యులైన ఆంధ్రులు ప్రకాశంగారికి వ్యతిరేకంగా సంతకాలు చేశారని వార్తా పత్రికలు తెలిపాయి.

అధిక శాసన సభ్యుల మద్దత్తు లేదని తేలిపోవడంతో 1947 మార్చి 30వ తేదీన ప్రకాశంగారు రాజీనామా చేశారు...

స్వేచ్ఛగా ఆయన ప్రజల్లోకి వచ్చేశారు!

"పార్టీ నాయకులే ముఖ్యమంత్రులుగా వుండాలో, ప్రజానాయకులే ఉండాలో నిర్ణయించవలసింది ప్రజలే." అన్నారు ప్రజలమధ్య ప్రజల మనిషిగా నిలబడ్డ ప్రజా ప్రకాశంగారు.

ఆయన స్థానంలో ఓమాండూర్ రామస్వామి అనే వ్యక్తి ముఖ్యమంత్రి అయ్యారు.

ఈ ఓమాండూర్ రామస్వామిఎవరో... ఆయన వివరాలు ఏమిటో ఎవరికీ తెలియక పోవడంతో పత్రికలు ఆయనగురించి ఏమీ రాయలేదు.

ప్రకాశం గారి ప్రభుత్వం పడిపోవడంతో ప్రజల ఆగ్రహానికి దడిసి ఆయనకు వ్యతిరేకంగా సంతకాలు చేసిన ఆంధ్ర శాసనసభ్యులు ఎవరూ మద్రాసు విడిచిబైటకు రాలేదు.



1946 ఆగస్ట్ 6

దేశవ్యాప్తంగా అత్యధిక స్థానాల్లో అత్యధిక మెజార్టీతో గెలుపొందిన కాంగ్రెస్ పార్టీని మధ్యంతర ప్రభుత్వం ఏర్పాటు చేయవలసిందిగా వైస్‌రాయ్ వేవెల్ నెహ్రూని ఆహ్వానించాడు.

పండిట్ నెహ్రూ ప్రధానిగా ప్రమాణస్వీకారం చేశాడు. ఆగస్ట్ 16, 1946ని ముస్లింలీగ్ 'ప్రత్యక్షచర్యలదినం'గా ప్రకటించింది. బెంగాల్, బీహార్, త్రిపుర ప్రాంతాలు అల్లకల్లోలం అయ్యాయి.

"చంఘిజ్‌ఖాన్ రోజుల్ని మళ్ళీ సృష్టిస్తాను-" అని జిన్నాగారు ఆగ్రహంగా ప్రకటించారు. "ప్రభుత్వంలో చేరేది లేదంటూ నెహ్రూగారి ఆహ్వానాన్ని కఠినమైన పదజాలంలో తిరస్కరించారు జిన్నా!

"ఈ మధ్యంతర ప్రభుత్వం చేసే రాజ్యాంగం అంతా అక్రమం, అన్యాయం- అంటూ జిన్నాగారు తన కాంగ్రెస్ వ్యతిరేకతని ప్రకటించాడు.

1948 జూన్ లోపు భారతదేశానికి స్వాతంత్ర్యం బదలాయిస్తున్నాం... ఈ లోగా నవభారత నిర్మాణానికి కావలసిన ఏర్పాట్లు చేస్తూ శాంతిని ప్రతిష్టాపించు కోవలసింది' ' అని బ్రిటన్ ప్రధాని లార్డ్ అట్లీ భారత ప్రభుత్వానికి సలహా ఇచ్చారు! ముస్లింలీగ్ శాంతిని తిరస్కరించింది.

"ముస్లింలు అధికంగా నివసించే ప్రాంతాలన్నింటినీ కలిపి పాకిస్తాన్‌గా ఏర్పాటు చేయడం తప్ప దేన్నీ నేను అంగీకరించాను-" అని పునరుద్ఘాటించారు జిన్నా ఆకలి గొన్నపులి జనారణ్యంమీద పడ్డట్టు మత విద్వేషం అమాయక జనాల్ని బలితీసుకొంటూనే వుంది!

అంతలో మనసుమార్చుకున్న జిన్నాగారు వేవెల్‌కి ఉత్తరం రాశాడు-

"కాంగ్రెస్‌కు మొత్తం అధికారాన్ని ధారాదత్తం చేయడం మరణ సదృశం! అందుకని ముస్లింలీగ్ పక్షాన ప్రభుత్వం లో ఐదుగురు సభ్యుల్ని నామినేట్ చేయాలని ముస్లింలీగ్ నిర్ణయించింది-" అనేది ఉత్తరంలోని సారాంశం. లియాఖత్ ఆలీఖాన్ గారు మధ్యంతర ప్రభుత్వంలో మంత్రిగా చేరారు. డా॥ అంబేద్కర్ గారి ప్రతిస్పందన ఇంతకన్నా ఘాటుగా వుంది. "అస్పృశ్యుల గురించి మాట్లాడే నైతిక హక్కు కాంగ్రెస్‌కు లేదు. అందుకని షెడ్యూల్ కులాల ఫెడరేషన్ తరఫున ఒక సీటును ముస్లింలీగ్ ద్వారా పొందేందుకు డా॥ అంబేద్కర్‌గారు జిన్నాగారి ఆహ్వానాన్ని మన్నిస్తూ తన అంగీకారాన్ని తెలిపారు-" అని వార్తలు వచ్చాయి.

"ఒక చేత్తో చప్పట్లు ఎలా కొడతాం....? ఈ దేశాన్ని కాంగ్రెస్ ఒక్కటే పరిపాలించ టానికి వీల్లేదు. అందుకే నేను ప్రభుత్వంలో చేర్తున్నాను-" అన్నారు ప్రమాణస్వీకారం చేశాక లియాఖత్ ఆలీఖాన్‌గారు.

మతకల్లోలాలు అదుపు లేకుండా కొనసాగుతూనే వున్నాయి. ఆపేవారు లేని పరిస్థితి! శాంతి వచనాలు మతోన్మాదులకు ఎక్కడం లేదు. అతి సామాన్య ప్రజలు - హిందువులైనా... ముస్లిములైనా... ప్రేక్షక పాత్ర వహించక తప్పలేదు. సామాన్యజనానికి మతం లేదు కదా!! నిర్ణయాలు తీసుకునే అధికారాన్ని భారతీయుల చేతులకే అప్పగించారు... కానీ, ఆచేతుల్లో ఇప్పుడు కత్తులున్నాయి- అని బాధపడ్డారు కూర్మయ్యగారు. దేశంలోని సగటుమేధావులందరి బాధనీ ఈ వ్యాఖ్య ప్రతిబింబించింది.

"వేవెల్ స్థానంలో లార్డ్‌మౌంట్ బాటన్ ఇంకనుంచి వైస్‌రాయ్‌గా వ్యవహరిస్తారు" అని ప్రకటించింది ఇంతలో బ్రిటిష్ ప్రభుత్వం.

1947 జూన్ 3 వ తేదీ

లార్డ్ మౌంట్ బాటన్ దేశంలోకి అడుగుపెడ్తూనే "మౌంట్‌బాటన్ ప్లాన్" ప్రకటించాడు.

"రెండు ప్రత్యేకదేశాలు ఏర్పడతాయి. ఒకటి ఇండియా ...... రెండు పాకిస్తాన్. 1947 ఆగస్ట్ 15 నాటికి బ్రిటన్ పూర్తిగా ఇండియానుంచి ఉపసంహరించుకొంటుంది-" అన్నాడు మౌంట్‌బాటన్! అట్లీగారు ప్రకటించిన తేదీకి ఒక సంవత్సరం ముందే స్వాతంత్ర్యం ఇస్తానన్నాడు మౌంట్‌బాటన్. కానీ పాకిస్తాన్‌ను విడదీయక తప్పదని ప్రకటించాడు.

'మతపరంగా పంజాబ్, బెంగాల్ రాష్ట్రాల్ని విడగొట్టి పాకిస్థాన్‌ని ఏర్పాటు చేస్తామనే పథకానికి కాంగ్రెస్ సమ్మతించింది-" అని బ్రిటిష్ ప్రభుత్వం పక్షాన ప్రకటించాడు మౌంట్‌బాటన్.

అదేరోజు 1947 జూన్ 3వ తేదీ రాత్రి రేడియోలో దేశ ప్రజలనుద్దేశించి ప్రధాని నెహ్రూ ప్రసంగించారు. "మౌంట్‌బాటన్ ప్లాన్" ని భారతప్రభుత్వం ఆమోదిస్తోంది అన్నారాయన.

15జూన్, 1947న అఖిలభారత కాంగ్రెస్ కమిటీ కూడా సమావేశమై మౌంట్‌బాటన్ ప్లాన్‌కు ఆమోదం తెలిపింది.

మౌంట్‌బాటన్ అన్న మాటప్రకారం 1947 ఆగస్ట్ 15న స్వాతంత్ర్యం ఇస్తున్నట్లు ప్రకటించాడు.

ఒకవైపున మతపరమైన అల్లర్లు సాగుతూనే వున్నాయి.

వందేమాతరం ఉద్యమం నుంచి క్విట్ ఇండియా ఉద్యమంవరకూ సాగిన స్వాతంత్ర్య పోరాటంలో ఆంధ్రుల పాత్రని ప్రతిఒక్కరూ స్మరించుకొన్నారు.

సంఘ సంస్కరణలతో ముడిపెట్టి స్వాతంత్రోద్యామాన్ని గాంధీజీ నడిపిన వైనాన్ని అందరూ గుర్తుచేసుకున్నారు.

★★★

31 మార్చి 1947 మధ్యాహ్నం 12.15గంటలు :

ఉమ్మడి మద్రాస్ రాష్ట్ర అసెంబ్లీలో అతిముఖ్యమైన హరిజన చట్టానికి పదునుపెట్టే బిల్లును ప్రవేశపెడ్తున్నారు హరిజనాభివృద్ధి మంత్రి వేముల కూర్మయ్యగారు.

"మద్రాస్ రిమూవల్ ఆఫ్ సివిల్ డిజెబిలిటీస్ (ఎమెండ్‌మెంట్) బిల్ 1947" ని సభ ఆమోదంకోసం ప్రవేశపెడ్తున్నాను అధ్యక్షా!" అన్నారు మంత్రి శ్రీ కూర్మయ్యగారు.

"అధ్యక్షా! సభలో హరిజన బిల్లు ప్రవేశపెట్టబోయేముందు ఈ హరిజనులు గురించిన పూర్వాపరాలను సభదృష్టికి తీసుకురావడం నా బాధ్యతగా భావిస్తున్నాను.

అతి ప్రాచీన వేదకాలంలో మన దేశంలో కుల వ్యవస్థ వున్నట్లు ఎక్కడా కన్పించదు. నాల్గవ వేదమైన అధర్వణ వేదంలో మాత్రమే కులవ్యవస్థ గురించి ప్రస్తావన మనకు కన్పిస్తుంది...." అంటూ కులవ్యవస్థ మూలాల్లోకి వెళ్ళి చరిత్ర లోతుల్ని తరచి చూడసాగారు కూర్మయ్యగారు.

సర్! కులవ్యవస్థ అనేది ఒక వ్యక్తిగాని, ఒక వ్యవస్థగాని సృష్టించింది గాదనీ, ఆచార వ్యవహారాలు, సామాజిక పరిస్థితుల్ని బట్టి ఈ కులవ్యవస్థ... అందులో కొన్ని కులాల ఆధిపత్యమూ, అంటరానితనమూ ఏర్పడ్డాయని మనకు అర్థం అవుతోంది!

దేశజనాభాలో అంటరానివారుగా భావించబడ్తున్న వారు 1/5 వవంతు ఉన్నారని జనాభాలెక్కలు చెప్తున్న సంగతి అందరికీ తెలుసు!

అధ్యక్షా! ఈనాడు అంటరానివారుగా చెప్పబడ్తున్న ఈ కులస్థులు ఒకప్పుడు ఈదేశాన్ని పరిపాలించిన వారని చరిత్ర చెప్తోంది.

ఆర్యులు ఈ దేశంపై దండు వచ్చినప్పుడు వారి చేతుల్లో పరాజితులైన అసలైన భారతీయులే ఈనాడు అంటరాని కులాలుగా మిగిలి పోయారనీ, విదేశీయులైన ఆర్యులు మనదేశాన్ని పరిపాలించటం మొదలు పెట్టారని చరిత్ర గ్రంథాలు ఆధారాలు చూపిస్తున్నాయి.

అధ్యక్షా! ఓడిపోయిన ఈ స్థానిక జాతులవారంతా బతకడం కోసం అడవుల్లోకీ, దూర సుదూర ప్రాంతాల్లోకి పారిపోయారు. వారిమీద అప్పటినించీ అత్యాచారాలు అనేకం కొనసాగుతూనే వున్నాయి. వీరందరినీ ఇతర ఉన్నత కులాలతో సమానంగా తీసుకురావటానికి ఇప్పుడు సమయం ఆసన్నమైందిగా భావిస్తున్నాను. హిందూ మతంలో ఇతర కులాలతో సమానంగా హరిజనులుకూడా అన్ని హక్కులూ పొందటానికి ఈ బిల్లు ఉపయోగపడ్తుందని నేను ఆకాంక్షిస్తున్నాను.

అధ్యక్షా! హిందూమతం 'ధర్మాన్ని' పాటించమని ప్రబోధిస్తున్న సంగతి తమకు తెలుసు. రాజు కన్నా ధర్మమే గొప్ప! ఋషులు, మహాత్ములుచెప్పిన మార్గంలో రాజు ధర్మాన్ని అనుసరించాలి! కానీ, అంటరాని వారంటూ సాటిమనుషుల పట్ల అమానుషంగా ప్రవర్తిస్తున్న మన దేశంలో నిజంగా ధర్మం వుందా?"... అని నేను ఈ సభని ప్రశ్నిస్తున్నాను. ప్రతిభారతీయుణ్ణి కూడా ఇదే ప్రశ్న అడుగుతున్నాను - ధర్మానికి బదులు అధర్మం రాజ్యం ఏలుతోందిప్పుడు!

ఈ అధర్మంలోనే 200 సంవత్సరాలుగా మన దేశాన్ని బ్రిటిష్ వారు పరిపాలిస్తున్నారు.

అధ్యక్షా! ఈ విషయాలు నేను ప్రస్తావిస్తున్నప్పుడు గౌరవ సభ్యులు బి.యస్.మూర్తిగారు "ముస్లింల సంగతి ఏమిటీ...?" అని ప్రశ్నిస్తున్నారు.

నిజానికి ముస్లింలు ఈ దేశానికి వెయ్యేళ్ళ క్రితమే వచ్చారు. ఇప్పుడు భారతీయులుగానే జీవిస్తున్నారు. ముస్లిం సంస్కృతి, హిందూ సంస్కృతి చాలా సందర్భాల్లో సంలీనంచెంది ఉన్నతమైన భారతీయసంస్కృతి మనదేశంలో ఏర్పడింది.

ఇండియాను జయించిన ముస్లిం ప్రభువులు ఈ దేశాన్ని దోచి ఇక్కడి సంపదని ఏ విదేశానికీ చేరవేయలేదు. వారి సంపదని, వారి శక్తి సామర్థ్యాల్ని కూడా ఈ దేశం కోసమే వారు ఖర్చు పెట్టారని నా అభిప్రాయం! పర్షియా. అరేబియా సంస్కృతిని ఈ దేశానికి తెచ్చి ఇక్కడ స్థిరనివాసం ఏర్పరచుకున్నారు.

కానీ, బ్రిటిష్ వారు అలాకాదు - వారు ఇక్కడి జీవన స్థితిని విచ్ఛిన్నం చేశారు. వారు వ్యాపారం చేసుకోవటానికి వచ్చి, ఈ దేశ సంపదని నిలువెల్లా అపహరించుకు పోయారు. ఆ దృష్ట్యా చూసినప్పుడు బ్రిటిష్ పాలన కన్నా ముస్లిం పాలన ఎన్నో రెట్లు ఉత్తమమైనదిగానే భావిస్తున్నాను ముస్లింప్రజల్ని సోదరులుగానే మనం భావిస్తున్నాం. వారిప్పుడు పర్షియాకో, అరేబియాకో చెందిన ప్రజలు కాదు- వారు భారతీయులు.

వారిగురించి ఇంతకన్నా ఎక్కువగా చెప్పనవసరం లేదనుకుంటాను అధ్యక్షా!!

" అధ్యక్షా! ఒకే మతం. ఒకే కులంగా అందరూ సమానంగా వున్న వేదకాలంనాటి వ్యవస్థనుంచి మనం ఈ అంటరాని వ్యవస్థలోకి దిగిపోయామంటే అతిశయోక్తి కాదు-" అంటూ తన ప్రసంగాన్ని కొనసాగించబోతున్నారు కూర్మయ్యగారు.

ఇంతలో అసెంబ్లీలో ప్రతిపక్షనాయకుడు. మహ్మద్ ఇస్మాయిల్ సాహెబ్ బహదూర్ లేచి అధ్యక్షా! అంటూ కూర్మయ్యగారి ఉపన్యాసానికి కొద్దిగా అంతరాయం కల్గించారు.

"అధ్యక్షా! గౌరవనీయులైన మంత్రివర్యులు ఇస్లాంగురించి మాట్లాడారు. ఆ అంశంమీద వారు ప్రసంగించటం పూర్తి అయ్యిందో లేదో నేను తెలుసుకో గోర్తున్నాను. ఆయన వేరే అంశంలోకి వెళ్ళబోతున్నారని గమనించి ఈ అంతరాయం కల్గించాను. ముస్లిం పాలన వలన అస్పృశ్యత పెరిగిందని మంత్రిగారు అభిప్రాయం పడ్తున్నారా ....? లేక. ముస్లింల స్వేచ్ఛా పాలన వలన అంటరానితనం మరీ విజృంభించకుండా ఆగిందనుకొంటున్నారా తెలియజేయవలసిందిగా కోర్తున్నానా....? అనడిగారు.

దానికి సమాధానం చెప్పటానికి కూర్మయ్యగారు క్షణంకూడా ఆలస్యం చెయ్యలేదు.

"మిష్టర్ స్పీకర్! ముస్లింలీగ్ పక్షనాయకులు గౌ॥మహమ్మద్ ఇస్మాయిల్ సాహిబ్ బహదూర్‌గారు లేవనెత్తిన ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పాలంటే, ముస్లింల పాలనలో భారతదేశంలో అంటరానివారి పరిస్థితి అంతో ఇంతో మెరుగైనదనే నేను భావిస్తున్నాను.

హిందూమతం ఎంతో గొప్పది! ఎన్నో ఉన్నతమైన అంశాలను ప్రవచించిన ఘనత హిందూమతానికి ఉంది. కానీ, దురదృష్టవశాత్తూ కొన్ని దుష్టసాంప్రదాయాలు ఈ మతంలో చేరిపోయాయి. హిందువుల్లో అంటరానివారిని ఏ స్థితిలో చూస్తున్నారో, ముస్లింలను కూడా అదే స్థితిలో చూసేవారున్నారని నేను గట్టిగా చెప్పగలను.

స్వాతంత్ర సమరంలో హరిజనోద్ధరణని బాపూజీ ఒక భాగంగా చేసి ప్రజా ఉద్యమాన్ని నడిపించారు. కాబట్టి ఈనాడు హిందూ సమాజంలో హరిజనుల స్థితి మెరుగైనట్లు అభిప్రాయపడ్తున్నాను.

నిజానికి ముస్లింలు ఎవరూ హరిజనుల్ని అంటరానివారుగా చూడరు. పల్లెల్లోగానీ, పట్టణాల్లోగానీ, ముస్లింలు హరిజనుల్ని తమతో కలిసి నివసించడానికి అంగీకరించటం మనం కళ్ళారా చూస్తున్నాం.

ఈ చర్చలో ఏ విషయాన్నీ నేను దాచి పెట్టకూడదని మనుసు విప్పి మాట్లాడుతున్నాను!

కాబట్టి అధ్యక్షా! హిందువులు ఆచార వ్యవహారాల వలన అణగద్రొక్కబడి నిమ్నవర్గాల వారిగా ఇన్నాళ్ళు అట్టడుగున పడిపోయిన ఈ హరిజనుల గురించి మనం చేయవలసింది ఇంకా ఎంతో వుంది.

హిందూ సమాజంలో సంస్కరణలను అనేకమంది మహాత్ములు అనేక సార్లు తీసుకువచ్చారు.

గౌతమ బుద్ధుడు హిందువులలో వున్న ఈ అసమానతని పోగొట్టటానికే అవతరించాడని ప్రజలు విశ్వసిస్తారు. ధర్మం, అహింసల్నే ఆయన ప్రవచించారు కానీ, ఈనేలమీద పుట్టి ఈ దేశాన్ని సంస్కరించాలని ప్రయత్నించిన బుద్ధిజం జపాన్, సిలోన్‌వంటి విదేశాలకు వెళ్ళి ఆయా విదేశీ సమాజాల్ని ఉన్నతంగా తీర్చి దిద్దింది. భారతీయులు మాత్రం తమ ఆచారాల్ని మార్చుకోలేకపోయారు.

బుద్ధుడి తర్వాత రామానుజాచార్యులు, శంకరాచార్యులు మహనీయులైన గురువులుగా హిందూ సమాజంలో ఆవిర్భవించారు. హిందువులలో అస్పృశ్యతను రూపుమాపటానికి వీరుచేసిన కృషి ఎంతో గొప్పది ఆనాడు.

అస్పృశ్యుల దేవాలయ ప్రవేశం కోసం పరమ వైష్ణవ భక్తుడైన రామానుజుల వారు ఎంతో ప్రయత్నించారు" అన్నారు హరిజనోద్ధరణ శాఖామాత్యులు శ్రీ కూర్మయ్యగారు.

ఇంతలో స్పీకర్ మధ్యలో కల్పించుకొని "హరిజనుల దేవాలయ ప్రవేశం అంశాన్ని 'టెంపుల్ ఎంట్రీబిల్' గురించి మనం చర్చించేప్పుడు మీరు ప్రస్తావించండి -" అని ఆదేశించారు.

"హిందూమతంలో వచ్చిన సంస్కరణలగురించి మాత్రమే నేను ప్రస్తావిస్తున్నాను. సర్! హరిజనోద్ధరణ అనేది కేవలం సామాజిక పరమైన అంశం మాత్రమే కాదనీ హిందూమతానికి సంబంధించిన అంశమనీ తమ దృష్టికి తీసుకువస్తున్నాను. కాబట్టి, ప్రభుత్వం పబ్లిక్, ప్రజల పక్షాన సమాజ ఉన్నతికోసం కొన్ని చర్యలు చేపట్టవలసిన బాధ్యత వుంది!

సర్! రామానుజాచార్యులు హిందూమతంలో సంస్కరణలు ప్రారంభించిన ప్రముఖులు. ఆయన తలపెట్టిన వాటిల్లో అత్యున్నతమైనది 'అస్పృశ్యుల దేవాలయ ప్రవేశం' అనే అంశమే!

ఆయన ముఖ్య శిష్యుల్లో ఒక అస్పృశ్యుడు కూడా వున్నారని చరిత్ర చెప్తోంది!

తిరుమంత్రం ఈ అస్పృశ్యునికి చెప్పవద్దని సవర్ణ హిందువులు ఆయన పైన వత్తిడి తెచ్చినప్పుడు రామానుజుల వారు శ్రీరంగం దేవాలయ బురుజులపైకి ఎక్కి నిలబడి ప్రజలందరికీ వినిపించేట్లుగా, అందరికీ తిరుమంత్రం ఉపదేశించాడని చరిత్రకీ!" అని ఆయన అంటూండగానే, వెనకనుంచి గౌరవ సభ్యుడు ఎవరో "అది తిరుకోష్టియార్ దేవాలయం" అని సవరించారు.

సర్! రామానుజులవారు తిరుకోష్టియార్ దేవాలయ బురుజు మీంచి తిరుమంత్రం ఉపదేశించారని గౌరవ సభ్యులు చెప్తున్నారు.

ఈ మంత్రాన్ని నిమ్నవర్ణాలవారికి ఉపదేశిస్తే ఆయన శిరసు వేయి వ్రక్కలౌతుందని అనపెట్టారు. కానీ, రామానుజులవారు తాను మరణించటానికి సిద్ధంగా వున్నానంటూ ప్రజలందరికీ మంత్రోపదేశం చేశారు.

"ఈ ప్రజలు..... అన్ని వర్ణాలవారూ, అన్ని వర్గాలవారూ.... అస్పృశ్యులతో సహా అంతా ఈ మంత్రోపదేశం వలన స్వర్గానికి వెళ్లేట్లయితే. నేనొక్కణ్ణే వారికి మంత్రోపదేశం చేసినందుకు నరకానికి వెళ్ళినా మంచిదే!" అని రామానుజులవారు ప్రకటించారు. అదీ నిజమైన త్యాగం అంటే!

అధ్యక్షా! అస్పృశ్యులు దేవాలయ ప్రవేశం చేసే ఈ ఉద్యమం రామానుజుల వారితో ప్రారంభమై ఈ విధంగా మాహాత్మా గాంధీతో పరిసమాప్తమైంది....." అన్నారు కూర్మయ్యగారు.

స్పీకర్ మళ్ళీ గుర్తుచేశారు." హరిజనదేవాలయ ప్రవేశం అంశాలెను టెంపుల్ ఎంట్రీబిల్ సమర్పించేప్పుడు మీరు ప్రస్తావించండి" అనీ!

"అలాగే అధ్యక్షా! ముఖ్యమంత్రిగారు హరిజన దేవాలయ ప్రవేశబిల్లును స్వయంగా ప్రవేశపెడుతున్నందువలన నేను ఈ నాలుగు విషయాలూ ఇక్కడ ప్రస్తావించాను.

"అధ్యక్షా! రామానుజుల వారి తర్వాత హరిజనోద్ధరణకు కృషి చేసిన మహనీయులు శంకరాచార్యులవారు. పావన గంగా నదిలో స్నానం చేసి విశ్వనాథుణ్ణి సందర్శించటం కోసం ఆయన వెళ్తున్నప్పుడు ఒక పరయా (అస్పృశ్యుడు) ఎదురయ్యారు.

'ఎవర్నువ్వు' ఆగ్రహంగా ప్రశ్నించాడు శంకరాచార్యులు - ఎదుర్రువచ్చిన ఆ అస్పృశ్యుణ్ణిచూసి.

"నేను [illegible] తికి చెందిన వాణ్ణి" వినయంగా సమాధానం చెప్పాడు అస్పృశ్యుడు.

"నువ్వు ఛండాలుడివి కాబట్టి అవతలకు పో" ఆదేశించాడు శంకరాచార్యులు.

"అయ్యా! తమరు విద్యావివేక సంపత్తి కల్గినవారు. గొప్పగురువులు. పండితులు. ఎవరిని అవతలకు పొమ్మని ఆదేశిస్తున్నార్రు....? నా శరీరాన్నా...? నా ఆత్మనా?.... అని అడిగాడా అస్పృశ్యుడు.

అవాక్కయినారు శంకరులు. సాష్టాంగపడి క్షమాపణల్ను వేడుకొన్నారు.

అధ్యక్షా! చరిత్రలోంచి ఇటువంటి కథలు కొల్లలుగా నేను చెప్పగలను. కానీ, సమయాభావంకూడా వుంది.

శంకరుడితర్వాత గొప్పగా చెప్పుకోదగిన సంస్కర్తలలో రామకృష్ణ పరమహంస, స్వామీ వివేకానంద, రామమోహనరాయ్ వంటివారు ఆధునిక యుగంలో ముఖ్యులు.

అధ్యక్షా! వివేకానందులు వారు అమెరికా వెళ్ళినప్పుడు ఆయన్ని ఇదే ప్రశ్న వేశారట అక్కడ! అమెరికాలో ధర్మ ప్రచారాన్ని చేయటానికి మీరు వచ్చారు. బాగానే వుంది. కానీ, మీ భారతదేశం మాటేమిటీ....! అక్కడ కనీసం ఏడుకోట్ల మంది అస్పృశ్యులు సంఘంలోంచి వెలివేయబడి వున్నారు- అని ప్రశ్నించారట!

చికాగోలో సర్వమత సమ్మేళనంలో ఆయన ప్రసంగిస్తూ, ఒక సవర్ణ హిందువు కనీసం ఆరుగురు హరిజనుల్ని తనతో కలుపుకొంటే స్వర్గానికి వెళతాడు-" అని ప్రకటించారు.

నేను నా చిన్నప్పుడే ఆయన గ్రంథాలు చదివాను. అధ్యక్షా! ప్రతిహిందువూ, కనీసం పెద్దలు, ముఖ్యులు, నాయకులనదగిన హిందువులు ప్రతి ఒక్కరూ తలా ఒక హరిజన బాలుణ్ణిగానీ, బాలికని గాని దత్తత తీసుకొని పైకి తీసుకువస్తే, అన్ని మతాలలోకెల్లా హిందూమతం ఎంతో గొప్పదని పించుకొంటుంది!" అన్నారు కూర్మయ్యగారు.

కరతాళధ్వనులుతో అసెంబ్లీ మార్మోగింది!

సరిగ్గా పన్నెండుగంటల ముప్పయి నిమిషాలయ్యింది పావుగంటసేపు అనర్గళంగా ప్రసంగించారు మంత్రి కూర్మయ్యగారు. బహుశా ఒక మంత్రిగారు చరిత్రలోతుల్లోకి వెళ్ళి సమస్యమూలాలను విశదీకరిస్తూ ఒక ప్రొఫెసర్‌గారు

క్లాసుతీసుకొన్నట్లుగా అసెంబ్లీలో ఉపన్యసించిన సందర్భం అప్పటికి అదే ప్రథమమేమో .... అనుకొన్నారు సభ్యులు!

కూర్మయ్యగారు తన సుదీర్ఘ ప్రసంగాన్ని కొనసాగిస్తున్నారు.

"అధ్యక్షా! హిందూమతంలో దైవభక్తుడిగా జీవించే వ్యక్తుల్లో అత్యధికులు తమ కోర్కెలు తీర్చుకోవటం కోసమే దేవుణ్ణిధ్యానం చేస్తూండటం వలన... బ్రిటిష్ వారి ప్రాపకం సంపాదించుకొని ఉద్యోగావకాశాలు పొందటం వలన ఈ దేశం బ్రిటిష్ రాజ్యంలో హీన స్థితికి చేరింది!

హిందువుల ఆరాధ్య గ్రంథం భగవద్గీత సర్వజన సమానత్వాన్నే సూచించింది!

నిజమైన హిందువు బంగారాన్ని మట్టిని ఒకేలా చూస్తాడు. అలాంటి వ్యక్తి ఈ ప్రాంపంచిక అంశాలకు అతీతంగా వుండగలుగుతాడు.

భగవద్గీత చాతుర్వర్ణ్య వ్యవస్థ గురించి ప్రస్తావించింది. భగవాన్ శ్రీకృష్ణుడు అర్జునుడికి తాను నాలుగు కులాలను వృత్తులనుబట్టి గుణాన్ని బట్టి సృష్టించానని చెప్పాడు. కాబట్టి పుట్టుకని బట్టి కులాలు" అనే అంశం మన దేశంలో మధ్యలో వచ్చిందనీ మనకు అర్థం అవుతోంది!

గౌరవనీయులైన సభ్యులను తమ మాధ్యమంద్వారా నేను ఒకే ప్రశ్న అడగదలచాను- మన సమాజంలో కులవ్యవస్థ గీతలో చెప్పినట్లు ప్రస్తుతం గుణకర్మలమీదే ఆధారపడి నడుస్తోందా...?

పవిత్రమైన హరిజనుణ్ణి మనం చూస్తున్నాం... మనసావాచా కర్మణా పవిత్రత ఏకోశానా లేని బ్రాహ్మణుణ్ణి కూడా చూస్తున్నాం!

పండితుణ్ణి, ఏనుగుని, కుక్కమాంసాన్ని కూడా ఒకేలా చూడగలిగేవాడే గొప్పవాడని గీతాకారుడు చెప్పాడు.

ఇవీ హిందూమతంలో చెప్పిన గొప్ప అంశాలు! కానీ ఏవీ.... ఆ ఉత్తమ .....ఆశయాలు ఈ దేశంలో ..... ఏవీ ఈ రోజున ...... అన్నారు కూర్మయ్య .....గారు ఆవేదనగా! ఆ మాటలు అంటున్నప్పుడు ఆయన కళ్ళు చెమర్చాయి.

ఎంతో ఉద్విగ్న భరితంగా ఉంది సభలో వాతావరణం!

కొన్ని క్షణాల తర్వాత తెప్పరిల్లారు కూర్మయ్యగారు!

"అధ్యక్షా! కాంగ్రెస్ ప్రభుత్వం ప్రవేశపెడ్తున్న ఈ బిల్లుని అంగీకరించి ఆమోదించ వలసిందిగా గౌరవ సభ్యులను ఈ సభాముఖంగా కోర్తున్నాను. పౌరహక్కులు సమాజంలో అట్టడుగు మానవుడికి కూడా సమానంగా అందించటం అనేది కుల వ్యవస్థ నిర్మూలనకు మొదటి మెట్టుగా భావిస్తున్నాను" అని తన ఉపన్యాసాన్ని ముగించారు కూర్మయ్యగారు.

కరతాళధ్వనులతో అసెంబ్లీ ప్రతిధ్వనించింది! అబ్దుల హమీద్‌ఖాన్ సాహెబ్ బహద్దర్‌గారిని అనుబంధ ప్రశ్న వేసేందుకు అనుమతించారు స్పీకర్.

"అట్టడుగు మనిషంటే ఎవరు? Who is the Lowest Man?" అనడిగారాయన.

కూర్మయ్యగారు వెంటనే లేచినుంచున్నారు. "నేటి మనసామాజిక వ్యవస్థలో కొందరి ఆలోచనల ప్రకారం ఈ సభలో నేనే "అట్టడుగు మనిషిని!" సీరియస్‌గా అన్నారు కూర్మయ్యగారు; కూర్మయ్యగారి సమాధానంతో అప్పటిదాకా సీరియస్‌గా నడిచిన వాతావరణం సభ్యుల నవ్వులమధ్య హుషారుగా మారింది! "ఈ రోజున మనం మామూలు రాయేననుకొని నిర్లక్ష్యంగా వదిలేసినది రేపు దేవాలయగోపురానికి చేరవచ్చు....." అన్నారు మళ్ళీ కూర్మయ్యగారు.

స్పీకర్‌గారు కొంచెం ఇబ్బందిగా కదిలారు- "గౌనవనీయులైన మంత్రిగారు తన ఉత్సాహంలో మైకు ఎదురుగా వుందన్న సంగతి మర్చిపోయారు. మైకులోంచే అయన్ని మాట్లాడవలసిందిగా కోర్తున్నాను" అన్నారు.

"నేడు నాకెంతో గర్వంగా వుంది అధ్యక్షా! గాంధీగారి కృషిఫలితంగా ఏర్పడిన అఖిలభారత కాంగ్రెస్ పార్టీ జాతీయ విధానం ప్రకారం కాంగ్రెస్ ప్రభుత్వపక్షాన, అస్పృశ్యుడైన ఒక హరిజనుడు .....కనీసం శాసన సభ్యుడిగా కూడా కావడానికి అర్హతలేని వ్యక్తి - మంత్రిగా, శాస్త్రకర్తగా హరిజనుల ఈ పౌరహక్కుల బిల్లుని సభలో ప్రవేశపెడ్తున్నాడు-" అన్నారు మళ్ళీ అందుకని కూర్మయ్యగారు.

మళ్ళీ కరతాళధ్వనులతో కాంగ్రెస్ వారు మంత్రి కూర్మయ్యగారికి ప్రోత్సహించారు.

బల్లలు దడదడ మోగాయి.

కుమారరాజా సర్ ముత్తయ్య చెట్టినాయుడు గారు (జస్టిస్ పార్టీ) లేచి "శాస్త్రకర్తల అధ్యక్షుడి మాటేమిటి?" అని కొంటెగా అడిగారు... ముఖ్యమంత్రిగారు సభలో లేడని ఎద్దేవా చేస్తూ!

కూర్మయ్యగారు అంతేఘాటుగా ఆ ప్రశ్నకు సమాధానం చెప్పారు.

శాస్త్రకర్తల అధ్యక్షుడంటే ఈ అసెంబ్లీ స్పీకరైన తమరే అధ్యక్షా! శ్రీ శివషణ్ముగం పిళ్ళేగారు కూడా మా హరిజనులేనని గౌరవసభ్యుని దృష్టికి తీసుకువస్తున్నాను అధ్యక్షా!

నేను సగర్వంగా ఒక విషయం చెప్పగలను అధ్యక్షా!

మనుధర్మ శాస్త్రం వ్రాసిన మనువునిస్సందేహంగా బ్రాహ్మణుడుకాదు. ఆయన బ్రాహ్మణేతరుడే! ఆయన సమాజంలో క్రమశిక్షణని పాదుకొల్పటం కోసం అనేక శాస్త్రాలు రాశాడు.

ఈ రోజున ఈ సభలో 215మంది మనువులున్నారు. గౌరవనీయులైన స్పీకర్, గారు 215 మంది మనువులకు మనువు.... మన చర్చలను ఒక దారిలో పెట్టేదుకు ఆయన ఆ స్థానాన్ని అధిష్టించి వున్నారు.

అధ్యక్షా! ఈ సభలో మతపరమైన ప్రబోధాలు చేయటం నా ఉద్దేశ్యం కాదు. అయితే ఆవిధమైన ప్రబోధం అంటే నాకెంతో ఇష్టం. హిందూఇజాన్ని అసమానతల

రొంపి నుంచి రక్షించటానికి హిందూ మతం గురించి మాట్లడటం నాకు మొదటినించి అలవాటు: అది నా ఆదర్శం కూడా!

కానీ, ఇక్కడనేను అసెంబ్లీ సభ్యుడిగా లెజిస్లేటర్‌గా, మంత్రిగా వ్యవహరిస్తున్నాను. కాబట్టి ఇంతకన్నా ఎక్కువగా మతపరమైన అంశాలను చర్చించకూడదనుకొన్నాను.

అధ్యక్షా! Madras Removal of Civil Disablities చట్టం 1938లో చేయబడింది.

అప్పట్లో ఈ బిల్లుని కీ.శే. రావుబహదూర్ ఎం.సి. రాజాగారు ప్రవేశపెట్టారు. డా॥ చక్రవర్తుల రాజాగోపాలచారిగారు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఈ బిల్లుని ఆనాటి కాంగ్రెస్ ప్రభుత్వం ప్రవేశపెట్టి సభామోదం పొందింధి.

అధ్యక్షా! గత ముఖ్యమంత్రి గౌరవనీయులైన ప్రకాశంగారు హరిజనుల దేవాలయప్రవేశ సమస్యను చేపట్టినప్పుడు ఆయనను సంఘ బహిష్కరణ చేయటానికి కొందరు పూనుకొన్నారు. అయితే. ప్రకాశం గారు తన వాదనా పటిమతో ఆ ప్రయత్నాన్ని ఎదుర్కొగలిగారు.

మనం అంతా గర్వించవలసిన విషయం ఏమంటే. ఆరోజుల్లో నాయకుల్లో ఒకరిద్దరే సంస్కరణ భావాలున్నవారుండేవారు. కానీ, ఈ రోజున అస్పృశ్యతానివారణ కోసం కంకణం కట్టుకున్న నాయకులు మనలో చాలామంది వున్నారు.

"అధ్యక్షా! తమద్వారా సభదృష్టికి మరో ముఖ్యమైన అంశం తీసుకువస్తున్నాను.

కీ.శే. ఎం.సి. రాజా ఈ బిల్లుని ఢిల్లీ పార్లమెంట్ (సెంట్రల్ పార్లమెంట్) లో ప్రవేశపెట్టాలని మొదట ప్రయత్నించారు. కానీ, ఆయన్ని బ్రిటిష్ ప్రభుత్వం నిరోధించింది. అందుకని ఆనాటి కాంగ్రెస్ ప్రభుత్వాన్ని అంగీకరింపచేసి. 1938లో ఇదే అసెంబ్లీలో ప్రవేశపెట్టి ఆమోదింపచేయగలిగారు.

ప్రజాసంబంధమైన ఏ సంస్థలో అయినా హిందువులకు ప్రవేశించే హక్కు ఎలా వుందో అలాగే హరిజనులకూ వుంటుందని ఈ చట్టంలో రెండవ సెక్షన్ సూచిస్తోంది.

ఈ సూచనలో హరిజనుణ్ణి ఎవరూ ప్రవేశించకుండా నిరోధించకూడదని మాత్రమే వుంది. నిరోధిస్తే శిక్ష ఏమిటో స్పష్టంగాలేదు. ఉదాహరణకు కాఫీహోటల్. బార్బర్ షాపులవంటి బహిరంగ స్థలాల్లోగానీ. ఊరుమ్మడి బావులు. తటాకాలు. చెరువులు కాలవల్లో గానీ ప్రవేశించకుండా హరిజనుల్ని ఎవరూ నిరోధించకూడదని ఈ చట్టం స్పష్టంగా నిర్దేశిస్తోంది.

ఈ చట్టాన్ని రూపొందించే సెలెక్ట్ కమిటీలో హరిజనుడిగా నేనూ సభ్యుడిగా వున్నాను. ఈనేరం చేసిన వారికి తప్పకుండా శిక్ష వుండాలి... అని అప్పుడు నేను వాదించాను కూడా! కానీ. అప్పట్లో శిక్షలు వేసే విషయం సెలెక్ట్ కమిటీలో ఆమోదం పొందలేదు.

ఇప్పుడు నాకెంతో ఆనందంగా వుంది.

హరిజనుల్ని బహిరంగ ప్రదేశాలలో సంచరించకుండా ఎవరు ఏవిధంగా నిరోధించినా అది నేరం అవుతుందనీ, ఆ నేరానికి శిక్షవుంటుందనీ ఈ బిల్లులో స్పష్టంగా నిర్దేశించడం జరిగింది.

ఈ బిల్లు లెజిస్లేటివ్ కౌన్సిల్ ఆమోదం పొందిన విషయం కూడా సభదృష్టికి తీసుకువస్తున్నాను.

1938లో రూపొందిన పాత చట్టంలో బహిరంగ సంస్థలు (SECULAR INSTITUTES) అనే మాటని సరిగా నిర్వచించలేదు. అప్పట్లో హరిజన సభ్యులం అందరం అసెంబ్లీలో ఈ విషయమై ప్రశ్నించాం కూడా!

సెక్యులర్ సంస్థల నిర్వచనం విషయంపై అనేక కోర్టుల్లో కేసులుకూడా నడుస్తున్నాయి.

ఆరోజున సభలో అప్పటిమంత్రి వర్యులు వి.వి.గిరి గారు, అలాగే బి.యస్.మూర్తిగారూ సెక్యులర్ సంస్థల్లో కాఫీ హోటళ్ళు, భోజన హోటళ్ళు కూడా చేర్చాలని ప్రయత్నించారు. కానీ, అదేమీ అమలుజరగకపోవడంతో 1938లో చేసిన ఈ చట్టం నిరుపయోగంగా మారింది!

అత్యంత ఆశ్చర్యకరమైన అంశం ఏమంటే, హరిజనుల ప్రవేశాన్ని నిరోధించినందుకు కేసుపెట్టినప్పుడు కోర్టులుకూడా షాపులవాళ్ళమీద హరిజనులకు సరుకులు అమ్మే విషయమై వత్తిడిచేయడానికి ఎవరికీ హక్కులు లేవని తీర్పునిచ్చిన సందర్భాలూ వున్నాయి.

గురువులు అనే ఒక గౌరవ సభ్యుని విషయంలో ఇదే జరిగింది! హోటల్‌లోంచి క్యారేజీలో భోజనం తెప్పించుకోవటానికి హోటల్‌కు మనిషిని పంపించారాయన కానీ, హోటల్ యజమాని ఈ క్యారియర్ ఒక హరిజనుడిది కాబట్టి అందులో భోజనం పెట్టి పంపడానికి నిరాకరించాడు. లెజిస్లేటర్ స్థాయిలో వున్న వ్యక్తికే ఈ దురవస్థ వుంటే. మామూలు హరిజనుడి పరిస్థితి ఏమిటో ఆలోచించవలసిందిగా ప్రతి ఒక్కరినీ కోర్తున్నాను.

నా స్నేహితుడు మలబారుకుచెందిన కణ్ణన్ అనే ఒకాయన బ్రాహ్మణ హోటల్‌లోకి రానివ్వలేదని ఆయన నాకో సుదీర్ఘమైన ఉత్తరం రాశాడు.

నేనుకూడా చాలా సందర్భాలలో బ్రాహ్మణేతరుల హోటళ్ళలోనే భోజనం చేయవలసివస్తోంది.

ఒకసారి నలుగురు క్రైస్తవ మిత్రులతో కలిసి హోటల్‌కు వెళ్ళాను. హోటల్ యజమాని జగన్నాథం నన్ను అడ్డుకొన్నాడు. కూర్మయ్యగారూ మీరు కావాలంటే రండి! కానీ, ఆ నలుగురినీ తీసుకునిరాకండి! మాకు చాలా ఇబ్బందిగా వుంటుంది-" అన్నాడు.

నేను వెంటనే ప్రభుత్వానికి ఈ విషయమై ఒక ఉత్తరం రాసి తక్షణం ఆ హోటల్ యజమానిపై చర్యతీసుకోమని కోరాను.

దానికి సమాధానం వింటే చాలా ఆశ్చర్యంగా వుంది..."హరిజనులకు లీగల్‌గా బ్రాహ్మణ హోటళ్ళకు వెళ్ళేహక్కు లేదు. బ్రాహ్మణ హోటళ్ళను నడుపుకునేందుకు యజమానులకు లైసెన్సులిచ్చింది ప్రభుత్వం. వారి వ్యాపారాల్లో తలదూర్చి, అవరోధం కల్పించడం ప్రభుత్వం విధికాదు-" అని!

దీన్ని ఖండిస్తూ నేను పత్రికాప్రకటన విడుదల చేశాను. జూలై 19 39లో ప్రభుత్వ కార్యదర్శికి ఒక లేఖరాశాను... హరిజనులకు చట్టబద్ధమైన రక్షణవుందని ఆ లేఖలో ప్రభుత్వ కార్యదర్శికి గుర్తు చేశాను.

ఇలా పత్రిక ప్రకటనలతో కాలక్షేపం అయ్యిందిగానీ, సమస్య పరిష్కారం కాలేదు.

నేను మంత్రిని కాగానే, పత్రికా విలేకరులు నన్ను కలిసి ఈ విషయమై తక్షణం ఏ నిర్ణయం తీసుకోబోతున్నానో చెప్పమని కోరారు.

"ఏనాడైతే, హరిజనుల్ని నిరోధించే వారికి చట్టప్రకారం శిక్ష వేయించగలుగుతానో ఆరోజే విశ్రమిస్తాను-" అని నేనువారికి చెప్పాను. అన్నారు కూర్మయ్యగారు ఆవేశంగా!

ఈ రోజు కూర్మయ్యగారి ఆవేశాన్నిచూసి ప్రతిఒక్కరూ ఆశ్చర్యపోయారు.

సర్! సభ్యుల సహృదయం సహకారాల వలన అలాగే, మద్రాసు రాష్ట్రప్రభుత్వ సహకారం వలన ఈ బిల్లుని లెజిస్లేటివ్ కౌన్సిల్ లో ప్రవేశపెట్టి ఆమోదం పొంద గలిగాము.

బిల్లులోని అంశాలన్నీ స్పష్టంగావున్నాయి. వాటి పూర్వాపరాల గురించి స్పష్టంగానే వివరించానని భావిస్తున్నాను. 'సెక్యులర్ సంస్థలు' అనే పదంలో అస్పష్టతని తొలగించటానికి ప్రయత్నించాము. ఈ బిల్లులలో మొత్తం ఏడు క్లాజులున్నాయి. వాటిని పరిశీలించి ఆమోదించి సహకరించవలసిందిగా కోరుతున్నాను-" అన్నారు మంత్రి కూర్మయ్యగారు.

ప్రతిపక్షనాయకుడు మహమ్మద్ అన్వర్ సాహెబ్ బహదూర్ గారు లేచి తన చిన్న ఆక్షేపణని తెలిపారు. మిష్టర్ స్పీకర్! ఇది నిజానికి చాలా సీరియస్ బిల్లుగా సభలో ప్రవేశపెట్టారు గౌరవనీయులైన మంత్రిగారు. కానీ. అధికార పార్టీ సభ్యుల కుర్చీలన్నీ ఖాళీగా వున్నాయి...." అని ట్రెజరీ బెంచ్‌వైపు చేయిచూపిస్తూ తన ఆక్షేపణ తెలిపారు. వెనక్కి తిరిగి చూస్తే అధికార పార్టీ సభ్యులు చాలా పల్చగా వున్నారు. దాదాపుగా బల్లలన్నీ ఖాళీగా వున్నాయి.

అన్వర్ సాహెబ్ గారు మరింత ఆక్షేపణగా "హిందూసమాజాన్ని విప్లవాత్మకంగా సంస్కరించదలచుకొన్నట్లు మంత్రిగారు చెప్తున్నారు. కానీ. సభకు ఇచ్చే మర్యాద. గౌరవం ఇదేనా...? అన్నారు.

డా॥ టి.యస్.యస్.రాజన్ లేచి ముఖ్యమంత్రి ఓమాండూర్‌గారు వేరే అధికార కార్యక్రమంలో బిజీగా వుండి ఇక్కడ ఎక్కువసేపు గడపలేకపోయారు" అంటూ సంజాయిషీ ఇచ్చారు.

"మిగిలిన మంత్రుల సంగతేమిటండీ!" ఎద్దేవాగా అన్నారు. ప్రతిపక్ష నాయకుడు. ముహమ్మద్ అన్వర్ సాహెబ్ బహదూర్.

అయ్యదేవర కాళేశ్వరరావుగారు కూడ అదే ధోరణిలో "ముస్లింలీగ్ సభ్యులు కూడా కొద్దిమందే వున్నారు సర్ - ఈ సభలో" అని గుర్తు చేశారు -

దానికి అన్వార్ సాహెబ్ గారు జంకకుండా, ముస్లింలీగ్ లీడర్‌ని సభలోనే వున్నాను సర్-" అని జవాబిచ్చారు కాంగ్రెస్ శాసన సభాపక్షనాయకులు ముఖ్యమంత్రి సభలో లేడని ఆక్షేపిస్తూ!

సరిగ్గా అప్పుడు సమయం మధ్యాహ్నం 12.45 అయ్యింది. అరగంటసేపు ఏకధాటిగా ప్రసంగించి హరిజన సమస్యని దేశానికి చాటి చెప్పడం కోసం శ్రమ తీసుకున్నారు కూర్మయ్యగారు.

"అధ్యక్షా! నిస్సందేహంగా ఇది సీరియస్‌బిల్‌గానే భావిస్తున్నాను. 26 కోట్లమంది భారతీయుల్లో 7 కోట్లమంది హరిజనులకు సంబంధించిన విషయం ఇది. ఈ బిల్లు చట్టంగా మారాలని హరిజనుడు ప్రతి ఒక్కడూ కోరుకొంటున్నాడు-" అంటూ తన ప్రసంగాన్ని కొనసాగించారు కూర్మయ్యగారు.

"హిందువైన ప్రతి ఒక్కడూ హిందూయిజం సంరక్షణ కోసం ఈ బిల్లుని చట్టంకావాలని కోరుకొంటున్నాడు.

హిందూ సమాజాన్ని హరిజనులే సంరక్షిస్తారని నేను గట్టిగా విశ్వసిస్తున్నాను.

300 సంవత్సరాల క్రితం క్రైస్తవ మిషనరీలు ఈ దేశంలో తమ కార్యక్రమాలు ప్రారంభించాయి. హిందువుల్ని క్రైస్తవులుగా మార్పు చేయటం వారి ప్రధాన కార్యక్రమం. కానీ, డబ్బు ఆశచూపినా, స్కాలర్‌షిప్‌లు ఆశచూపినా, ఉచిత నివాస సౌకర్యాలు ఆశ చూపినా ఉద్యోగాలు ఆశ చూపించినా హరిజనుల్లో మెజారిటీ ప్రజలు క్రిస్టియానిటీలోకి వెళ్ళలేదు. ఈ ఒక్క చారిత్రాత్మక సత్యం చాలు హిందూయిజాన్ని సంరక్షిస్తోంది హరిజనులేనని నిరూపించటానికి!

హిందూ ధర్మం అనేది నిజంగా ఎక్కడైనా పాటించబడ్తోందంటే అది హరిజనుల పూరిగుడిసెల్లోనే పాటించబడ్తోందని నేను గట్టిగా చెప్పగలను.

హరిజనులు నిజాయితీపరులు. వారికి, లౌక్యం మోసాలు తెలియవు. వారికి భక్తి ఎక్కువ. అందుకే దేవుడిపైన విశ్వాసంతోనే హిందూయిజాన్ని నమ్మారు. అన్నారు.

ఈ యుగపు ఆధునిక నాగరికత ఏదీ హరిజనుడి పూరి గుడిసెలను చేరలేదు బహుశా అందుకే హరిజనులు ఇంకా నిజమైన హిందువులుగా మిగిలి వున్నారు.

అధ్యక్షా!

అధికార పార్టీ సభ్యులు ఎక్కువమంది ఈ సభలో హాజరు కాకపోయినప్పటికీ, వారందరి తరపున నేనొక్కడినే సమాధానం చెప్పగలను.

హరిజనుడిగా, రాష్ట్ర ప్రభుత్వంలో హరిజన సభ్యుడిగా, ఈ బిల్లు రూపకర్తగా సగర్వంగా దీన్ని చట్టం చేయించగలనన్నే భావిస్తున్నాను.

సర్! నిన్నటిదాకా హరిజనులు సంస్కరణ వాదులైన కొందరు అగ్రవర్ణాల వారిపైనా, కాంగ్రెస్ వారి పైనా, సానుభూతిపరులైన ఇతర రాజకీయ పార్టీలపైనా ఆధారపడివున్నారు. కానీ, నేటినుంచి హరిజనులు అధికారంలో భాగస్వామ్యం కోసం పోరాటం జరిపే స్థితికి చేరుకొన్నారు.

కానీ, నిరక్షరాస్యత, అనైక్యత, అవగాహనా రాహిత్యం. ఇవన్నీ హరిజనుల్ని వెనక్కి లాగుతున్న అంశాలు.

కనీసం ఈ అసెంబ్లీలో హరిజన సభ్యులంతా ఈ బిల్లు విషయంలో ఐక్యంగా వుండటం నాకెంతో సంతోషం.

మన ప్రియతమ ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ గారు 'హరిజన సోదరులతో సమావేశం ఏర్పాటు చేశారు. కొంతమంది విద్యావంతులైన హరిజనులు ముందుకొస్తే చాలు... హరిజనులంతా అభివృద్ధిలోకి వస్తారు. హరిజనుల పౌరహక్కుల రక్షణ కోసం ప్రతిగ్రామంలోను కనీసం ఒక్క హరిజనుడు గట్టిగా నిలబడగలగాలి.'

పల్లెల్లో కూడా ఇప్పుడు చాలా మార్పు వచ్చింది! మీ ప్రభుత్వం మాకోసం ఏం చేస్తోందని ఈ రోజు హరిజనులు రాజకీయనాయకుల్ని నిలదీసి అడుగుతున్నారు.

ఏజెన్సీ ప్రాంతాల్లోనూ, మారుమూల ప్రాంతాల్లోనూ హరిజనులే కాకుండా వెనకబడి నిరాదరణకు గురయిన అనేక కులాలు ఇంకా వున్నాయి. వారిగురించి పరిశీలించి వాస్తవాలు వెలుగులోకి తెచ్చేందుకు ఒక కమిటీని ప్రభుత్వం ఏర్పాటు చేయటం కూడా ఎంతో సంతోషించవలసిన విషయం.

ఈ బిల్లు ఏ కులానికి చెందిన వ్యక్తి పౌరహక్కుల్ని నిరోధించినా శిక్షపడేందుకు వీలుగా రూపొందించామని మరొక్కసారి సభ దృష్టికి తీసుకువస్తున్నారు. సినిమాహాళ్ళు. వినోద సమావేశాలు, హోటళ్ళు, హాస్టళ్ళు బార్బర్ సెలూన్లు... మొదలైన బహిరంగ స్థలాలలోకి కులం పేరుతో రానీకుండా నిరోధించే వారిపై చర్యతీసుకోవటానికి ప్రభుత్వానికి అధికారం కల్గుతుంది. ఆరు మాసాలు జైలు శిక్ష, 50 రూపాయల వరకూ ఫైన్ వేసే అవకాశం వుంది! అని వివరించారు బిల్లులోని అంశాలను కూర్మయ్యగారు.

"హరిజనులకు చట్టబద్ధమైన పౌరహక్కుల్ని ఇస్తున్న ఈ బిల్లుని సమర్థించి శతాబ్దాలుగా హిందువుల వ్యవస్థలో అట్టడుగున మిగిలిపోయిన జాతుల్ని వెలుగులోకి తీసుకువచ్చేందుకు సహాయపడవలసిందిగా గౌరవ సభ్యులందరినీ కోర్తున్నాను" అన్నారు కూర్మయ్యగారు.

"ఈ పరిచయ వాక్యాలతో ఈ 'బిల్లు'ని సభ ఆమోదం కోసం ప్రవేశపెడ్తున్నాను" అని ముగించారు. "మద్రాస్ రిమూవల్ ఆఫ్ సివిల్ డిజబిలిటీస్ (ఎమెండ్ మెంట్) బిల్ 1947 - లెజిస్లేటివ్ కౌన్సిల్ ఆమోదం పొందింది- దాన్ని ఈ లెజిస్లేటివ్ అసెంబ్లీ కూడా తక్షణం పరిశీలించవలసిందిగా కోరడమైనది" అనీ స్పీకర్ అధికారికంగా ప్రకటించారు.

స్పీకరు అనుమతితో గౌరవసభ్యుడు ఎస్.నాగప్పగారు లేచి నుంచుని బిల్లుపైన తన అభిప్రాయాలు వివరించారు" - అధ్యక్షా! మొదటగా గౌరవ మంత్రిగారు చాలా స్వల్పవ్యవధిలో ఈ బిల్లుని రూపొందించి ఎంతో వివరణాత్మకంగా సభలో ప్రవేశ పెట్టినారు! వారికి నా ధన్యవాదాలు తెల్పుతున్నాను. గత కాంగ్రెస్ ప్రభుత్వం రూపొందించిన చట్టంలో సెక్యులర్ సంస్థలకు సరైన నిర్వచనం ఇవ్వకపోవటంవలన ఆ చట్టం నిరుపయోగం కావటం - గౌరవనీయమైన మంత్రి కూర్మయ్యగారు దాన్ని సవరించి పదునెక్కించటం కూడా సంతోషించవలసిన విషయం.

అయితే, అస్పృశ్యతని పాటించే వానికి విధించేఈ శిక్ష సరిపోదు. అలా పాటించిన నేరస్థుడి పౌరహక్కుల్ని రద్దు చేసేంత తీవ్రంగా ఆ శిక్షవుండాలని నేను సవరణ ప్రతిపాదిస్తున్నాను. ఎందుకంటే సనాతన వాదులు విజృంభించి ఆర్నెల్లజైలే కాబట్టి, హిందూమతాన్ని రక్షించుకోవడం కోసం, హరిజనుల్ని అణగదొక్కేందుకోసం "జైలుకుపోదాం"- అనే ఉద్యమాన్ని ప్రారంభించే ప్రమాదంవుంది-

అస్పృశ్యతని పాటించే వారి పేర్లు ఓటర్ల లిస్టులోంచి తొలగించాలి. ఎన్నికల్లో పోటీ చేయకుండా నిరోధించాలి. మంచినీటి సరఫరా, రేషన్ కార్డులు వంటి సౌకర్యాలు నిలిపివేయాలి. ఏ కోర్టులూ వాళ్ళ పిటీషన్లు స్వీకరించకుండా చూడాలి... ఇంత తీవ్రమైన శిక్షపడితేగానీ ఈ చట్టం వలన ప్రయోజనం వుండదు.

ఈ బిల్లు చట్టంగా మారిన తర్వాత హోటళ్ళు సివిల్ - మిలిటరీ హోటళ్ళుగా మాత్రమే వుండాలి... ఏ హోటల్‌మీద బ్రాహ్మణ హోటల్ అని వుండకూడదు.

బ్రాహ్మణ హోటళ్ళు, మహమ్మదీయుల హోటళ్ళు క్రిస్టియన్ హోటళ్ళు, వీరశైవ హోటళ్ళు, కమ్మ హోటళ్ళు, కాపు హోటళ్ళు... ఇలాంటివి ఏవీ వుండకూడదు. ప్రజాసంస్థల పేర్లలోనూ, వ్యాపార సంస్థల పేర్లలోనూ కుల మతాలకు సంబంధించిన పేర్లు లేకుండా చూడవలసిన బాధ్యత గౌరవనీయులైన మంత్రిగారిపైన ఉంది.

ఇంకా ఫైన్ విషయానికి వస్తే 50 రూపాయల శిక్ష సరిపోదు ఏభైవేల రూపాయల శిక్ష వెయ్యాలని నేను సవరణ ప్రతిపాదిస్తున్నాను. అస్పృశ్యతని పాటించేవారు కొన్ని

శతాబ్దాలుగా మనల్ని అణగదొక్కారు. కాబట్టి వారికి ఎంత శిక్ష వేసినాతప్పులేదు అన్నారు ఆగ్రహంగా. హరిజన శాసన సభ్యుడైన నాగప్పగారు.

"ఈ బిల్లుని రూపొందించిన రూపకర్త గౌరవ మంత్రి కూర్మయ్యగారిని నేను అభినందిస్తున్నాను. లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో ఆమోదం పొందిన ఈ బిల్లులో ఇప్పటికిప్పుడు నేను ప్రతిపాదించిన సవరణలు చేయటం సాధ్యంకాదని మీరు చెప్పవచ్చు. కానీ, అస్పృశ్యతపాటించేవారికి శిక్షలు ఇంకా ఎక్కువగా వుండాలని మాత్రం నేను గట్టిగా చెప్పగలను. ఏది ఏమైనా మంత్రి కూర్మయ్యగారిని అభినందిస్తూ ఈ బిల్లుకు నా మద్దత్తు తెలుపుతున్నాను" అని ముగించారు.

మరో గౌరవ ఎం.ఎల్.ఎ. బేగమ్ సుల్తాన్ మీర్ అమీరుదీన్‌గారు కూడా తమ అభిప్రాయాన్ని తెలిపేందుకు స్పీకర్ అనుమతించారు అప్పటికి సమయం మధ్యాహ్నం ఒంటిగంట అయ్యింది. సభలో మిగిలివున్న యమ్మెల్యేలంతా ఎంతో గౌరవంతో తక్షణం ఈ బిల్లు చట్టం కావాలనే ధ్యేయంతో సభలో కూర్చున్నారు. పార్టీలతోనూ, కులమతాలతోనూ వ్యక్తిగతంగా నిమిత్తం లేకుండా ప్రతి ఒక్కరూ బిల్లుని ఆమోదించాలనే ధ్యేయంతోనే వున్నారు.

అధ్యక్షా! భారతదేశంలో ఒక వర్గం ప్రజలు అనేక శతాబ్దాలుగా అణగద్రొక్కబడ్డ వారిని అభివృద్ధిలోకి తీసుకురావడానికి తోడ్పడే ఈ బిల్లుకు నా సంపూర్ణమైన మద్దత్తు తెలుపుతున్నాను.

మనిషీ మనిషీ మధ్య సమానత్వం వుండాలనే ఇస్లాం మతం కూడా చెప్తోంది!

డా॥ తారాచంద్ అనే హిందూ రచయిత వ్రాసిన "ఇన్‌ఫ్లుయన్స్ ఆఫ్ ఇస్లామ్ ఆన్ ఇండియన్ కల్చర్" అనే గ్రంథంలో ఇస్లాంలోని పురోగామి భావాలు భారతీయ సంస్కృతిని ఎంతగానో ప్రభావితం చేశాయని వ్రాశారు.

అధ్యక్షా! హిందూ సమాజంలో సాటి మనిషిపట్ల అమానుషంగా ప్రవర్తించే ఆచారాన్ని కేవలం చట్టాలద్వారా నిరోధించగలగడం పూర్తిగా సాధ్యంకాదనుకొంటాను. మనిషిమారాలి. అతని మనసు మారాలి. అస్పృశ్యులపట్ల విప్లవాత్మకమైన మార్పులు సవర్ణహిందువుల్లో రావాలని నేను కోరుకొంటున్నాను.

"భారత దేశంలో ముస్లిం లందరూ ఈ బిల్లుపట్ల సంతోషం వ్యక్తంచేస్తున్నారని నేను భావిస్తున్నాను- సాటి మనిషిని సమానంగా చూడటం అనే ఇస్లాం సిద్ధాంతాన్ని కాంగ్రెస్ మిత్రులు పాటిస్తున్నాందుకు నాకెంతో సంతోషంగా వుంది" అన్నారామె! సభ్యులంతా హియర్ హియర్ అంటూ చప్పట్లు చరిచారు.

బిల్లుమీద ఇంకా అనేకమంది సభ్యులు తమ అభిప్రాయాలు చెబ్తూనే సమర్థిస్తూ ప్రసంగించారు. సాయంత్రం దాకా సభ కొనసాగింది. అందరికన్నా ఆఖరున మళ్ళీమంత్రిగారికి అవకాశం ఇస్తూ-

"ఈ బిల్లుమీద ప్రసంగించిన సభ్యులుకూడా దాన్ని సమర్థిస్తున్నట్లు మాట్లాడారు. కాబట్టి, గౌరవ మంత్రిగారు కేవలం 10 నిమిషాల్లో తన సమాధానాన్ని ముగించవచ్చు. ఎందుకంటే తాను సమాధానం చెప్పవలసిన అంశాలేమీ లేవు కాబట్టి" అన్నారు స్పీకర్.

సమయం సరిగ్గాసాయంత్రం నాలుగు గంటల నలభై అయిదు నిమిషా లయ్యింది. కూర్మయ్యగారు లేచినుంచుని" నేను పావుగంటలోపే నా ప్రసంగాన్ని ముగిస్తాను సర్!" అన్నారు.

అధ్యక్షా!! ఈ బిల్లుని సభలోని ప్రతి సభ్యులూ అన్ని గ్రూపులవారూ ఆమోదించినందుకు నాకు ఎంతో సంతోషంగా వుంది! ఈ సభ విలువైన కాలాన్ని వృధా చేయవలసిన అవసరంలేదు... ఎందుకంటే గౌరవసభ్యులు ఎంతో విలువైన సలహాలు, సూచనలు అందించారు.

అధ్యక్షా! ప్రభుత్వంలో భాగంగా వున్ననేను మతపరమైన అంశాలజోలికి ఇంతకన్నా ఎక్కువగా వెళ్ళకూడదు. ముస్లింలీగ్ పార్టీకి చెందిన ముస్లిం మిత్రులు భారతదేశంలో హరిజనాభివృద్ధికి ఇస్లాం మతం ఎంతగానో తోడ్పడినట్లు ప్రసంగించారు. దీనితోనేనూ ఏకీభవిస్తున్నాను. అయితే ఇదే సమయంలో ముస్లింలీగ్ మిత్రులు గుర్తించవలసిన విషయం ఏమంటే ఇప్పుడు జరుగుతున్న హిందూ ముస్లిం మతకల్లోలాల్లో దేశవ్యాప్తంగా చూస్తే అమాయకహరిజనులపైన ముస్లిందాడులు చాలా సందర్భాల్లో జరిగాయి. ముఖ్యంగా అస్సాం వంటి ప్రాంతాల్లో ఇలాంటి సంఘటనలు జరగకుండా వుంటే, ముస్లింలు హరిజనాభివృద్ధికి పాటుపడ్డారనే విషయాన్ని పూర్తిగా అంగీకరించేవాణ్ణి!

అధ్యక్షా! నా హిందూ మిత్రులుకూడా హిందూయిజం హరిజనులకోసం సేవచేసిన విషయం గురించి ప్రస్తావించారు నిజానికి హిందూమతం చాలా గొప్పమతం. ధర్మాన్ని పాటించిన హిందూ రాజులు అనేకమంది వున్నారుకానీ, ప్రస్తుతం వ్రేళ్ళూనికుని వున్న కులవ్యవస్థలో, హరిజనులు నిమ్నవర్ణాలుగా మిగిలిపోయారు.

సవర్ణ హిందువులు, నిమ్నవర్ణ హరిజనులూ నిజంగా కలిసి పోరాడివుంటే, 200 సంవత్సరాలపాటు ఈ దేశాన్ని బ్రిటిష్‌వారు పాలించగలిగే వారా....? అని నేను ప్రశ్నిస్తున్నాను.

అది ఇస్లాం ప్రభావం కానీండి, హిందూ ప్రభావం కానీండి-. ఆ వివాదాల జోలికి నేను పోవటం లేదు- కానీ, హరిజనాభ్యున్నతి అనేది మాత్రం నిస్సందేహంగా జాతీయ సమస్య! భారతజాతీయుడైన ప్రతి ఒక్కరి బాధ్యతగా నేను భావిస్తున్నాను.

సభ్య సమాజంలో అధికారంలో వున్న ప్రభుత్వం కనీస బాధ్యత అట్టడుగున వున్న ప్రజలను పైకి తీసుకురావటం! వారు అట్టడుగు స్థాయికి చేరిపోవటానికి కారణాలగురించి, ఫిలాసఫీల గురించి, నాకనవసరం.

మహాత్మా గాంధీ నేతృత్వంలో నడుస్తున్న కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలోని ఈ ప్రభుత్వంలో ఒక భాగస్వామిగా ఒక విషయం స్పష్టం చేస్తున్నాను.

అధ్యక్షా! గాంధీజీ 1921లో అస్పృశ్యతా నివారణా కార్యక్రమం ప్రారంభించారు. బెజవాడలో జరిగిన కాంగ్రెస్ సభలో తీసుకున్న ముఖ్యమైన నిర్ణయాలు రెండు. ఒకటి అస్పృశ్యతా నివారణ. రెండు హిందూముస్లింఐక్యత!

1921 నుంచి కాంగ్రెస్ సంస్థ మహాత్ముని నాయకత్వంలో ఈ రెండు అంశాలను మాత్రమే ప్రధానంగా ప్రచారం చేసింది.

కాంగ్రెస్ ఈ సమస్యని ఆనాడే బెజవాడలో చేపట్టిందికాబట్టే హరిజనుల సమస్య వెలుగులోకి వచ్చిందని నేను భావిస్తున్నాను.

ఇప్పుడునేను గర్వంగా చెప్పగలను - మా కాంగ్రెస్ పార్టీ, మా కాంగ్రెస్ ప్రభుత్వం ఈ బిల్లును ప్రవేశపెట్టగలిగాయని!!

బ్రాహ్మణ వ్యతిరేకతే ధ్యేయంగా అధికారంలోకి వచ్చి, ఈ రాష్ట్రాన్ని పరిపాలించిన జస్టిస్ పార్టీ వారు ఇటువంటి బిల్లుని ఎందుకు తీసుకురాలేకపోయారో ఆలోచించవలసిందిగా కోర్తున్నాను.

మహాత్మా గాంధీ కేవలం రాజకీయ నాయకుడేకాదు - ఆయన హరిజనోద్ధారకుడు. గొప్ప సంస్కర్త. సబర్మతి ఆశ్రమంలో, ఆయన ఆశ్రయంలో నేనున్నప్పుడు ఈ విషయమై ఎన్నోసార్లు వారితో చర్చించాను.

డా॥ అంబేద్కర్ గారు గాంధీజీ హరిజనుల్ని మోసం చేశారని, వారిని తన రాజకీయ పలుకుబడి పెంచుకోవటానికి ఉపయోగించుకొంటున్నారనీ చాలాసార్లు అన్నారు.

డా॥ అంబేద్కర్ వంటి విద్యావంతుడు, జ్ఞాని, సమర్థుడు అనవలసిన మాట కాదిది.

గాంధీగారే లేకపోతే, అస్పృశ్యత అనే అంశం జాతీయ సమస్యగా గుర్తింపులోకి వచ్చేదే కాదని నేను చెప్పగలను.

హరిజన సేవా సంఘం స్థాపించి లక్షలాది రూపాయిలు దానికోసం వెచ్చింపచేశారాయన.

ఈ బిల్లు మహాత్ముడు ప్రబోధించిన ఆదర్శాలకు లోబడి. హరిజనులకు సమాన పౌరహక్కులు కల్పించేందు మాత్రమే ఉద్దేశించింది గానీ: ఇందులో వేరే దురుద్దేశం ఏమీలేదని మనవిచేస్తున్నాను. ఒక హరిజనుడిగా అఖిలభారత జాతీయ కాంగ్రెస్ నేతృత్వంలో ఈ బిల్లుని రూపొందించాను. ఇలాంటి బిల్లులు మనరాష్ట్రంలోనే కాదు. కాంగ్రెస్ నాయకత్వంలో దేశంలోని అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు (ప్రావిన్షియల్) కూడా రూపొందించి ప్రవేశపెట్టబోతున్నాయి.

జాతీయ స్థాయిలో కూడా దేశ అత్యున్నత పార్లమెంట్‌లో అస్పృశ్యతా నివారణ బిల్లుని ప్రవేశపెట్టబోతున్నట్లు కాంగ్రెస్ పార్లమెంట్‌బోర్డు అధ్యక్షులు సర్దార్ పటేల్‌గారు ప్రకటించారు.

అధ్యక్షా! కమ్యూనిస్టు సభ్యులు పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు సామాజిక అసమానత్వం అనేది ఆర్థిక అసమానత్వం తొలగితేనే సాధ్యం అవుతుందని అన్నారు నా అభిప్రాయంలో సామాజిక అసమానత్వం ముందు తొలగితేనే. ఆర్థిక అసమానత్వం

తొలగించడానికి అవకాశం వుంటుందని భావిస్తున్నాను. గౌరవ సభ్యులు వెంకటేశ్వర్లు గారికి హామీ ఇస్తున్నాను హరిజనులు అధికంగా పుంజుకోవటానికి ఈ ప్రభుత్వం చేయవలసిదంతా చేస్తుందని!

అలాగే, గౌరవ హరిజన సభ్యులు ఈ బిల్లు అమలుకునోచుకోదేమోనని భయపడనవసరంలేదని కూడా హామీఇస్తూన్నాను. ఈ ప్రభుత్వం ప్రజల ప్రభుత్వం. ఇది కాంగ్రెస్ ప్రభుత్వం. ప్రజల ఆదరాభిమానాలు పొందిన ప్రభుత్వం. ఇక్కడ మనం చేసిన ప్రతిచట్టం ప్రజలందరి మనోభావాల్ని ప్రతిబింబిస్తుందని నేను విశ్వసిస్తున్నాను. ఈ చట్టంగురించీ, శిక్షలగురించి పల్లెపల్లెలోనూ టామ్‌టామ్ వేయిస్తామని మనవిచేస్తున్నాను-'' అని కూర్మయ్యగారు ప్రసంగిస్తుండగా గౌరవ సభ్యులు నాగప్పగారు మధ్యలో కల్పించుకొని ఏదో అడగబోయారు.

కానీ, స్పీకర్‌గారు నాగప్పగారిని అనుమతించలేదు. గౌరవమంత్రిగారు ఏ సభ్యుడికి సమాధానం ఇవ్వనవసరంలేదు. ఉపన్యాసం కొనసాగించవచ్చు-'' అని రూలింగ్ ఇచ్చారు.

''టామ్ టామ్ ఎవరు వేయిస్తారనే విషయాలు నాగప్పగారి వంటి గౌరవసభ్యులు అడగవలసినవి కాదు! ఇది స్థానిక సంస్థల బాధ్యత. ప్రభుత్వం వారివేత చేయిస్తుంది-'' అన్నారు కూర్మయ్యగారు నాగప్పగారి ప్రశ్నని దృష్టిలో పెట్టుకొని!

''మద్రాస్ రిమూవల్ ఆఫ డిజెబిలిటీస్ (ఎమెండ్‌మెంట్) బిల్ 1947 (L.C. Bill No 194) లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో పాసయిన విధంగా ఈ సభ పరిశీలించడమైనది 2,3,4,5,6,7 మరియు 1 క్లాజులు చర్చించడమైనది - ''అని ప్రకటించారు కూర్మయ్యగారు.

''అధ్యక్షా! ఈ బిల్లు చట్టంకావాలని ప్రతిపాదిస్తున్నాను-'' అన్నారు కూర్మయ్యగారు.

ఇంకా ఎవరైనా గౌరవసభ్యులు ఈ ప్రతిపాదనపైన ప్రసంగించాలనుకొంటే ప్రసంగించవచ్చు అన్నారు - స్పీకర్.. కొంతవ్యవధి తీసుకున్నారు. ఎవరూ మాట్లాడలేదు. ఏ సభ్యుడూ మాట్లాడాలని కోరుకోవడం లేదుకాబట్టి సభ ఓటుకోసం ఈ బిల్లుని అనుమతిస్తున్నాను అన్నారు.

వ్యతిరేకంగా ఎవరూ లేరుకాబట్టి, మద్రాస్ రిమూవల్ ఆఫ సివిల్ డిజెబిలిటీస్ (ఎమెండ్‌మెంట్) బిల్ 1947 చట్టంగా అనుమతించబడింది-'' అని ప్రకటించారు స్పీకర్! కూర్మయ్యగారి హరిజనబిల్లు చట్టం అయ్యింది!!

సమయం సాయంత్రం ఐదుగంటల ముప్పైయి నిమిషాలు..!!

హరిజన అసమానతలు తొలగించి అస్పృశ్యతను నిరోధించి చట్టం రూపొందిన మరుక్షణం అసెంబ్లీ దద్దరిల్లేలా కరతాళ ధ్వనులు చేశారు సభ్యులు!

ప్రతిజాతీయవాది కన్నకలఇది! అది బంగారు కల! అది మహాత్ముడుకన్నా కల! అది ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో నేటికి నిజం అయ్యింది! దాన్ని సాధించిన వాడు ఒక ఆంధ్రుడు!... వేములకూర్మయ్యగారు!

"మహాత్ముడు హరిజన ఉద్యమం వైపు నడిచేందుకు ఆంధ్రులే కారకులు! 1921 నాటికి ఎంధరో ఆంధ్రులైన సంస్కర్తలు ఎంతో హరిజన సేవ చేశారు. మాగురుదేవులు అయ్యదేవర కాళేశ్వరరావుగారు, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు, ఉన్న లక్ష్మీనారాయణగారు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ఒక్కరేమిటీ...ఎందరో మహానుభావులు! వారి ప్రభావం గాంధీగారిపైన ఆనాడు ఎంతో వుంది. బెజవాడ సభలు గాంధీగారి ఆలోచనల్ని హరిజన సేవవైపు నడిపాయి" అని వివరించారు కూర్మయ్యగారు.

చరిత్ర వృత్తాకారంలో పరిభ్రమిస్తుందని ప్రాచీక గ్రీకులు నమ్మేవారు. కాదు.. ఒకగీత గీసినట్లు ఋజుమార్గంలో తిన్నగా ముందుకే సాగుతుందని క్రిస్టియన్లు, ముస్లిములు నమ్ముతారు. స్పాయిరల్‌గా...అంటే, వృత్తాలు వృత్తాలుగా వుంటూనే ఋజుమార్గాన ముందుకు సాగుతుందని చైనీయులు నమ్ముతారట!!

కానీ, తరతరాల బానిసత్వపు చీకట్లను చీల్చి హరిజన ప్రజల్ని వెలుగులోకి తెచ్చి.... తారా జువ్వలా చరిత్ర పైకి ఎగుస్తుందని నిరూపించారు కూర్మయ్యగారు.

కూర్మయ్యగారి సహనశీలత, ఆయన వ్యక్తిత్వం, భారత దేశంలోనే మొదటగా హరిజన చట్టాలు రావటానికి ఆయన చేసినకృషి, ఆయన నెలకొల్పిన హరిజన హాస్టళ్ళ, హరిజన పాఠశాలలు ఆయన నడుపుతున్న వ్యవసాయకూలీ పత్రిక, ఆయనని హరిజనోద్యమ వైతాళికుడిగా, ఆపద్బాంధవుడిగా, దీనజనోద్ధారకుడిగా కూలీల గాంధీగా తీర్చిదిద్దాయి!!



# 5

1949 మార్చి 31

అప్పుడే రెండో కాంగ్రెస్ ముఖ్యమంత్రి మారిపోయాడు.

"ఈ నాలుగు సంవత్సరాల్లో సంయుక్త మద్రాసు రాష్ట్రంలో నా మంత్రివర్గంతో మొదలుపెట్టి రెండు మంత్రి వర్గాలు మారిపోయాయి. రాజకీయ అస్థిరత కొనసాగుతోంది. కాంగ్రెస్ అధిష్టానానికి ఇష్టులు కాని వారికి ఏ పదవిలోనూ కొనసాగే అవకాశం వుండదనే భావన రోజురోజుకీ పెరిగిపోతోంది. మంత్రులపైన ఆరోపణలు నిర్దిష్టంగానే వస్తున్నాయి. అయినా పటేల్‌గాని, నెహ్రూగాని పట్టించుకోవటం లేదు" అని ఘాటుగా విమర్శించారు ప్రకాశంగారు.

ఓమాండూరునే ముఖ్యమంత్రి పదవినించి అత్యంత అవమానకరంగా పంపించి పూసపాటి కుమారస్వామి రాజాని ముఖ్యమంత్రిని చేశారు. ఆయన పదవి స్వీకరిస్తూ తన గ్రూపుపట్ల భక్తి శ్రద్ధలను ప్రదర్శించుకున్నారు.

"శ్రీ రాజగోపాలాచారి గారికున్న తెలివితేటలు నాకులేవు. ప్రకాశంగారి విశాలహృదయం నాకులేదు-" అన్నాడాయన. కామరాజ్ నాడార్‌గారు ఆడుతున్న ఈ రాజకీయ చదరంగంలో ఇష్టం ఉన్నా లేకపోయినా రాజకీయవేత్తలంతా పావులుగా మారిపోయారు.

కూర్మయ్యగారు ఈ ముఖ్యమంత్రుల మార్పులపట్ల చాలా అసహనాన్ని ప్రదర్శించారు. "కళావెంకటరావుగారైనా కామరాజుగారి ధృతరాష్ట్ర కౌగిలిలోంచి బైటపడివుంటే, ప్రకాశంగారే మళ్ళీ ముఖ్యమంత్రి అయి వుండేవారు. గోపాలరెడ్డిగారు, కల్లూరి చంద్రమౌళిగారూ స్వయంగావెళ్ళి కామరాజ్ నాడార్‌గారిని ఎందుకు ఆశ్రయిస్తారో అర్థంకాదు" అన్నారు.

"బ్రాహ్మణులు - బ్రాహ్మణేతరులు, ఆంధ్రులు అరవలు, మనవాడు-పరాయివాడు... ఇలా రకరకాల ముఠాలుకట్టి మనం చేసేది శాసనసభలో పరిపాలనా....? లేకపోతే కీచులాడుకోవడమా?" అని ఆగ్రహంతో ప్రశ్నించారు.

కుమారస్వామిరాజా కూర్మయ్యగారిని మంత్రివర్గంలోకి తీసుకోలేదు-.

"మంత్రిపదవికోసమే శాసనసభలోకి నేను అడుగుపెట్టలేదు-" కటువుగా అన్నారు కూర్మయ్యగారు.

"రాష్ట్రానికి మంత్రి చేయటం అంటే విలువలు వదిలి దిగజారిపోవటమే...అనే అర్థం అయ్యేట్లయితే నేను మంత్రిని కాకూడదనే కోరుకుంటాను-" అన్నారాయన!

దేశం స్వాతంత్ర్యం పొందుతూనే ఇలా ఎందుకయి పోతోందో... అని బాధ పడ్డారు కూర్మయ్యగారు.

అంతలోనే మూడో ముఖ్యమంత్రిగారి పదివికి కూడా కాలం చెల్లింది!



1952 జెనరల్ ఎన్నికలు చెకచెకా వచ్చేశాయి.

పార్లమెంటుకు, మద్రాసురాష్ట్ర అసెంబ్లీకి ఒకేసారి ఎన్నికలు ప్రకటించారు.

ఆచార్య కృపలానీ, డా॥ ప్రఫుల్ల చంద్రఘోష్, టంగుటూరి ప్రకాశంగారు, ఆచార్య రంగా కాంగ్రెస్‌తో విసిగిపోయిన ప్రభృతులు కాంగ్రెస్‌లోంచి బైటకువచ్చి ప్రజాపార్టీని వ్యవస్థాపించారు.

"దేశంలో బలమైన ప్రతిపక్షాన్ని నిర్మించాలి: కాంగ్రెస్‌లో కొందరు వ్యక్తుల దయా దాక్షిణ్యాల మీద దేశ రాజకీయాలు సాగడానికి వీల్లేదు" అని ప్రకటించారు ప్రకాశంగారు.

కూర్మయ్యగారిని ప్రజాపార్టీలోకి రావలసిందిగా ఆహ్వానించారు ప్రకాశంగారు ఆచార్యరంగా కూడా ఆయనకు నచ్చచెప్పాలని చూశారు.

"క్షమించండి! కుమార స్వామిరాజా తన మంత్రి వర్గంలో నాకు చోటివ్వలేదని అలిగి నేను కాంగ్రెస్‌లోంచి బైటకు రావాలనుకోవటం కన్నా తెలివి తక్కువ తనం ఇంకొకటి వుండదు. అదిజరిగిపోయిన కథ! నా రక్తంలో కాంగ్రెస్ నరనరాన ప్రవహిస్తోంది. ఈ దేశంలో హరిజనోద్యమాన్ని కాంగ్రెస్ ఒకటే కొనసాగించగలదనే నమ్మకం నాకుంది అందుకని నా తుది శ్వాస విడిచేవరకూ కాంగ్రెస్‌ను వదలిబైటకు రాను" అన్నారు కూర్మయ్యగారు. సున్నితంగా ఆయన ప్రతిపక్షరాజకీయాలను తిరస్కరించారు.

ఎన్నికల తేదీ దగ్గర పడ్తోంది. పోటీచేసే అభ్యర్థుల జాబితాని రూపొందించేందుకు పార్లమెంటరీ బోర్డు సభ్యులు బెజవాడ గోపాలరెడ్డిగారు. వేముల

కూర్మయ్యగారు, గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, గొర్రిపాటి బుచ్చిఅప్పారావుగారు సభ్యులుగా ఒక కమిటీని ఏర్పాటుచేశారు.

కాకినాడ మున్సిపల్ గెస్ట్ హౌస్‌లో ఈ నలుగురూ కూర్చుని అభ్యర్థులను ఇంటర్వ్యూచేస్తున్నారు.

కావూరి పట్టాభిరామయ్యగారు తూర్పుగోదావరి జిల్లాపామర్రు నియోజక వర్గం నుంచి సీటు ఆశించారు. ఎస్.బి.పి. పట్టాభిరామారావుగారు కపిళేశ్వర పురం జమీందారుగారు కూడా అదే సీటుని కోరారు.

"కాంగ్రెస్ గెలవాలంటే టిక్కెట్ నాకే ఇవ్వండి" అన్నారు కావూరి పట్టాభిరామయ్యగారు.

"ఎందుకని" ఎదురుప్రశ్నించారు కమిటీ సభ్యుల్లో ఒకరైన గోపాలరెడ్డిగారు.

"పట్టాభిరామారావుగారు మలబారు కార్మికుల్ని కొట్టించారు. కార్మికులు ఆయన్ని ఓడించాలని చూస్తున్నారు" వివరణ ఇచ్చారు కావూరిగారు.

"మీరు కమ్యూనిస్ట్! అందుకే ఇలా మాట్లాడుతున్నారు" కోపంగా అన్నారు గోపాలరెడ్డిగారు.

"మీ బంధుమిత్రులకు ముందుగానే సీట్లు నిర్ణయించుకొని కళ్ళనీళ్ళ తుడుపు ఇంటర్వ్యూలు నిర్వహిస్తున్నారని నేనంటాను" అంతకన్న కోపంగా రెట్టించి అరిచారు కావూరి పట్టాభిరామయ్యగారు.

శాంతింపచేయడానికి కూర్మయ్యగారు చాలా శ్రమ తీసుకోవాల్సివచ్చింది!

"ఇవి ప్రజలు అంటున్న మాటలు! కాంగ్రెస్‌ను భ్రష్టుపట్టిస్తున్నారు. కాంగ్రెస్ అనేది ఒక ప్రజా ఉద్యమం అంతే" మళ్ళీ అరిచారు కావూరి.

"మీ అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తున్నాను. కానీ, ఎదుటి వారి క్రమశిక్షణా రాహిత్యాన్ని ప్రశ్నించేప్పుడు మనం క్రమశిక్షణ తప్పకూడదు కదా" అని మృదువుగా మందలించారు. కూర్మయ్యగారు. "కటువుగా చెప్పినా నిజమే చెప్పారు" అని అభినందించారు. "కానీ, ఇప్పటి పరిస్థితుల్లో మనం అరుచుకోవడంవలన ఉపయోగం లేదు" అని సర్దిచెప్పారాయనకు కూర్మయ్యగారు.

"కాంగ్రెస్‌లో పరిస్థితి ఈవిధంగా వుండగా ప్రతిపక్షపాత్ర పోషిస్తుందనుకున్న ప్రకాశంగారి ప్రజాపార్టీలో ప్రకాశంగారికి, ఆచార్యరంగాగారికి విభేదాలు ముదిరిపాకాన పడ్డాయి-" అని పత్రికలు బాధగా రాసాయి.

ప్రజాపార్టీలోంచి విడిపోయి ఆచార్యరంగాగారు "కృషిక్ లోక పార్టీ"ని వ్యవస్థాపించారు-" అని మరోవార్త వెంటనే వెలువడింది!

'ప్రతిపక్షం చీలిపోయింది. కాంగ్రెస్ అంతఃకలహాలతో కుమ్ములాటల్లో వుంది... ఈ ఎన్నికల్లో ఏ రాజకీయపక్షం లాభిస్తుందో చూడాలి....' అని ఎదురుచూస్తున్నారు జనం!

"కాంగ్రెస్‌కు ప్రకాశం గారిలాంటి ఉద్దండుడి నాయకత్వం లేదు. ప్రకాశంగారి నాయకత్వంలోని ప్రజాపార్టీకి ప్రజల అండలేదు. మధ్యలో కొత్తగా వెలిసిన కృషికలోక్ పార్టీ ఇంకా ప్రజల్లోకి వెళ్ళలేదు- ప్రకాశంగారి పాలనలో గాని, ఆ తర్వాతి కాంగ్రెస్ ప్రభుత్వాల పాలనలో గానీ అష్టకష్టాలు పడి, రహస్య జీవితాలు గడిపిన కమ్యూనిస్టులకు ఇది మంచి అవకాశం!" జోశ్యం చెప్పారు కూర్మయ్యగారు.

"అయితే కాంగ్రెస్‌కు ఓటమి తప్పదంటావా?" బ్రహ్మయ్యగారు ఆవేదనగా అడిగారు.

ఈసారి మనందరం చేతులు ముడుచుకొని కూర్చోవాల్సిందే ననిపిస్తోందినాకు! ఇప్పటికిప్పుడు ఏవో అద్భుతాలు సృష్టించి ఎన్నికల్లో విజయం సాధించటం సాధ్యంకాదనుకుంటా-" అన్నారాయన!

కూర్మయ్యగారు జ్యోతిష్యులుకాకపోవచ్చు. కానీ, ఆయన ప్రజల్లోంచి ఎదిగిన నాయకుడు. ప్రజలనాడి ఆయనకు తెలుసు. ప్రజలకు ఏం కావాలో ఆయనకు తెలుసు. ప్రజలకు ప్రభుత్వంగాని, పార్టీగాని ఏం ఇవ్వలేకపోయిందోకూడ ఆయనకు తెలుసు.

ఫలితాలు ఇందుకు భిన్నంగా ఎందుకుంటాయి?



"స్వాతంత్రం తెచ్చిన సంబరం కాంగ్రెస్‌కు ఎక్కువకాలం నిలవలేదు. ఆంధ్రులు కాంగ్రెస్‌ని ఒక కుదుపు కుదిపారు- ఏ కాంగ్రెస్‌కు ఆంధ్రులు ప్రాణప్రతిష్ఠ చేసి గాంధీజీని నాయకుడిగా ప్రతిష్టించి, కంచుకోటలా వ్యవహరించారో... ఆ ఆంధ్రులే మరోసారి కాంగ్రెస్‌ను పూర్తిగా తిరస్కరించారు-" గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఎంతో ఆవేదనతో ఎన్నికల ఫలితాల్ని విశ్లేషించసాగారు.

"కమ్యూనిస్టులు 44 స్థానాలకుపోటీ చేసి 41 స్థానాలు గెల్చుకున్నారు. హేమాహేమీలనుకున్న తెలుగు కాంగ్రెస్‌వీరులంతా ఏమైపోయారు...?? ఏమయ్యిందీ. కాంగ్రెస్‌మీద ప్రజలకింత ఆగ్రహం ఎందుకు కల్గింది...???" అని ఆయన ప్రశ్నించుకోసాగారు.

సమాధానం దొరకడంలేదు- ఎందుకంటే ఒక కారణం అయితే వెదకవచ్చు! అన్నీ కారణాలు గానే కన్పిస్తున్నాయి ఆయనకి!

"అక్కడ హైదరాబాద్ స్టేట్‌లో కూడా కమ్యూనిస్టులు ఆధిక్యతని కనపరిచారు- ఇంకాస్త ఎక్కువ సీట్లకు కమ్యూనిస్టులు పోటీ చేసివుంటే బావుండేదని అందరూ అనుకొంటున్నారు"అని ఆంధ్రప్రభలో వార్తాకథనం వచ్చింది!

"నీలం సంజీవరెడ్డిగారిపైన స్వయంగా ఆయన బావగారు తరిమెల నాగిరెడ్డిగారు జైలులో వుండి, 12వేల మెజారిటీతో గెలిచారు.

"ప్రకాశంగారి మీద పవిత్రయుద్ధం అంటూ ప్రకటించి ఆయన మంత్రి వర్గాన్ని కుప్పకూల్చిన బెజవాడగోపాల రెడ్డిగారు, కళావెంకటరావుగారు, కల్లూరి చంద్రమౌళిగారు, అల్లూరి సత్యనారాయణ గారు... వీరంతా ఘోరంగా ఓడిపోయారు. అయితే ప్రతిపక్షనాయకుడు ప్రకాశంగారు మాత్రం ఉద్ధరించిందేమీలేదు. మద్రాసు హార్బర్ నుంచి పోటీచేసి ఆయనా ఓడిపోయారు. కాకాని వెంకటరత్నంగారు ఓడిపోతే ఉక్కు కాకాని తుక్కు తుక్కు..... అని విశాలాంధ్ర పత్రికలో హేళనగా రాశారట! హరిజనసేవాపరాయణ వేములకూర్మయ్యగారు కూడా ఓడిపోయారు. కలికాలం కాకపోతే ఏమిటిది చెప్పండి..." అని ఓ కాంగ్రెస్ కార్యకర్త బ్రహ్మయ్యగారి దగ్గర వాపోయాడు.

బ్రహ్మయ్యగారు ఆ కార్యకర్తని ఓదార్చారు.

"మిత్రమా! గతంలో జరిగిన ఎన్నికలు బ్రిటిష్ వారిపై పోరాటం, సంఘసంస్కరణలు అనే అంశాల ప్రాతిపదికన జరిగాయి. కానీ, ఈ సారి జరిగిన ఎన్నికలకు ప్రాతిపదిక అదికాదు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర సాధన అనేది ఈ ఎన్నికల్లో ప్రధాన రాజకీయ నినాదంగా వుంది! కాంగ్రెస్ వారి వలన ఆంధ్రరాష్ట్రం రాదనే ప్రచారం బాగా జరిగింది!" అని వివరించారు బ్రహ్మయగారు. బ్రహ్మయ్యగారు రాజకీయ మిత్రులతో కూర్చుని సమాలోచనలు జరుపుతున్నారు.

"సముద్రానికి ఆటూపోటూ ఉన్నట్లే మన భావాల్లోకూడా ఉత్సాహ నిరుత్సాహాలుంటాయి. రాజకీయాల్లో నాది భీముడిపాత్ర! నలుగురిని తన్నడం, నలుగురితో తన్నులు తినడం లా వుంటుంది. నా పరిస్థితి! కానీ కూర్మయ్య గారి పరిస్థితి అదికాదు. ఆయనది అర్జునుడి పాత్ర! కర్మణ్యేవాధికారస్తే, అన్నట్లు, పని చేసుకుపోవడమే తప్ప ఫలితాల కోసం ఎదురు చూడవద్దని కృష్ణుడు అర్జునుడికి చెప్పినట్లు గాంధీ గారు కూర్మయ్యగారికి నూరిపోశారు- అందువలన ఆయన ఓటమిపొందినా నిరుత్సాహపడరు-" అన్నారు బ్రహ్మయ్యగారు.

"ఈ ప్రజలకుచేసిన మేలు, పీనుగకు చేసిన జాగరణ ఒకటే... అన్నారు మన గ్రామపెద్ద గొర్రెపాటి బాలకృష్ణమ్మగారు. అదే నిజం అనిపిస్తోంది-" అన్నారు ఇంకో కార్యకర్త.

"ఆ బాలకృష్ణయ్యగారే తన అవసాన కాలంలో తన పెద్ద కొడుక్కి ఉపదేశించిన మంత్రం ఏమిటో తెలుసా... "ప్రజావశీకరణం" అన్నారు మళ్ళీ నవ్వుతూ బ్రహ్మయ్యగారు.

"మనకి ఏది లేదో....ఏది తక్కువగా వుందో దాని గురించే మనిషి ఆలోచించటం మంచిదే! ముఖ్యంగా రాజకీయ వాదులకు అది మరీ అవసరం.... "అయితే తన దగ్గర లేనిదేమిటో, తన లోపం ఏమిటో తెలుసుకోగల్గిన వాడే " రాజకీయాల్లో రాణిస్తాడు" అని బ్రహ్మయ్యగారు చెప్పిన మాటలు ఆనాడు అక్కడ అందరికీ వేదవాక్కు!



"కేవలం మద్రాసుకోసం ప్రత్యేక ఆంధ్రాని ఆలస్యం చేస్తామంటే సహించం-" హెచ్చరించారు పుచ్చల పల్లి సుందరయ్యగారు.

"మద్రాసులో ఆస్తులున్న కాంగ్రెస్‌వారు తమ ప్రయోజనాల కోసం ఆంధ్రుల ప్రయోజనాల్ని బలిచేస్తున్నారు" ఆరోపించారు చండ్ర రాజేశ్వరరావుగారు.

1952 ఆగస్ట్ 15: స్వామీ సీతారాం 36రోజులపాటు నిరవధిక నిరాహారదీక్ష చేశారు. ఆచార్య వినోభాభావే వారిని బలవంతంగా దీక్ష విరమింపచేశారు. దీక్ష విరమించాడని చాలామంది స్వామీ సీతారాంగారిని అవహేళన చేశారు.

"మీ రాజకీయాలు మాకొద్దు. ఆంధ్ర రాష్ట్రం మాకు కావాలి- జై ఆంధ్ర!!" అంటూ నినాదం ఇచ్చారు వావిలాల గోపాల కృష్ణయ్యగారు.

1952 అక్టోబర్ 23వ తేదీ -

పొట్టి శ్రీరాములుగారు ఆమరణ నిరాహారదీక్ష ప్రారంభించారు.

సత్వరాంధ్ర రాష్ట్ర నిర్మాణం జరిపి పొట్టి శ్రీరాములు గారి ప్రాణాలు నిలపండి... అని పదకొండు జిల్లాల తెలుగువారూ ప్రధాని నెహ్రూకు మొరపెట్టుకున్నారు.

"మీరు మద్రాసును అడగడం మానేయండి. మీకు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఇవ్వటానికి అభ్యంతరం లేదు అని ప్రకటించారు నెహ్రూ.

"నెహ్రూగారు.... అభ్యంతరం లేదు అంటున్నారుగాని, అంగీకరిస్తున్నాను" అనలేదుగదా... అన్నారు నిరాశగా పొట్టిశ్రీరాములుగారు! ఆయన నిరసన దీక్షను కొనసాగించడానికే నిర్ణయించారు.

"ప్రకాశంగారు మద్రాసు కోసం పొట్టి శ్రీరాములు గార్ని బలిపెడుతున్నారు-" అని విమర్శించారు కమ్యూనిస్టులు!

ఊరూవాడా "జై ఆంధ్ర" నినాదాలు మిన్ను ముట్టుతున్నాయి.

ఢిల్లీకి వెళ్ళిన ఆంధ్ర ప్రతినిధి బృందం నెహ్రూని కలిసి సంప్రదింపులు జరిపి వుత్తచేతులలో తిరిగివచ్చిందని తెలుగు పత్రికలు రాశాయి ... అయినా!

తెలుగు పెద్దల ప్రయత్నాలు ఫలించవు. ప్రకాశంగారు మద్రాసు పట్టు వదలరు. నెహ్రూగారు ఆంధ్ర రాష్ట్రాన్ని ప్రకటించరు. శ్రీరాములుగారు నిరాహారదీక్ష విరమించరు.

1952 - డిసెంబర్ 18

పొట్టి శ్రీరాములుగారి దీక్ష ప్రారంభమై అది 58 వరోజు...

తెలుగు జాతికది కడు దుర్దినం. ఆరోజు సూర్యుడు ఉదయించకుండాన్నే అస్తమించాడు."గాంధేయ మార్గంలో పోరాడిన యోధుడు పొట్టి శ్రీరాములుగారు ఆంధ్ర రాష్ట్రంకోసం ఆత్మార్పణ చేశారు-" అన్న వార్త గుప్పుమంది. రేడియో, వార్తా పత్రికల ద్వారా క్షణాలలో వార్త తెలుగునేల నాలుగు చెరగులా వ్యాపించింది.

చలించిపోయింది ఆంధ్రలోకం.

కదిలిపోయింది తెలుగుహృదయం.

తల్లడిల్లిపోయింది త్రిలింగదేశం.

"ఒక మహావ్యక్తి మహాదీక్షను కొనసాగిస్తూ మహాభినిష్క్రమణం చేశాడు!!" అని విలపించారు మహర్షి బుల్లుసుసాంబమూర్తిగారు. కాంగ్రెస్ నేతలు ప్రజల్లోకి రావటానికే భయపడ్డారు. పాలనాయంత్రాంగం నిర్వీర్యమై నిస్తేజంగా మారిపోయింది. పారని ఏరులా స్తంభించిపోయింది పౌరజీవనం.

1952 డిసెంబర్10.

శ్రీరాములుగారు ప్రాణార్పణం చేసిన మరుసటిరోజు-

"మద్రాసులేకుండా పదకొండు తెలుగు జిల్లాలతో ఆంధ్రరాష్ట్రాన్ని స్థాపించటానికి కేంద్ర ప్రభుత్వం అంగీకరిస్తోంది-" అని నెహ్రూగారు ప్రకటించారు.

శ్రీరాములు గారి కుటుంబానికి పండిత నెహ్రూ తన ప్రగాఢసానుభూతి తెలిపారు.

ఈ ప్రకటన ఒకరోజు ముందుగా వచ్చినా శ్రీరాములుగారినీ, పోలీసు కాల్పుల్లో మరణించిన పదిమంది తెలుగుబిడ్డల్ని దక్కించుకోగలిగే వాళ్ళం కదా...! అన్నారు ఆవేదనగా కూర్మయ్యగారు.

అటు శ్రీకాకుళం మొదలు ఇటు హైదరాబాద్ వరకూ తెలుగు వాడైన ప్రతివ్యక్తీ విలపించాడు శ్రీరాములుగారి మరణానికి!

మనబ్రోలు దగ్గర గండిదాటి ఎలాగోలా మద్రాసుచేరి శ్రీరాములు గారి అంతిమయాత్రలో పాల్గొన్నారు ప్రకాశంగారు.

రాష్ట్ర స్థాపనకు గల అవకాశాల్ని. సమస్యల్ని వివరంగా పరిశీలించి నివేదిక అందించేందుకు రాజస్థాన్ ప్రధాన న్యాయమూర్తి కె.యస్.వాంఛూ అధ్యక్షతన ఒక కమిటీని నియమిస్తున్నట్లు నెహ్రూ ప్రకటించారు.

1953 జనవరి 6 మద్రాసునగరం!

ముఖ్యమంత్రి రాజాజీతో సంప్రతింపులు ప్రారంభించారు వాంఛూగారు. "కేవలం ఐదు రోజుల్లో నా నివేదికను రూపొందిస్తాను. అన్ని పక్షాలవారిని నన్ను కలుసుకోవలసిందిగా ఆహ్వానిస్తున్నాను" అని ప్రకటించారు వాంఛూగారు.

"అక్టోబర్ 1వ తేదీన ఆంధ్రరాష్ట్రం ఏర్పడుతుంది-" అని పార్లమెంట్‌లో ప్రకటించారు నెహ్రూ. సభ్యుల ఆందోళనలో ప్రభుత్వం కూడ పాల్పంచుకొంటున్నట్లు ఆయన పేర్కొన్నారు.



కొత్త రాష్ట్రానికి రాజధాని ఎక్కడ వుండాలి...? హైకోర్టు ఎక్కడవుండాలి? ముఖ్యమంత్రిగా ఎవరుండాలి... ఇవన్నీ జటిల సమస్యలుగా మారాయి.

మద్రాసు నగరం మీద ఆశవదులుకున్నారంతా!

"హైదరాబాదుని కలుపుకొందాంలెండి! మద్రాసుని వదిలేయండి..." అనుకోసాగారు అంతర్గతంగా ఒకరితో ఒకరు కాంగ్రెస్ వాదులు!

కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి "శ్రీబాగ్" ఇంట్లో ఓ సమావేశాన్ని ఏర్పాటు చేశారు శివలెంక శంభుప్రసాద్ గారు. ఆయన నాగేశ్వరరావుగారి అల్లుడు. ఆంధ్రపత్రిక సంపాదకులు ఆరోజుల్లో రాజకీయవేత్తలతో చక్కటి సంబంధాలు నడిపిన వ్యక్తి.

"ఉత్తరకోస్తా విశాఖప్రాంతం, దక్షిణకోస్తా గుంటూరు, నెల్లూరు ప్రాంతం, రాయలసీమ... ఈ మూడు ప్రాంతాలకు సమాన ప్రాతినిధ్యం ఇచ్చేలా ఒకచోట రాజధాని, ఇంకోచోట హైకోర్టు మూడో ప్రాంతంలో ఆంధ్రాయూనివర్శిటీ నెలకొల్పాలని శ్రీభాగ్‌లో జరిగిన సమావేశంలో నిర్ణయించాం" అని అధికారికంగా ప్రకటించారు డా॥బెజవాడ గోపాలరెడ్డిగారు.

"రాయలసీమవారు ఈ మూడింటిలో ఏదికోరితే అది వారికి ఇవ్వాలి" శ్రీబాగ్ ఒప్పందం వివరాలు తెలిపారాయన.

ప్రధాని నెహ్రూ పార్లమెంట్‌లో ప్రకటించినట్లు అక్టోబర్ 1వ తేదీ నాటికి ఏర్పడబోతున్న కొత్త ఆంధ్రరాష్ట్ర రాజధాని నిర్ణయం చేయటానికి ఆంధ్రశాసన సభ్యులందరూ జూన్1వ తేదీన మదరాసు అసెంబ్లీ హాల్లో సమావేశమయ్యారు.

ప్రకాశంగారి అధ్యక్షతన సభజరిగింది.

'రాయలసీమకు రాజధాని రావల్సిందే" పట్టుబట్టారు ప్రకాశంగారు. ప్రకాశంగారి పట్టుదల ఎలా వుంటుందో అందరికీ తెలుసు.

జూన్ 5వ తేదీన మద్రాసు శాసనసభలో ఇదేవిషయం మీద చర్చ జరిగిన తర్వాత కర్నూలు నగరాన్ని తాత్కాలిక రాజధానిగా నిర్ణయిస్తూ తీర్మానం చేశారు. కమ్యూనిస్టులు, రంగాగారి కృషిక్ లోకపార్టీ ఈ నిర్ణయానికి వ్యతిరేకంగా ఓటు వేసింది-కానీ, ప్రకాశం గారి మాటే నెగ్గింది!

ఈమేరకు రాజధాని మార్పు కోరుతూ అసెంబ్లీలో వావిలాల గోపాల కృష్ణయ్యగారు బిల్లు ప్రవేశపెట్టారు. సభ ఏకగ్రీవంగా ఆమోదించింది. ఒక నెల రోజులపాటు మద్రాసు రాష్ట్ర అసెంబ్లీలో ఆంధ్రరాష్ట్ర ఏర్పాటు పైన హోరాహోరి చర్చలు జరిగాయి.

"జవహర్‌లాల్, వల్లభభాయ్ పటేల్, పట్టాభి సీతారామయ్య.... ఈ ముగ్గురూ కలిసి రూపొందించిన జె.వి.పి నివేదికని ఆమోదించదలసిందిగా ఆంధ్ర కాంగ్రెస్ కమిటీకి సూచనలు అందాయి" అని వార్తలువచ్చాయి.

ఆంధ్రులు మద్రాసుపై హక్కులు వదులుకొని తెలుగుమాట్లాడే పదకొండు జిల్లాలతో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలనేది ఈ జె.వి.పి నివేదిక సారాంశం...!!

"ముందు ఆంధ్రరాష్ట్రాన్నీ ఏర్పాటు కానియ్యండి! తర్వాత మద్రాసు గురించి ఆలోచిద్దాం... సంప్రతింపుల మార్గాన పోదాం" అన్నారు పట్టాభిగారు.

"మొత్తంమీద కేంద్రం ఇస్తానన్నదీ అదే... ఆంధ్రులు కోరిందీ అదే అన్నట్లుగా వుందీ తతంగం" అన్నారు కూర్మయ్యగారు.

"కేంద్రప్రభుత్వం ఆంధ్రస్పెషల్ ఆఫీసర్‌గా చందూలాల్ త్రివేదిని జూన్ 15, 1953వ తేదిన నియమించింది. ఆయన ఆగస్ట్ 5వ తేదీన మద్రాసు వచ్చి రాష్ట్ర విభజన కార్యక్రమాన్ని దగ్గరుండి జరిపించాడు. ఆయన నియమించిన సలహా సంఘంలో తెన్నేటి విశ్వనాథంగారు, సంజీవరెడ్డిగారు, గౌతులచ్చన్నగారూ వున్నారు.

ఆగస్ట్ 13 నుంచి సెప్టెంబర్ 12 వరకూ నెలరోజుల పాటు పార్లమెంట్‌లో రాష్ట్ర విభజనగురించి చర్చ జరిగింది. పార్లమెంట్ ఆమోదించిన బిల్లుమీద భారతరిపబ్లిక్ అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్ గారు సంతకం చేశారు- దాదాపు నలభైసంవత్సరాల ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఆందోళనా పర్వం శ్రీరాములుగారి ప్రాయోపవేశంతో ఇలా ముగిసింది-" అన్నారాయన అవేదనగా!



"తమరు అలా హరిజన కార్యక్రమాలలో నిమగ్నమయ్యే వున్నారండి! అంతలోనే కొత్తగా ఏర్పడిన ఆంధ్రరాష్ట్రానికి ప్రకాశంగారు కాంగ్రెస్ వారి మద్దతుతోనూ, రంగాగారి మద్దతుతోనూ మిశ్రమ మంత్రివర్గం ఏర్పాటు చేశారండీ- ఒక ఏడాది పాలించారండీ... అంతలోనే ఆయన మీద అవిశ్వాస తీర్మానం వచ్చిందండీ... ఆయన ప్రభుత్వం మళ్ళీ కుప్పకూలిపోయిందండీ! ఆంధ్రరాష్ట్రానికి ఆదిలోనే హంసపాదులా ఈ పడిపోయే

ప్రభుత్వాలు ఏం ఖర్మం అండీ..." ఓ కాంగ్రెస్ కార్యకర్త ఆవేదనగా కూర్మయ్యగారితో. మనసు విప్పి తన ఆలోచనల్ని పంచుకొంటున్నాడు-

"అవును! ఆంధ్రులు ప్రస్తుతం రాష్ట్రపతి పరిపాలనలో వున్నారు! ప్రజలేమనుకొంటారోననే భయం ఆంధ్రనాయకులకు లేదు. ఆంధ్రులు ఉదారులు వారు ఏమీ పట్టించుకోరు. అందుకే ఆంధ్రాలో ఏదీ అసాధ్యమూకాదూ... ఏదీ సాధ్యమూ కాదు" అన్నారు పైకినవ్వుతూనే కూర్మయ్యగారు!!



"మనదేశ జనాభాలో హరిజనుల సంఖ్య సుమారు నాల్గవ వంతు వుంటుందని ప్రభుత్వ లెక్కలు చెప్పక చెప్పుచున్నవి. హరిజనులు హిందూసంఘంలో ఒకశాఖయనియూ, హిందూమత సంప్రదాయాలకు అలవడిన వారగుటచేత, హిందూమతాన్ని అతి భక్తి వినయాలతో అవలంబించుచున్నారనుట నిర్వివాదం. హరిజనులని పిలువబడుచున్న మాల-మాదిగ తెగల ప్రజలలో అంతఃకలహాలు పెచ్చుపెరిగి 'ఎవరికివారే యమునా తీరేగా' ఒకరి గొప్పలొకరు ఎంచుకొంటూ, సహనమూ సహకారమూ లేక కలిసికట్టుతనంలేక, ఉభయ భ్రష్టత్వమునొంది అనేక అనర్థాలకు గురియగుచున్నారు-" జి. కృపలానీ అనే రచయిత 1953 సెప్టెంబర్ 25 తెలుగు స్వతంత్ర పత్రికలో రాసిన వ్యాసంలో తన ఆర్తినీ బాధనీ వెళ్ళగక్కాడు.

"ఆంధ్రహరిజనులు: బహునాయకత్వం' పేరుతో ఈ వ్యాసం వెలువడింది.

"విషయం వాస్తవమేకావచ్చు గానీ. మనవాళ్ళని మనం ఇలా రచ్చకెక్కిస్తే అగ్రవర్ణాలవారి ముందు చులకనకామా...?" అని కూర్మయ్యగారు కృపలానీగారిని మందలించారు కృపలానీగారు తన అభిప్రాయాన్ని మార్చుకోలేదు.

"కాంగ్రెస్ సంస్థ పూజ్యబాపూజీ నాయకత్వం క్రింద నడచినన్నాళ్ళూ హరిజన సేవకసంఘం ద్వారా హరిజనుల సాంఘిక. ఆర్థికోద్ధరణ కోసం కృషిచేసింది. హరిజనుల ఆర్థికోన్నతికోసం అనేక సహకారాలు అందించింది. విద్యావిషయాల కానీండి. ఉన్నత ఉద్యోగాలు పొందటం గురుంచికానీండి. అన్నిరంగాల్లోకూడా హరిజనులకు ఆధిక్యతని సమకూర్చి పెట్టింది. కానీ. ఇవ్వాళ హరిజన సంక్షేమం గురించి మాట్లాడుతున్న నాయకుడెవరున్నారు చెప్పండీ!!" అన్నారు కృపలానీగారు కూర్మయ్యగారు చిరునవ్వునవ్వారు.

"నువన్నట్లు. ఏ కార్యక్రమం ఎలానడిచినా హరిజనోద్ధరణ కార్యక్రమం మాత్రం చాలా ఉత్తమస్థాయిలో కాంగ్రెస్ ప్రభుత్వాల హయాములోనే నడిచిందనే మాట

వాస్తవం వసతి గృహాలు, ఉచిత భోజనాలు వంటి పథకాల్లో హరిజనులకే మొదటి ఛాన్సివ్వడం జరిగింది..." అన్నారు కూర్మయ్యగారు!

మీరు మంత్రి వర్గంలో ఉన్నకాలంలోనే హరిజనుల పౌరహక్కుల రక్షణ, సాంఘిక దురాచారాల నిర్మూలనల కోసం కావలసిన చట్టాలు... తయారయ్యాయి. ఆనాటి మద్రాసు రాష్ట్రం దేశంలోనే హరిజనసేవలో ముందంజలో వుంది- మీరు ఆపదవిలోంచి దిగి పోయిన తర్వాత స్వాతంత్రం వచ్చి ఆరేళ్ళయ్యింది! మీరు చేసిన దాన్ని దాటి ఒక అంగుళం హరిజనోద్ధరణ కార్యక్రమం ఏదైనా అదనంగా జరిగిందా చెప్పండి...." కృపలానీగారు సూటిగా అన్నారు కూర్మయ్యగారితో - కూర్మయ్యగారు మౌనంగా వుండిపోయారు.

"దక్షిణ భారతదేశపు ఏకైక హరిజన నాయకులు మీరు! ఈ రోజున ఈ వినాయకులు మీకు ఏపాటి విలువ ఇస్తున్నారో మీరు పట్టించుకోకపోయినా లోకం గమనిస్తోంది-" అవేదనగా అన్నారు కృపలానీగారు.

"రాజకీయపార్టీలకు హరిజనుల ఓట్లు కావాలిగానీ, హరిజనోద్ధరణ వాటికి అవసరం లేదు. హరిజనులకు తమ భవిష్యత్తు, తమమంచీ చెడులగురించిన ఆలోచనలేదు. మళ్ళీ మీవంటి హరిజననాయకులు రంగంలోకి వచ్చిహరిజనుల్ని ఏక త్రాటి మీదకు తీసుకొచ్చి ఒకే మాట, ఒకే బాటగా నడిపించకపోతే, ఈ దేశంలో హరిజనులకు చాలా నష్టంజరుగుతుంది- మీరు రాజకీయసన్యాసం విరమించి ఉత్తేజపూరితమైన హరిజన రాజకీయాలు నడవలసిన సమయం ఇదే! అన్నారు కృపలానీ!

కూర్మయ్యగారు శూన్యంలోకి చూస్తుండిపోయారు.

మబ్బు పట్టిందని బద్ధకించి సూర్యుడు ఉదయించడం మానేశాడా... అన్నట్లుంది వాతావరణం. సూర్యుడు రాని రోజుని "దుర్దినం" అంటారుట! వానకురవని మేఘాలు పట్టిపోయిన పశువుల్లా రైతుకూలీలకు భారంగా కదుల్తున్నాయి.

"మనిషిగా పుట్టినందుకు ఈ జన్మలో హరిజన సేవ చేయటం ఒక్కటే నా విధి. నా డ్యూటీ నేను చేస్తున్నాను. ఈ పదవులు, ఎన్నికలు, గెలవటాలు, ఇవన్నీ డ్యూటీలో ఒక భాగమే! పదవి పొంగానే బాధ్యతల్లోంచి పారిపోవటం కన్నా పిరికితనం ఇంకొకంటి వుండదు-" ఖండితంగా అన్నారు కూర్మయ్యగారు!



ఈసారి కాంగ్రెస్ గెలిచింది! కూర్మయ్యగారూ గెలిచారు -

సంబరంగా ఎగిరిగంతులేశారు కాంగ్రెస్‌కార్యకర్తలంతా!

"కెరటం ప్రతిఒక్కడికీ ఆదర్శం కావాలి. అది పడినా మళ్ళీ లేస్తుంది!" అన్నారు సంతోషంగా వేముల కూర్మయ్యగారు.

గత ఎన్నికల్లో స్వల్ప తేడాతో ఓటమి చవిచూసినా, ఈ ఎన్నికల్లో ఘన విజయంసాధించి, తిరిగి హరిజనుల బలం ఏమిటో చాటి చెప్పారాయన!

"స్వాతంత్ర్యం తెచ్చుకున్న ఆనందమేలేకుండా పోయింది! గత ఎలెక్షన్లలో తుక్కుతుక్కుగా ఓడిపోయారు మనవాళ్ళు! అంతలోనే ఆంధ్రోద్యమంవచ్చింది. శ్రీరాములుగారు పోయారు. మనం మద్రాసును కోల్పోయాం. ఏదీ మనకు అనుకూలంగా జరగలేదు. మళ్ళీ మధ్యంతర ఎన్నికలొచ్చి ప్రాణం పోసింది! ఊపిరాడుతున్నట్లనిపిస్తోంది ఇప్పుడు-" అన్నారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు.

కృష్ణాజిల్లాలో గెలిచిన కాంగ్రెస్ శాసన సభ్యుల సన్మానసభ చల్లపల్లి రాజాగారి కోటలో జరుగుతోంది!

బ్రహ్మయ్యగారు సభాధ్యక్షులు.

ఆరోజున ఆయన చారిత్రాత్మక ఉపన్యాసం చేశారు. ఆలోచించగల ప్రతిఒక్కణ్ణీ తట్టి లేపింది ఆయన ప్రసంగం.

"అహంకారంతో వ్యవహరిస్తే ఎంతటి వారికైనా ఏ గతి పట్టుందో ఆంధ్రులు స్వయంగా నిరూపించారు. జనచైతన్యం ఎలావుంటుందో ఆంధ్రుల్ని చూసి తెలుసుకోవచ్చు." అంటూ తన ప్రసంగం ప్రారంభించారాయన!

"1934లో జస్టిస్ పార్టీ ప్రభావం మధ్యందినమార్తాండుడిలా వెలుగుతోంది! ఆరోజుల్లో జస్టిస్‌పార్టీ అభ్యర్థులమీద పోటీకి నిలబడేందుకు కాంగ్రెస్‌కు మనుషులే కరువయ్యారు. అలా ఒక వెలుగువెలిగిన ధనికవర్గం కూటమి ఏమయ్యిందీ...? లక్షలు రెండు చేతులా నడిపించగల పవర్ వున్నవాళ్లు! ఎవడురా! మాకెదురెవ్వడురా! అని విర్రవీగారు... ఐదేళ్ళు గడిచేసరికి నామరూపాల్లేకుండా తుడిచి పెట్టుకుపోయారు.

ముక్కు పచ్చలారని నూనూగు మీసాల యువకులు బెజవాడ గోపాలరెడ్డి, నీలంసంజీవరెడ్డి, కల్లూరిచంద్రమౌళి... తెన్నేటి విశ్వనాథం... వీళ్ళు హేమాహేమీల్ని ఓడించి రాజకీయ రంగప్రవేశం చేశారు!

1937లో వచ్చిన ఎన్నికల్లోగానీ, 46లో వచ్చిన ఎన్నికల్లో గానీ, కాంగ్రెస్ వంక కన్నెత్తి చూడగల దమ్ములు ఎవరికున్నాయి అప్పట్లో!

కానీ మనవాళ్ళు మాత్రం ఏంచేశారు...?

"కర్రను పెట్టినా, పుల్లను పెట్టినా ఓట్లు వేసి తీరాల్సిందే" అన్నట్లు ప్రజల్తో వ్యవహరించారు.

దాని ఫలితమే మిత్రులారా! 1952 ఎన్నికల్లో కమ్యూనిస్టులకు పట్టంకట్టి కాంగ్రెస్‌కు మొండిచెయ్యి చూపించారు జనం!

సరే!1952 లో గెలిచిన కమ్యూనిస్టులు తమ గెలుపుని కేవలం తమ ప్రయోజకత్వంగా భావించుకోవటం మనం అంతా కళ్ళారా చూశాం! ఈ మధ్యంతర ఎన్నికల్లో రాబోయే ప్రభుత్వానికి ముఖ్యమంత్రి ఫలానా... ఆర్థిక మంత్రి ఫలానా... హోంమంత్రిని నేను... అని ప్రచారం చేసుకున్నారు... కలలుగన్నారు... చివరికి ఏమయ్యింది! కమ్యూనిస్టుల్ని ఈ ఎన్నికల్లో ప్రజలు తిరస్కరించారు. మళ్ళీ కాంగ్రెస్‌కే పట్టం కట్టారు.

కాబట్టి మిత్రులారా! అహంకార పూరితులకు పతనం తప్పదని చరిత్ర రుజువు చేస్తోంది! ఈ విజయోత్సవసభలో విజయతిలకం నొసట దిద్దుకున్న విజేతలు చల్లపల్లిరాజా... శ్రీ శివరామ ప్రసాద్ బహద్దూర్‌గారు గానీ, మల్లిపూడి రాజేశ్వర రావుగానీ, హరిజనసేవా పరాయణుడు వేముల కూర్మయ్యగారుగానీ అడుసుమల్లి సుబ్రహ్మణ్యేశ్వరరావుగారు గానీ... తూర్పుకృష్ణనుంచి గెలుపొందిన ఈ నల్గురికీ నాదొకటే విన్నపం...!

కాంగ్రెస్ అనేది ప్రజా సంస్థ! ప్రజాసేవచేస్తూ ప్రజల ప్రేమను చూరగొంటూ మీ విద్యుక్త ధర్మం నిర్వహించండి! ఇది మరిచి పోతే, 1962 ఎన్నికల్లో మళ్ళీ ప్రజలు కాంగ్రెస్‌కు బుద్ధి చెప్తారు సుమా!!" అని హెచ్చరిస్తూ ఎన్నికల్లో గెలిచిన నలుగురినీ సన్మానించారు. గొట్టిపాటి బ్రహ్మయ్యగారు.

కూర్మయ్యగారు తనకు జరిగిన సన్మానానికి ధన్యవాదాలు చెపుతూ సభాధ్యక్షులు బ్రహ్మయ్యగారు ప్రస్తావించిన అంశాలకు ప్రతిస్పందించారు.

"అధికారంలో వున్నవారి పట్ల ప్రజావ్యతిరేకత సహజమైన అంశం! ప్రజల్ని విస్మరించిన ప్రభుత్వాలు రూపులేకుండా పోతాయి. గత ఏడెనిమిది సంవత్సరాలుగా రాష్ట్రంలో రాజకీయ అస్థిరత కొనసాగుతోంది. ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని తెలుగు వారైన కాంగ్రెస్‌నాయకుల పాత్ర ఇందులో గణనీయంగానే వుంది.

ఒక్క ఈ ఎన్నికల్లోనే కాంగ్రెస్‌లో వివిధగ్రూపులు ఏకం అయ్యాయి. ఐక్యకాంగ్రెస్ పేరుతో ఇతర కాంగ్రెస్ గ్రూపులు కలిసి పనిచేయటం వలన కమ్యూనిస్టుల బలాన్ని 15 సీట్లకు తగ్గించగలిగారు మనవాళ్ళు! ఈ ఎన్నికల్లో తన 88వ ఏట ప్రకాశంగారు రాష్ట్రం అంతా పర్యటించి. కాంగ్రెస్ అభ్యర్థుల విజయం కోసం కృషిచేశారు. ఒంగోలు నుంచి ఆయన పోటీచేసి గెలిచారుకూడా! గోపాలరెడ్డిగారు. కళా వెంకట్రావుగారు ప్రభృతులంతా గెలుపొందారు. ఇది సంతోషించదగిన విషయం!

అందరికన్నా చిన్నవయస్సులో మంత్రి అయిన బెజవాడ గోపాలరెడ్డిగారు అందరికన్నా చిన్నవయసులో ముఖ్యమంత్రిగా కూడ ఎన్నికయ్యారు.

"మీ అందరికి శుభవార్త ఏమంటే త్వరలోనే హైదరాబాద్ సంస్థానం కూడా ఆంధ్రరాష్ట్రంలో విలీనం కాబోతోంది! విశాలాంధ్ర ఏర్పడబోతోంది. అప్పుడే మనందరం కన్నకలలు నిజమౌతాయి.

విశాలాంధ్రలో హరిజనులు, గిరిజనులు, ఇతర నిమ్నవర్ణాలవారు, వెనకబడిన వర్గాలవారందరికీ మేలు కలుగుతుందని నేను ఆశిస్తున్నాను.

నాకంఠంలో కొన ఊపిరిదాకా కాంగ్రెస్‌వాదిగానే వుంటానని, హరిజన సేవా పరమావధిగా పనిచేస్తానని ఈ సభా ముఖంగా ప్రకటిస్తున్నాను-" అన్నారు కూర్మయ్యగారు.... తన సన్మానసభలో!

"స్వరాజ్యసాధన, హరిజనోద్ధరణ విశాలాంధ్ర ఏర్పాటు... ఇవి మూడూ తెలుగువారి హృదయాల్లో కాంగ్రెస్‌ను ఎల్లకాలం ఉన్నత స్థితిలో నిలిపి ఉంచుతాయి" అని ప్రకటించారు కూర్మయ్యగారు!!

ఆయన స్మృతిపథంలో రంగుల చిత్రాలు కాంతులు విరజిమ్ముతున్నాయి....

స్వతంత్ర భారతంలో హరిజనులు మరింత అస్పృశ్యులై మిగిలిపోతారనే పాశ్చాత్యుల దురహంకార వ్యాఖ్యల్ని వమ్ముచేస్తూ అట్టడుగు మనుషులు ఎవరికీ తీసిపోని రీతిలో ఉన్నతస్థితిని పొందిన ఊహాచిత్రాన్ని ఆయన చిత్రించుకోసాగారు.

అవి బంగారుకలలు. అతిసమీప భవిష్యత్తులో అవి వాస్తవానికి వస్తున్న వాస్తవాన్ని ఆయన ఊహించుకోసాగారు.

సమానం జనం - సమానం ధనం అన్న రుగ్వేద సూక్తిని ఆయన స్మరించు కోసాగారు.

సర్వేజనా స్సుఖినోభవంతు





చక్రవర్తుల రాజగోపాలాచారి మ... మంత్రిమండలి సభ్యులతో

మంత్రిగా
ప్రభుత్వోద్యోగులతో

మహారాష్ట్ర
దళితనాయకునితో
శ్రీ కూర్మయ్యదంపతులు







శ్రీ జగ్జీవన్‌రామ్, మండలి కృష్ణారావు, మాగంటి అంకినీడులతో





దుర్గాబాయి దేశ్‌ముఖ్ తో







మహాత్మగాంధీ అస్థికలు నిమజ్జనం సందర్భముగా

రాష్ట్రప్రభుత్వం ప్రతినిధిగా మహాత్మగాంధి అస్థిలతో( విజయవాడలో) అమ్మిదేవర కాళేశ్వరావు,కళావెంకట్రావు పాధం సుబ్రమణ్యం ప్రభృతులతో



ముఖ్యమంత్రి కాసుబ్రహ్మానందరెడ్డి,
కేబినెట్ మంత్రులు,
ఇతర ప్రముఖులతో



1962లో గుడివాడలో ఎన్నికలసమయంలో



అతి సామాన్యుడు కూడా అర్థం చేసుకో గలిగేలా జటిలమైన గొప్ప శాస్త్ర విషయాలను, అత్యంత తేలికైన భాషలో అందించి, అపురూపమైన వైద్యరచయితగా రాష్ట్ర వ్యాప్తంగా విశేష ప్రచారాన్ని పొందిన డా॥ జి.వి. పూర్ణచంద్ తెలుగునాట ప్రసిద్ధుడైన ఆయుర్వేద వైద్యుడు.

'కాంతి స్వప్న' కవితా సంపుటి వీరి తాత్త్విక దృష్టికి, 'సప్తసింధు' చారిత్రక నవల వీరి పరిశోధనా శక్తికి నిదర్శనాలుగా నిలిచాయి.

తెలుగునాట ఉవ్వెత్తున లేచిన మినీ కవితా ఉద్యమంలో వీరు ముఖ్య భూమిక వహించారు. కవిత్వాన్ని ప్రజల్లోకి తీసుకు వెళ్ళే ఉద్దేశ్యంతో 1980-84 లో ఊరూరా మినీ కవితా ప్రదర్శనలు నిర్వహించారు. అప్పట్లో అదొక సంచలనం.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సభ్యునిగా అనేక సాహితీ సాంస్కృతిక సామాజిక సంస్థల నిర్వాహకుడిగా ఉద్యమస్ఫూర్తితో కృషి చేసి గుర్తింపు పొందారు.

అపార్థాల పాలైన ఎందరో దంపతుల్ని వీరు కౌన్సిలింగ్ ద్వారా తిరిగి కలిపారు. అపోహలతో అనారోగ్యం కొని తెచ్చుకున్న ఎందరినో తన అమూల్య సలహాల ద్వారా ఆరోగ్యవంతులుగా తీర్చిదిద్దుతున్నారు.

"దీనజన బాంధవుడు శ్రీ వేముల కూర్మయ్య" గ్రంథం వీరి 22వ రచనగా తెలుగు పాఠకలోకానికి సవినయంగా సమర్పిస్తున్నాం!



డోర్ నెం. 28-3-49, సంజీవయ్య కాలనీ,
అరండల్‌పేట, విజయవాడ - 520 002